త్వరలో విడుదల!




వి. శాంతారాం ప్రొడక్షన్స్

# సెహ్రా

(ఈస్ట్‌మన్ కలర్ హిందీ చిత్రం)

కొత్త నటుడు: ప్రశాంత్,

ఉల్హాస్, లలితాపావర్, మన్‌మోహన్‌కృష్ణ, ఎం. రాజన్, ముంతాజ్ నటించిన

సాంఘిక చిత్రం

| కథ: | పాటలు: | దర్శకుడు: |
|---|---|---|
| షమ్స్‌లఖ్నవీ | హస్రత్‌జయ్‌పురీ | వి. శాంతారాం |

—అలంకార్ రిలీజ్


పెళ్ళిళ్ళకు శుభకార్యాలకు తగ్గ అనేక రకాల వస్త్రాలు
TS
6 గ నుండి 9 గ
వరకు రూ. 50 నుంచి
రూ 500వరకు ధరల్లో
రకరకాల కొత్త డిజైనుల చీరెలు కాశ్మీరు
బెనారసు మైసూరు కంచి ధర్మవరం
గద్వాల ఎల్కులు ఉలెన్‌లు చేనేత

# చందమామ

కథల మాసపత్రిక



చందమామ అందరూ చదువుతారు

చందమామ పబ్లికేషన్స్

మద్రాసు - 26

# ఈ సంచికలో





ముఖచిత్రం

చిత్రకారుడు వడ్డాది పాపయ్య

మూర్తిగారి "నన్ను గురించి కాదు", పి. జె లక్ష్మిగారి "శ్రీమతి" కథలు చాలా బాగున్నాయి మరల యిటువంటి కథలను ప్రచురించవలసిందిగా సంపాదకులను కోరుచున్నాను.

*యిమ్మిడిశెట్టి పార్వతి,*
బొంబాయి-17

వడ్డాది పాపయ్యగారి చిత్రాలు చాలా ఆకర్షణీయముగా వున్నాయి త్వరలో వారి ఫోటో ప్రచురిస్తారని ఆశించుచున్నాను పి జె లక్ష్మిగారి "శ్రీమతి" చాలా బాగుగానున్నది ఇటువంటి కథలే మీ (మా) యువలో ప్రచురించెదరని ఆశించుచున్నాను. సింగరాజు రామచంద్రమూర్తిగారి "నన్నుగురించికాదు" కథ చాలా బాగున్నది

*బి ఎస్ ఎన్ రావు,*
రంగనగూడెం.

యువ (మార్చి) లోని 'నన్నుగురించి కాదు అను కథ చాల బాగున్నది. మరియు పి. జె లక్ష్మిగారి 'శ్రీమతి' కథ నన్ను బాగుగా ఆకర్షించినది; రచయిత్రికి నా ధన్యవాదములు తెలిపేది. యువలో ఇంకా ఏవేని క్రొత్తశీర్షికలు ప్రారంభించిన చాల బాగుండును

*ఆర్ కృష్ణ,*
కోయంబత్తూరు.

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 7 ఏప్రిల్ 1963 సంచిక 4

అఖిల భారత విఖ్యాతి పొందినది, మన తిరుపతి క్షేత్రం. తెలుగువారికి ఏడుకొండల వాడైన వేంకటేశ్వరుడు, ఉత్తరాదివారికి బాలాజీ. ఆసేతు హిమాచల పర్యంతం, వేంకటేశ్వరుని మహిమ ఆబాలగోపాల విదితం. ఎంత దూరంనుంచయినా, ఎన్ని ప్రయాసల కోర్చిఅయినా, భక్తులు ఏడుకొండలవాని దర్శనానికి వస్తారు. వచ్చి, దర్శనంమాత్రం చేసుకొని వెళ్ళరు తమ శక్తికొలదీ, తమ శక్తికి మించీ కానుకలను సమర్పించి వెడతారు ఇది ఒక మహాక్షేత్రం. ఏడాదికి ఏవో ఒకటి రెండు సార్లుకాక, ప్రతిదినమూ తిరుపతిలో మహోత్సవమే. ప్రతిదినమూ భక్తుల కోలాహలమే ప్రతిదినమూ ఏడుకొండలవాని డబ్బీలో ముడుపుల సమర్పణమే

ఇరవై సంవత్సరాలకు పూర్వం, తిరుపతి కొండపైకి ఎక్కడం చాలా ప్రయాసతో కూడుకున్నపని ఆ ప్రయాస పడలేనివారు డోలీలమీద పైకివెళ్ళేవారు అది చాలా వ్యయంతో కూడుకున్నపని 1944 లో క్రిందనుంచి పైకి మంచిరోడ్డు పడింది బస్సులు ఏర్పాటయాయి అప్పటినుంచీ క్రమక్రమంగా యాత్రికుల సంఖ్య పెరిగింది

ఏడుకొండలవాని డబ్బీలోపడే డబ్బు ఎక్కువ అయింది యాత్రికులకు వసతులను ఎక్కువ చెయ్యడానికి దేవస్థానం ధర్మకర్తలు ప్రయత్నిస్తున్నారు ఎన్నో వసతులు, సౌకర్యాలు ఏర్పాటు చేయబడినవి. అంతవరకు బాగానే వుంది

తిరుపతి కొండమీద మంచివసతులు ఏర్పడడమూ, కొండమీదికి వెళ్ళడం సులువు కావడంతో, భక్తులేకాక రక్తులుకూడా విలాసానికి, వినోదానికికూడా కొండ మీదికి వెళ్ళేవారు చాలామంది తయారయారు ఇలాటివారంతా డబ్బో, పదవో కలిగి, ఉన్న వసతులను ఎక్కువగా అనుభవించ గలిగినవారు అంచేత, దూరదేశాల నుంచి వచ్చి, దేవుని దర్శనం చేసుకొని, ఒక్కరాత్రి హాయిగా ఒక గదిలో పడు కుందామనుకునేవారికి గదులు దొరకడం కష్టం

అంతేకాదు అసలు దేవుని దర్శనం విషయంలోనే, సామాన్య భక్తునికీ పలుకు బడిగల పెద్దకూ తారతమ్యం చూపబడుతున్నది ఇక, మంత్రులు మొదలైన ప్రము ఖులువస్తే, వారు దేవుని దర్శనంచేసుకొని వెళ్ళినదాకా తక్కినవారికి దేవుని దర్శనం దొరకదు దేవుని ధర్మదర్శనం టైము ఫలానా, అని ఒక నిర్ణయం వున్న ప్పటికీ, ఎవరైనా మంత్రి వస్తున్నాడంటే, ఆ టైముకు ధర్మదర్శనం దొరకదు' టైము ప్రకారం ధర్మదర్శనం జరిగినట్లయితే, జనం రద్దీ ఎక్కువగా వుంటుంది జనసమూహంలోనుంచి మంత్రి వెళ్ళలేడు అంచేత, ఆ మంత్రి వచ్చివెళ్ళినదాకా ధర్మదర్శనాన్ని ఆపుచేసి, వేలకొలదిగా వున్న యాత్రికులను దేవాలయంలోని అధి కారులు ఇబ్బందిపెడుతూనే వున్నారు మంత్రి వచ్చేది, గవర్నరు వచ్చేది-దేవుని దర్శనపు ఏర్పాట్లు ఎంతమాత్రమూ మార్చరాదని, దేవస్థానం బోర్డువారు కచ్చిత మైన పద్ధతిని అమలు జరపాలి దేవుని దర్శనంకోసం కొండమీదకు వచ్చే మంత్రి గాని, మరొక పెద్ద అధికారిగాని ప్రజాబాహుళ్యంతో కలసి ధర్మదర్శనానికి వెళ్ళ లేకపోతే, ప్రజా బాహుళ్యం అంతా దేవుని దర్శించి వెళ్ళిన తరువాతనే, తాను దేవుని దర్శనానికి వెళ్ళవచ్చును. ఆ మాత్రం ఓపికలేని మనిషి, అంత దూరం రావడ

మెందుకు ? వచ్చి, అనేకవేలమంది భక్తులను ఇబ్బందిపెట్టి, తాను సంపాదించుకొనే పుణ్యం ఏమిటి ?

ప్రజా బాహుళ్యానికి ఏ పైనా వసతులు ఏర్పాటయినప్పుడు, వాటి నిర్వహణలో అవినీతిపరులకు స్థానం వుండకూడదు. తిరుపతిలో ఎగువనూ, దిగువనూ కూడా యాత్రికుల వసతికి సత్రాలున్నాయి. వీటిలో వసతి ఖాళీగావున్నా, లంచం పెట్టనిదే తమకు వసతి లభించడం లేదని ఎంతో మంది యాత్రికులు చెబుతున్నారు. దిగువ నుంచి ఎగువకు బస్సు ప్రయాణానికి టిక్కెట్లు కూడా, లంచం పెట్టినవారికి సులువుగా దొరుకుతున్నాయని వాదు వుంది. ఇలాటి వాదులు పూర్తిగా అంతరించిపోయేటట్లు తగిన చర్య తీసుకోవలసిన బాధ్యత, దేవస్థానం ధర్మకర్తలది.

ఇటీవల తిరుపతి దేవస్థానం వ్యవహారాలను గురించి అనేక ఆరోపణలు వచ్చాయి. దేవుని వ్యవహారాల నిర్వహణ సక్రమంగా జరగడం లేదనీ, యాత్రికుల వసతుల నిర్వహణలో అవినీతి వున్నదనీ వాదులు చాలాకాలంగా వుంటున్నా, యీ వాదులు ఆరోపణల రూపంలో బైటికి రావడం, వీటిని గురించి విచారణలకు నాంది ఏర్పడడం జరిగింది, కాని, ఎక్కువ అప్రతిష్ఠ లేకుండా యీ వ్యవహారాన్ని ముగించి, ఇక ముందు ఏ విధమైన అపవాదులు రాకుండా తగిన కట్టుదిట్టాలతో దేవస్థానం వ్యవహారాలు జరిగేటట్టు, దేవస్థానం బోర్డువారూ, ప్రభుత్వమూ కూడా వెంటనే చర్య తీసుకోవాలి.




# అనుపాత గుణితం

చాలాకాలంక్రితం ఒక జర్నలిస్టు సముద్రతీరాన షికారుచేస్తూ ఒక అపూర్వ వ్యక్తినిచూసి పలకరించాట్ట పలకరించి ఆ వ్యక్తి ఫలానా కలియుగ భీముడని తెలుసుకుని ఎంతో ఆనందించాట్ట ఎందుచేతనంటే ఆ భీముడు 285 పౌన్లమనిషి, చేతులూ కాళ్లూ కట్టేసుకుని సముద్రంలో అనేక మైళ్లు ఈది పత్రికలనిండా తన పేరు మారుమోగించుకున్న ప్రసిద్ధ పురుషుడు! చెప్పొచ్చిందేమంటే ఆ జర్నలిస్టు అంటాడుగదా "ఈ మనిషీ నేనూ ఒకే జాతికి చెందిన వాళ్లమంటే నమ్మటం ఎంత కష్టం!"

నిజమే—ఇటువంటి అనుభవాలు కలిగినప్పుడల్లా మనకు ఆశ్చర్యం వెంట ఒక విధమైన నిస్పృహ కూడా కలుగుతుంది వాస్తవం కల్పనను మించినట్టవుతుంది మనకూ అవతలిమనిషికీ ఉండే ఎడం ఎలాగూ పూడే అవకాశం లేదుగదా అనిపిస్తుంది ఎంతమంది కుర్రవాళ్లు హీరో నాగేశ్వర్రావును గురించి ఆలోచించుకుని, "లాభంలేదు, లాభంలేదు!" అనుకుని ఉంటారు! ఎంత మంది వైమానికులు గగారిన్‌నుచూసి, "అసంభవం! అసంభవం!" అనుకుని నిట్టూర్చి ఉంటారు!

సాటివాళ్లు—అన్నివిధాలా మనలాంటి వాళ్లు—ఏ డర్బీస్వీపో కొట్టేసినప్పుడు మన అదృష్టానికీ వాళ్ల అదృష్టానికీ గల అనుపాతం తెలిసివస్తుంది ఈ అనుపాతాన్ని గుర్తించటమే మంచిది, లేకపోతే

ఎద్దులాగా కావాలనుకున్న కప్ప గతి అవుతుంది కాని ఈ అనుపాత గుణితం మనకు ఏవిధమైన తృప్తిగాని ఇస్తుందా? ఇవ్వదు? బాధ పెడుతుంది—ఒక్కోసారి ఘోరంగా బాధపెడుతుంది

వ్యక్తికి సంబంధించిన విషయాలలో నేను ఆట్టే బాధపడకుండా ఉండటం నేర్చుకున్నాను ఒక విధమైన వేదాంతం అలవరుచుకున్నాను నేను చేసే పనులే నాకన్న అసహ్యంగా చేసేవాళ్లు నాకన్న బాగా సంపాదించుకుంటుంటే నేను అసూయపడను ఒకప్పుడు నా వెంట పని చేస్తూ (నేను చేసే పని కాదు) నా జీతంలో సగానికి తక్కువగా సంపాదించుకున్న వాడు దరిమిలాను నాకన్నా పదింతలు జీతం సంపాదించుకునే దశకు ఎగబాకితే నాకు సంతోషం కూడా కలిగింది

కాని సాంఘిక, సామాజిక విషయాలలో నాకు బాధ కలుగుతున్న మాట నిజం అక్కడ నా వేదాంతం ఎందుకూ పనికిరాకుండా ఉంది. ఎన్నో దేశాలలో నిరుద్యోగం లేదుట, నిరక్షరత లేదుట! ఆదేశాలలో తలసరి సరాసరి రాబడి మన దేశంలోకన్న ఎన్నో రెట్లు ఎక్కువట! సోషలిస్టు దేశాలలో పిల్లలకి చదువులు ఊరికే చెబుతారుట, మందులు ఊరికే ఇస్తారుట ఇవన్నీ వింటుంటే నాకు కడుపు మండిపోతుంది వాళ్ల ఎక్కువేమిటనిపిస్తుంది!

అట్లాగే కులతత్వాలులేని మతాలు అమలులో ఉండే దేశాలను చూసి నేను అసూయతో దహించుకుపోతాను. కులంలేకుండా మనం ఒక్క నిమిషం బతకలేంగదా, వాళ్లకేంపొయ్యే కాలం? లక్షలాది జనమంతా ఒకటే కుల మనుకోవటం ఏం మాయరోగం?

మనది బడుగుదేశమని నాకు తెలుసు—కాని ఇతర దేశాల సంగతి విని మన బడుగుతనం యొక్క అనుపాతం అవగాహన అయినప్పుడల్లా నాకు శివం ఎత్తినట్టవుతుంది

ఒక్క ఉదాహరణ తీసుకోండి జరగబోని ప్రపంచ అణుయుద్ధంలో బ్రిటను ఆత్మరక్షణ చేసుకోవటానికి అమెరికా "పొలారిస్" రాకెట్లు

ఇస్తుందిట ఈ రాకెట్లను మోసే సబ్మరీనులూ, రాకెట్ ముక్కులో ఉంచే హైడ్రోజెన్ బాంబులూ బ్రిటనే తయారుచేసుకుంటుంది బాగానే ఉంది, కాని పొలారిస్ సబ్మరీను ఖరీదు ఎంతో తెలుసా ? 3 కోట్ల పౌన్లు, అంటే 40 కోట్ల రూపాయలు ! బ్రిటన్ను రక్షించటానికి ఎన్ని సబ్మరీనులు కావలిస్తే అన్ని పెట్టి ఈ సంఖ్యను గుణించండి

మన దేశంతో పోలిస్తే బ్రిటను బెత్తెడులేదు దాని రక్షణలో ఒక్క అయిటముకే ఇంత ఖర్చయితే మనం "రక్షణ" అనేది తలపెట్టటానికైనా ఉందా ? ఇన్‌స్టాల్మెంటు ప్లానుమీద సైకిలు కొనటానికి తటపటాయించే వాడికి 80 వేల రూపాయల కారును చూస్తే ఏమని పిస్తుందో, అగ్రదేశాల "రక్షణ" వ్యయం వివరాలు చూస్తే మన దేశం తరఫున నాకు అదే అనిపిస్తుంది

చూడండి 1962 లో నేటో రక్షణ వ్యయం 73,200,000,000 డాలర్లు రూపాయల్లోకి మార్చాలంటే అయిదు పెట్టి గుణించండి— ఓ వందకోట్లు అటూ ఇటుగా లెక్క సరిగానే ఉంటుంది ఈ డబ్బు పెట్టి ఎన్ని బడుగు దేశాలను కొనవచ్చునో నాకైతే తెలీదు కాని ఈ డబ్బు ఖర్చుచేసే దేశాలూ, మన భారతదేశమూ ఒకే కాలంలో ఒకే ప్రపంచంలో ఉన్నామనుకోవటం ఆశ్చర్యంగా ఉంటుంది

ఇంకా ఎన్నో ఇతర విషయాలలో మనదేశం సంగతులు, ఇతర దేశాల పరిస్థితులతో పోల్చుకున్నప్పుడు నాకు తీరని వ్యసనాన్ని కలిగిస్తాయి డిసెంబరులో ఆరంభమైన న్యూయార్కు పత్రికల సమ్మె సమాచారం తీసుకోండి. సమ్మె ప్రారంభించిన టైపోగ్రాఫర్లు కోరిన దేమిటో తెలుసా ? తమ జీతం వారానికి 250 రూపాయలు అధికం చెయ్యాలని ! మన దేశంలో నెలకు 250 రూపాయలు తెచ్చుకునే టైపోగ్రాఫరు ప్రయోజకుడు అమెరికాలో టైపోగ్రాఫర్లు వారానికి అంత మొత్తం అదనంగా ఇమ్మని అడుగుతున్నారు. అడగటమేమిటి ? నెలలతరబడి న్యూయార్క్ టైమ్స్ మొదలైన పత్రికలు లేవు ?

అదివరకూ ఇంతే, ఉక్కు కార్మికులు తమ జీతం గంటకు 17 సెంట్లు పెంచమని సమ్మెచేశారు గంటకు 17 సెంట్లు! ఆరుగంటలకొక డాలరు! వారానికి 8 డాలర్లు—అంటే, 30 రూపాయలు పై చిల్లర!

అమెరికాలో ఉండే పనివాళ్లని కార్మికు లనటానిక్కూడా నాకు నోరాడదు ప్రతి కార్మికుడికీ సొంత కారుంటుందిట పాకీపని చేసేవాడు పనిచేసే చోటికి తన సొంత కారులో వెళతాట్ట! ఆ పాకీవాడు మా యింటికొస్తే లేచి నిలబడి కుర్చీ చూపిస్తాను నేనుకూడా పారి శ్రామిక రంగంలో పనిచేసిన వాణ్ణే, కాని కార్మికుడుగా కాదు, ఫోర్మన్‌గా పనిచేశాను అయితే అమెరికన్ కార్మికుడితో సరిసమానంగా కూర్చునే అర్హత నాకు లేదు

పత్రికా రంగంతో కూడా నాకు పరిచయం ఉన్నది కాని చివరకు ఆరంగంలో కూడా అనుపాత గుణితం నన్ను కంగారు పెట్టేస్తున్నది

1962 లో బ్రిటనులోని కొన్ని పత్రికల సర్క్యులేషన్‌లు ఎంతెంత పడిపోయిందీ లెక్కలు చదివాను ఒక పత్రిక లక్షా ఇరవై వేలు పడి పోయిందిట మరొక పత్రిక 86 వేల సర్క్యులేషన్ పోగొట్టుకున్నదిట. నేను నివసించే పవిత్ర భారతదేశంలో ఈ సంఖ్యలు పెద్ద పత్రికల సర్క్యులేషన్ సంఖ్యలకు సరిసమంగా ఉంటున్నాయి! మొత్తం సర్క్యులేషన్ 86 వేలు అయితే బాగుండును, లక్షదాటితే బాగుండును అని అనుకునే పత్రికలు మన దేశంలో ఎన్ని వందలులేవు! పోనీ బ్రిటన్ పెద్ద దేశం అనుకుందామా అంటే బెత్తెడు దేశం!

పత్రికలల్లేనే పుస్తకాలూనూ ఫలానా వాడి పుస్తకం మిలియన్ కాపీలు ఒక్క వారంలో అమ్ముడయాయని పత్రికలో చదవగానే చర్రున అరికాలిమంట నెత్తికెక్కుతుంది మిలియనంటే పది లక్షలు రాతగాడికి ఒక్కొక్క కాపీకీ ఒక్క నయాపైసా రాయల్టీ వచ్చినా పదివేల రూపాయలు! రెండు పుస్తకాలు రాసుకుని హాయిగా కాలిమీద

కాలక్షేపం చేయవచ్చు. పుస్తకాలు రాసుకునే వాళ్లు దేశదేశాలూ తిరుగుతారన్నా కూడా మండిపోతుంది మండిపోదూ? మన రాతగాళ్లకి ఆంధ్రదేశం నాలుగు మూలలూ కూడా తిరిగే యోగం లేదు! బ్రిటనులో రచయితలకు మాటకు షిల్లింగూ, మాటకు పది షిల్లింగులూ నవల సీరియల్ గా వేసినందుకు పదివేల పౌనులూ — ఈ విధంగా ఇచ్చారుట వినటానికే విడ్డూరంగా ఉంటుంది "నిజమా? కట్టుకథా?" అనిపిస్తుంది

కాని న్యాయంగా చెప్పుకోవాలంటే అంతంత పుచ్చుకునే వాళ్లకు అంతంత ఖర్చూ ఉంటుంది బ్రిటనులో రూపాయికి భోజనం రాదు, మూడణాలకు కప్పు కాఫీ దొరకదు, రెండు మూడు సయాపైసలకు సిగిరెట్లు దొరకవు

అందుచేత దారిద్ర్యం అన్నది సాపేక్షకం ఆ దేశాలలోనూ దరిద్రులున్నారు అక్కడా డబ్బుకు కటకటపడటమంటూ ఉన్నది కారులో పాకీపని చెయ్యటానికి వెళ్ళేవాడు, "ఆహా! నేనెంత అదృష్టవంతుణ్ణి! ఇండియాలో పత్రికా విలేఖరులకు ఈ కారు కూడా లేదుకదా!" అనుకోడు వాడి జీతం గంటకు మరో పదిహేడు సెంట్లు పెంచినా వాడి దారిద్ర్యం తీరదు వాడు డబ్బు కూడబెట్టి సొంతాన ఒక పత్రిక పెట్టటమో, సినిమా తీయటమో చెయ్యడు అటువంటి అవకాశాలు మన దేశంలోనే ఇంకా జాస్తి!

ఏతావాతా తేలిందేమంటే అంతరం ఎంతగా ఉన్నా, ఎక్కడికక్కడ జీవితం ఇంచుమించు ఒకటిగానే ఉందనుకోవాలి ఇంకా నయం, మన దేశంలో ద్రవ్యోల్బణం అయిదు రెట్లుండబట్టి మన జాతీయ సంపద ఇన్ని వందల కోట్లని చెప్పుకోగలుగుతున్నాం

ఆట్టే చూడగా ఈ హస్తిమశకాంతరం రద్దు చేయాలంటే ద్రవ్యోల్బణం చాలా మంచి సాధనంగా కనబడుతుంది జీతాలనూ,

ధరలనూ, రాబడులనూ, పన్నులనూ పదిపెట్టో, మళ్లీ మాట్లాడితే నూరుపెట్టో గుణించేస్తే మనకూ ఇతర దేశాలకూ ఈ తేడా ఉండకుండా పోతుంది దఫేదారు జీతం ఆరువేలు చేసేస్తాం జర్నలిస్టు జీతం నెలకు పదివేల రూపాయలు నెలసరి ఖర్చు పన్నెండు వేలయితే కానీ గాక! చెప్పుకోవటానికైనా ఘనంగా ఉంటుంది

చాంగ్ కై షేక్ ఈ పని ఘనంగాచేశాడు. సిగిరెట్టుపెట్టె ఖరీదు లక్ష చీనా కాగితపు డాలర్లదాకా పెరిగిందిట! ఇంత ఘనకార్యం చేసినందుకేనేమో అమెరికన్లు చాలా అభిమానించి ఈనాటిదాకా అతడి మనిషినే ఐక్యరాజ్య సమితిలో ఉంచేశారు అతడికి అంగరక్షగా సెవెన్త్ ఫ్లీట్‌ను శాశ్వతంగా ఏర్పాటుచేశారు

ద్రవ్యోల్బణం మంచిదికాదని ఒక ఆర్థిక విశ్వాసం ఉన్నదని నాకు తెలుసు కాని అంత మరీ శాస్త్ర ప్రకారంపోతే మనకు పరువు ప్రతిష్ఠలు దక్కవు ఈలోపుగా సోషలిస్టు దేశాలు మహా డబ్బా వాయించేసు కుంటున్నాయి మనం కూడా ఆవడిలో సోషలిస్టు కంకణం ధరించి ఉండటంచేత ఈ డబ్బా వాయింపు మనకు మరింత అవమానకరం సోష లిస్టు దేశాలు చెప్పేవి కోతలని రుజువైతే అంత ఫరవాలేదు ఆ మధ్య చీనా వాళ్ళు, తమ వరిపొలాలు కొయ్యటం మరిచిపోయేసరికి ఆ పొలాలలో ధాన్యం మొలలోతు రాలిందన్నారు మన రైతులు సిగ్గుతో తలలు వంచేసుకున్నారు కాని ఇది కోతలు మరిచిపోవటం కాదనీ, సిసలైనకోత అనీ రుజువయింది మన రైతులు మీసంమెలేసి భూమిశిస్తు రెట్టింపు ఇచ్చేస్తామన్నారు

కాని రష్యావాళ్ళు, "మా రైలు మార్గాలు భూమిని మూడుసార్లు చుట్టిరాగలవు మా రైళ్ళూ, విమానాలూ, బస్సులూ బోట్లూ కింద ఏడు చేరవేసిన ప్రయాణీకుల సంఖ్య ప్రపంచ జనాభాకి అయిదా రింతలు'', అని ప్రగల్భాలు చెబుతూంటే ఏమిటి చెయ్యటం మన

ఆంధ్రదేశం రైళ్ళ ఎడారి మన ఆంధ్రలో ఉండే ట్రంకురోడ్లలాటి రోడ్లను అమెరికావాళ్ళు ఏనాడో డీడీటీ కొట్టి సముద్రంలో పారేశారు.

ద్రవ్యోల్బణం తప్పుకాదు మన ప్రాజెక్టుల్లో ఇసకోల్బణం జరగ లేదా ? మన మంత్రులు వాక్యోల్బణం చెయ్యటంలేదా ? మనం కూడా ఇన్ని ప్రాజెక్టులు కట్టామని చెప్పుకోవటానికుంటే చాలు, అందులో ఎన్ని నీటిలో కరిగిపోయాయన్న లెక్కలు అంతగా ప్రచారంకావు అట్లాగే "అసవాటు" రైలుమార్గాలు ఆంధ్రలో కూడా వేసెస్తే రైల్వే పటంలో ఆంధ్ర, రైళ్ళ ఎడారిలా కనిపించకుండా ఉంటుంది రైళ్లు పడిపోయి, జనం చస్తారూ ? దానికి ఈపాటికి మన వాళ్లు అలవాటు అయేపోయారు

నగల్లో రాగోల్బణం చట్టసమ్మత మయింది పుస్తకాలలో తప్పులో ల్బణం — పార్య పుస్తకాలలో కూడా — అమలుఅవుతూనే ఉంది కవుల సన్మానోల్బణమూ, పుస్తకాల ఆవిష్కరణోల్బణమూ, జనంలో భక్త్యోల్బణమూ, ఒకటేమిటి, సమస్త రకాల ఉల్బణమూ—కూరల ధరల ఉల్బణంతోసహా—నిక్షేపంగా, విశృంఖలంగా, మంచి ఊపుగా సాగిపోతున్నది ద్రవ్యోల్బణం కూడా ఉండనే ఉన్నది ఇది ఇంతే ఉండాలని ఏమిటి ? దీన్ని పదింతలూ, వెయ్యింతలూచేసి పైకి వచ్చా మని విర్రవీగే దేశాలకు తలవంపులయేట్టు ఎందుకు చెయ్యరాదో ఎంత ఆలోచించినా నాకు బోధపడకుండా ఉంది ★

# ఆడంబరాలను విడనాడండి
# దేశ సంపదను వృథా కానీయకండి.

# వలపుపాటలు

దాశరథి

ఉగాదిలా వచ్చితివే వయ్యారీ ఓ చెలియా!
జగానికే నచ్చితివే చిన్నారీ నా సకియా!

కన్నువిచ్చి చూచితివా గున్నమావి పూచేనే
నోరువిచ్చి పలికితివా కోకిలమ్మ కూసేనే ॥ఉ॥

అందముగా నడిచితివా నందనాలు విరిసేనే
కొసరికొసరి నవ్వితివా కుందనాలు కురిసేనే ॥ఉ॥

కొప్పువిప్పి దులిపితివా కుప్పలుగా మల్లెలే
కొంగుకాస్త కదిపితివా బంగారపు ముల్లెలే ॥ఉ॥

మోడుపడిన చెట్లన్నీ మొగ్గతొడిగి మురిసేనే
ముండ్లుగూడ నినుచూచీ పూవులనే కురిసేనే ॥ఉ॥

అందమైన ఆకసాన హంసలీద సాగేనే
గందపుముద్దై చంద్రుడు అందాలను చిందేనే ॥ఉ॥





# బుజ్జిబాబు

ఈ వృత్తాంతం ఏడెనిమిదేండ్ల క్రితం నాటిది ఇన్నాళ్ళూ వూరుకుని, ఇదంతా ఇప్పుడెందుకు వ్రాయలనిపించిందో నిజానికి నాకే తెలియదు వయస్సు పెరిగిన కొద్దీ మనస్సు వెనకటి మనుషులమీదకీ, స్థలాలమీదకీ పోతూండడం వల్లనా ? సంభవించేప్పుడు, అనుభవానికి స్వరూపం వుండదు అప్పట్లో అందలి ప్రయోజనం మనస్సులో నాటుకోకపోవొచ్చు, కాని కాలం జరిగాక అదే ఒక జ్ఞాపకంగా అవతరించి, ప్రయోజనాల పరిశీలనకి పురిగొల్పొచ్చు అసలీ వృత్తాంతంలో ఏదన్నా ప్రయోజనం వుందా ? లేక ఊరికే, కాలక్షేపానికి, జ్ఞాపకం చేసుకుని, మానసికంగా ఊహలో విశ్రమీగుదామనా, యీ రచన ? 'నిన్ను నువ్వు తెలుసుకో' అని ప్రపంచ తత్వాలు బోధిస్తున్నాయి 'నువ్వు ఫలానా' అని ఆధునిక విజ్ఞానశాస్త్రం గాని, మానసిక శాస్త్రంగాని, యీ నాటివరకూ స్పష్టంగా తేల్చలేకపోయినప్పుడు, నేనెందుకీ వృత్తాంతం వ్రాయదలిచానో కారణాలు తేల్చలేక పోతున్నానంటే, పాఠకుడు క్షమించలేక పోయినా, నన్ను నేను క్షమించుకోగలను

ఏడెనిమిదేండ్ల క్రితం, ఆ ఊళ్ళో దూరపు చుట్టం తాలూకు వారి పెండ్లి

ముఖ్యంగా వెళ్ళవలసిన పెండ్లికాదు ఆ ఊరిప్పుడెల్లా వుందో చూడాలన్నది వొక కారణం నే వెళ్ళడానికి ఆ ఊరిని బాగా ఎరుగుదును నా చిన్నప్పుడు మా నాన్నగారు అక్కడ కొంతకాలం పని చేశారు నా బాల్యం అక్కడ గడిచింది ఆ కాలవగట్టు చెరువులో తామరాకులు. పొలాల్లో గడ్డివాములు. స్కూలు తణిఖీ జరుగుతున్న సందర్భంలో కాల్చిన బాణా సంచా ఫలితంగా తగులబడి మా పిల్ల లందరికీ మహదానందాన్ని సమకూర్చిన పాకలస్కూలు. గుడారం సినిమా. నటీమణుల బృందం వరుసగా నెలరోజులు ఆడిన నాటకాలు. వంతెన దిగువున సోడా కొట్టు. 'చెడుగుడి' ఆడిన కరణంగా రింటి ప్రక్కన బందిల దొడ్డి—ఇవన్నీ మళ్ళా చూడా లనిపించింది

ఈ మారు నే వెళ్ళినప్పుడు ఆ వూరు మారిపోయింది. కొత్త స్కూలు భవనం లేచింది సోడాదుకాణం ఐస్ పార్లరైంది కరణంగా రింటి పక్క బందిల దొడ్డిలో కమ్యూనిటీ హా లవతరించింది చెరువు గట్టున పార్కు, రేడియోసెట్టూ, ప్రక్కన భజన మందిరం, కాలవగట్టున రైస్‌మిల్లు, ఆయిల్ మిల్లు, పుల్లలడితీ, లారీల ఖార్ఖానా, కొత్త సినిమాహాలు, ఎలక్ట్రిక్ దీపాలు, — వీటితో బాగా మారిపోయి, నగ్నంగా వున్న ఆ ఊరు దుస్తులు ధరించు కున్నట్లుగా వుంది—సగం కట్టిన దుస్తులు

పెండ్లి హడావిడి అయ్యాక, సాయంత్రం అల్లా షికారుకి బైలుదేరి నప్పుడు, ఆ ఊళ్ళో మరొక విశేషం గమనించాను — పేవ్‌మెంటు మీద పాత పుస్తకాల అమ్మకం ఈ పాతపుస్తకాల దుకాణాలు నాగరికత వేసే నిచ్చెనలో చివరిమెట్టు ప్రభుత్వ కార్యాలయాలు, డవాళీ బంట్రోతులు, పిండిమరలు, లారీలు, సినిమాహాలు, కాఫీహోటలు, ఫ్యాన్సీసామానుకొట్టు, కార్మాగారాలు,— ఇవన్నీ బస్తీలనుండి దిగుమతీ అయిన పారిశ్రామిక నాగరికతా ఓహ్నలైనా పాతపుస్తకాల షాపుతోగాని, ఆ నాగరి కతకి హృదయం సమకూరదు—అదెంత కుళ్ళిన, మాసిన, చిరిగిన హృదయం అయినా సరే బొంబాయి, కలకత్తా, లండన్, న్యూయార్క్, పారిస్ నగరాల ఆయువు పట్టుట పాత పుస్తకాల షాపులు సాహితీ సమాజాల బహూకృతుల నందు కున్న ఉత్తమ గ్రంథాలన్నీ వీటిల్లోకి చేరుకుంటాయిట పదిపుటల గీతికా సంపుటి ఎ—లక్ష కాపీయు ప్రచురించి, అవి అమ్ముడవక, ఆరో అంతస్థు మీదినుంచి దూకి ఆత్మహత్యకి తలపడిన ప్రచురణ కర్తకి, యీ షాపులు శరణ్యం ఇస్తాయి సాహిత్య రంగంలో ప్రతిష్ఠ, పలుకుబడి, స్థానం, నిర్ణయించడానికి, పాతపుస్తకాల దుకాణం సూదంటురాళ్ళు పేవ్‌మెంట్

మీది దుకాణం దగ్గరకు, వొక గ్రంథం చేరిందంటే, ఆ గ్రంథం రచయిత సాహిత్య జీవనం పరిసమాప్తమైందని భావించవొచ్చునట చిత్రం, పేవ్‌మెంట్ షాపుల్లోకి వొక పుస్తకం వొచ్చిందంటే, దాన్ని వ్రాసి నాయన పరపతి హెచ్చినట్టుకూడ భావించవొచ్చునట ఈ తికమకలు, తఫిసీళ్ళు నా కర్థం కావు ఈ సెకండ్ హాండ్ పుస్తకాలు ఎవరు, ఎందుకు, ఎట్లా అమ్ముతారో నాకు తెలియదు ఎవరు, ఎందుకు, ఎట్లాకొని వ్యాపారం సాగించి, అంతర్జాతీయ పుస్తక వ్యాపార రంగంలో ప్రముఖ వ్యక్తులుగా చలమణీ అవుతారో నాకు తెలియదు కాని, మేధావులు, ప్రముఖ వ్యక్తులు, ఏ పనిమీద ఏ పెద్దపట్నం సందర్శించినా, వొచ్చేముందు, సెకండ్ హాండ్ పుస్తకాల షాపు దర్శించకుండా మాత్రం రారుట కొత్త పుస్తకాలషాపులు ఎన్నో వుండగా, పాత షాపుల కెందుకు వెళ్ళాల్సి వొస్తుందో, పుస్తక ప్రియులు చెప్పగా విన్నాను ఇతరత్రా దొరకనివీ, అపూర్వమైనవీ, ఎన్నాళ్ళనుంచో నువ్వు కావా లనుకుంటున్న వీ, అప్రయత్నంగా, యీ షాపుల్లో దొరుకుతా యేమో చూద్దామనే, యీ పెద్దలందరూ, వాట్లమీదికి ఎగబడ్డంఅట

ఆ వూళ్ళో రోడ్డుప్రక్కన చాపమీద పరిచిన పాతపుస్తకాల వ్యాపారసంస్థను చూసి ఆశ్చర్యపడ్డాను ఆ వూళ్ళో పుస్తకాలమాట అటుంచి, పత్రికే కొని చదివే వారు లేరనుకున్నానుగదా —యింక యీ పాత పుస్తకాలను కొనేటందు కెవరుంటారు ? స్కూలు, కాలేజీ విద్యార్థులు, 'టెక్స్‌ట్ బుక్కులు' ఎల్లానూ కొత్తవి పైనుంచి తెప్పించుకుంటారుగా ? ఈ ఊళ్ళో ఈ పేవ్‌మెంటుమీద పాత పుస్తకాల ప్రదర్శన ఆవశ్యకత ఏమిటి అని ప్రశ్నించుకుంటూ అక్కడికి చేరాను

పుస్తకాలు ఈతాకుల చాపమీద పరిచివున్నాయి మధ్యన వొక గల్లా పెట్టిలాంటిది వుంది, గజందూరంలో ఎలెక్ట్రిక్ దీప స్తంభం—మసిచేసిన వొక గొడుగు— మిగతావి పాత పుస్తకాలు అవన్నీ నిజంగా పాత పుస్తకాలే పాతవేకాదు, ప్రాచీనమైనవి కూడా అన్నీ తెనుగు గ్రంథాలే కొన్నింటికి అట్టలే లేవు — పమిటకొంగులేని చీరలా, కొన్నింటికి మధ్య కుట్టిన కంతలుతప్ప, దారంలేదు కొన్ని తుదిమొదళ్ళులేని, పుస్తక కళేబరాలు, కొన్నింటి పుటలు, కదిపితే పొడుంగా విడిపోతున్నాయి కొన్నింటిలో అచ్చు కనిపించడం లేదు, మరి కొన్ని లెదర్ బైండింగ్‌లోవున్నా — యమధర్మరాజు చర్మంలా—వాటి లోపల పుటల్లో సాలీళ్లు, బొద్దింకలు నెమలీకలు, ఈగలు, దోమలు, — వీటి కళేబరాలు, పురావస్తు పరిశోధకుడికి పిచ్చెత్తించేవిగా వున్నాయి ఎండకి ఎండి, వానకి తడిసి, కొనవూపిరితో పడివున్నాయి చాలా పుస్త

కాలు అక్కడవున్న కొన్ని పుస్తకాల పేర్లు — 'ముకుంద విలాసం', కస్తూరి రంగకవి 'సాంబ నిఘంటువు', బహుజనపల్లి సీతారామాచార్యులుగారి 'ప్రసన్న పారిజాతం', 'అలఘు కౌముది' — అందమైనపేరు — మంత్రిప్రగడ భుజంగరావుగారి 'ఉత్తరరామ చరిత్ర' ఆ పెద్ద పుస్తకంక్రింద కన్ను మీటుతున్నది దాసు శ్రీరామ పండితులవారి 'తెలుగునాడు' అన్న కావ్యం పుటలుతిప్పి చూశాను బ్రాహ్మణ శాఖలు మాట్లాడే వ్యవహారికొన్ని అనుకరిస్తూ 'అష్టే' 'నూస్నివషే' 'బలే చౌడషే కాదషే' లాంటి ఉదాహరణ లున్నట్లు ఇప్పటికీ జ్ఞాపకమే

ఆంగ్లకవి విలియమ్ కూపర్ రచించిన జాన్ గిల్పిన్ అను హాస్యకావ్యానికి 'దుర్మార్గ చరిత్రము' అన్న తెలుగు అనుసరణ నన్నాకర్షించిన మరో పుస్తకం దొల్తాబాదు హనుమాయమ్మగారి 'మన్వంతరము', గంగతపల్లె శంకరరావుగారి 'భారత సారము' అను గద్యము, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అబ్రహామ్ లింకన్‌గూర్చి వ్రాసిన 'విస్మృత రాజకవి' అను గ్రంథం, 'వైశాఖ' పత్రికలు — బైండుచేసిన సంపుటాలు, అవటపల్లి నారాయణరావుగారి 'విశాలాంధ్రము' — సీరము సుభద్రమ్మగారి నవల 'జాగిలం' ఇంకా 'త్రిపురాంతక శతకం', 'కాశీమజిలీలు', మూడవ భాగం — నాకు జ్ఞాపకం వున్నంతవరకూ ఇట్లాంటివి అక్కడున్న పాతపుస్తకాలు అవన్నీ యాభై అరవై ఏండ్లనాటి పుస్తకాలు వాటినిగురించి నాకేమీ తెలియదు వాటిల్లో దేన్నీ నా జీవితంలో చదవను కాని అవి వున్నాయని తెలుసుకుని, వాటి వెనకవున్న తెలుగు సాహితీ సంప్రదాయాన్ని తల్చుకుని ఆనాటి రచయితల్ని అభినందించకుండా వుండలేను ఎన్నో చెత్తపుస్తకాలు వొస్తేనేగాని, వొక మంచి పుస్తకం రాదంటారు సమకాలిక గ్రంథాల విలువల పరిశీలనకి అవి గీటురాయి కాని వాటిని చెత్తపుస్తకాలు అనడానికికూడా నాకు అర్హతలేదేమో ఆ పుస్తకాలలో వొస్తువుమీద, అవి వ్రాసిన వారిమీదా మనస్సుపోవ నారంభించింది

ప్రస్తుతాన్నుండి, వెనకటి రోజులకు పారిపోవా లనిపించింది నాకా వూళ్లో కార్మాగారాలు, విద్యుత్ దీపాలు, మరలు, లారీలు, సిమెంట్ కట్టడాలు నచ్చలేదు బాల్యంలో నే ఎరుగున్న చెరువులో తామరాకులు, కాలవలో గేదెలని కడుగుతూ, గేదెపై స్వారిచేస్తూ పాడుకుంటున్న పశువుల కాపరీ, శ్రీరామనవమినాడు పందిట్లో హరికథలూ, మర్రిచెట్టుకింద పల్చటి చందమామ ఆకులమధ్య కనబడుతూ, ఇలాయి బుడ్ల వెలుగులో ప్రాణాలుతోడే వూపుతో సాగే గొల్ల సుద్దులూ, చల్లటి పూరిపాకలు, తరవాణి కుండలూ, చెట్లనీడలో పొడుం పీలుస్తూ పెద్దల చదరంగపుటెత్తులూ — నా కవే



"నేను కొనను! డిజైన్ చూస్తాను"

ఇష్టం ఆ జీవితం ఆ పుస్తకాల్లో వుంది
పాత పత్రికల సంపుటాల్లో గోదావరిమీద
వంతెనవేయడం, మొదటిరైలు వెళ్లడం,
వార్త చూశాను గతానికీ నాకూ లంకె
ఆ నాటి పుస్తకాలు, పత్రికలు

ఆ సాయంత్రం నా జేబులో డబ్బు
లేదు తరవాత వొచ్చి కొనాలనుకుని, ఏ
యే పుస్తకాలు కొనాలో వొక లిస్టు
తయారు చేసుకుంటుండగా అలజడైంది,
ఆయనొచ్చాడు కొట్టాయన కాబోలు
ధోవతి చొక్కా, పైన తుండుగుడ్డ,
చామనచాయ, చదరంగా కనబడే నిండైన
మొహం, పలకరిస్తున్నట్లు కనబడే కళ్లు,
దట్టమైన కనుబొమ్మలు, తాంబూలానికి
డాగైన పళ్ళవరస, – మధ్య పాపిడి
క్రాపింగ్ మినహా, ఊహలో నిలిచి
పొయ్యే ప్రత్యేకత ఏమిలేదు మధ్య
పాపిడి, ఇరుప్రక్కలా, కొడలలా వ్రేళ్లా
డిన పొడుగాటి క్రాపింగ్, ఈ శతాబ్ది
ప్రారంభంలో చిత్రకారుడు అలవరచు
కున్న పద్ధతినికి జ్ఞప్తికితెస్తాయి అందుకే
అతనిరూపు నా ఊహలో నిలిచిపోయింది
వయస్సు నలభైలోపే ననుకున్నా

"ఇది చూశారా ?" అంటూ నా
ముందుకి వొక పుస్తకాన్ని తోశాడు
లేదన్నట్లు తలపంకించి, పుటలు తిర
గెయ్యడం మొదలెట్టాను ఒకదానిపేరు
'బాలవితంతు విలాపము' గ్రంధకర్త
మంగిపూడి వేంకటశర్మ దాని
క్రింద ఆ గ్రంధకర్తదే 'నిరుద్ధ

భా ర త ం' అన్న మరో పుస్తకం కనిపించింది గాంధీగారి హరిజన పత్రిక వ్యాసాల ధోరణిలో సాగిన రచన అది ఉపోద్ఘాతంలో ఆయన్ని సమాజం వెలి వేసిన వుదంతం వుంది ఆయన గొప్ప సంస్కర్తట పుటలు ముందుకి తిప్పి వొక దానిమీద వేలుమోపి, చదవండి' అన్నాడు కొట్టాయన అదొక పద్యం - నా కా పద్యం ఇప్పుడు జ్ఞాపకం లేదుకాని, "- వొస్తువు లన్నీ పోతే పస్తుండ వొచ్చు కాని ప్రాణ సమానమైన పుస్తకం తడిసి పోతే ఎవడుసహించగలడు?"అన్న అర్ధం సూచించే పద్యమది ఈ పుస్తకం ఒకటి కొందా మనుకున్నాను

"చూస్తూ వుండండి" అని ఆయన లేచాడు "మళ్లావొస్తా" అని గొణుగుతూ ఇంకా పుస్తకాలు చూడ్డంలో నిమగ్నుణ్ణి అయ్యాను 'కాశీమజిలీలు' కొనాలని పించింది చార్లెస్ లాంబో ఎవరో వొకా యన క్రొత్త పుస్తకం బైటకొచ్చిందని వినగానే, వెళ్ళి పాత పుస్తకం చదువు కుంటానన్న సంగతి జ్ఞాపకం వొచ్చింది నా కప్పట్లో అల్లా గనిపించింది

పుస్తకాల సంఖ్య పెరిగిపోతూంది ఏది మంచిదో ఏది చదవనక్కర్లేదో ఎవరూ చెప్పరు వీటిని అరికట్టడానికి పూనుకోవాలని,'నార్ ఉడ్' అనే ఆయన వ్యాసం వ్రాశాడు ఆంగ్లంలో మనం కూడా అట్లాంటి ఉద్యమాన్ని లేవదీసి, గీత పై వ్యాఖ్యలు, సంస్కృత నాటకాల అను సరణలు - నన్నయ రచనలో అరనున్న గూర్చిన విమర్శలు, ఇట్లాంటివి-కొంత కాలం నిలిపివేసే మార్గాలు ఆలోచిస్తే బావుండు ననుకొన్నాను కాని ఈ విషయం బహిరంగంగా చెప్పే ధైర్యం లేదు నాకు అల్లాంటి సూచనకు వెలేస్తారు, తంతారు, జైల్లో పెడతారు - మధ్య నాకెందుకు! తప్పకుండా కొనాలను కున్న మరొకపుస్తకం బ్రౌన్ దొరగారు ఆంగ్లంలో వ్రాసిన వేమనశతకం దాని ధర ఎంత ఉంటుందో! అడగాలని అటూ ఇటూ చూశాను ఎవ్వరూ కనపడలేదు ఆ కొట్టాయన మధ్యలో ఇట్లావెళ్ళిపోతే, జనం చూడ్డానికొచ్చి పుస్తకాలని అపహ రిస్తే ఏంగాను? ఆ పుస్తకాలని కొనక పోవడం సరిగదా, అపహరించరని కూడా ఆయనకి తెలుసుకాబోలు!

బ్రౌన్‌దొరగారి వేమన శతకం వైపుకి లాగుతోంది మనస్సు

"ఇదెంతండీ" అన్నాను అప్రయ త్నంగా

"చివరలో వుంటుంది చూడండి" అన్న సమాధానం వినిపించింది అది స్త్రీకంఠం పైకి చూశాను ఒకామె పెట్టెప్రక్కన కూర్చుని, సంచీలోంచి మరికొన్ని పుస్తకాలు పైకితీసి, చాపమీద అమరుస్తోంది ఎక్కడనుండి వొచ్చిందో అస్తమిస్తూవున్న సూర్యుడి కిరణం ఆమె మొహాన్ని వెలిగించింది, తీక్షణానికి తట్టుకోలేక, ఆమె కళ్ళు చిట్లిస్తోంది

అది చూసి నే నేమనుకుంటానో అని సిగ్గు ప్రకటిస్తూంది సిగ్గంతా ఆమె అధరాలు బిగబట్టడంలో వుంది విడినప్పుడు పళ్ళ వరస తళుక్కుమంది. ఛోషాణంలోకి బ్యాటరీలైటు వేసి వెల్లగించిన వజ్రాల హారంలాగ మనిషి ఎరుపుకాదు వెడ ల్పుకి బడుదు. పొడుగ్గా సాగిన కళ్ళు కిరణం తాకిడికి ముంగురుల నీడలుపడి. మరింత దట్టంగా కనిపించే తలకట్టు. తెలుపుమీద పచ్చ పువ్వులచీర - కొంగు గాలికి తొలిగిన వక్షంపైన నా తల నీడ పడింది ఆమెవయస్సు పాతిక - ముప్పై లోపు అనుకున్నాను కాస్త కంగారు పడ్డాను తల దించేసి పుస్తకాలు చూస్తున్నాగాని. అక్షరాలు సరిగ్గా కన బడ్డంలేదు మనస్సెల్లాగో అయి పోయింది ఆమెకేసి మళ్ళా చూడాలని పించింది ఏదో ఆకర్షణవుంది-ఎక్కడో తెలియదు మనిషినలుపే - విశేషం ఏమీలేదు - కాని ముఖంలో వివిధ భాగాల కూర్పు. అమరికలో వొక క్రమం. లయ. నాజూకు. వున్నా యనిపించింది ఈ రకం అమరిక మామూలుగా అందరినీ ఆకర్షించదు - కొత్తమొహాలకోసం బైలు దేరిన ఏ వొకరిద్దరు ఫిలిం డైరెక్టర్లనో తప్ప ఆమెది అట్లాంటి అందం - తెర మీదా ఫొటోలోనూ, తైలవర్ణ చిత్రం లోనూ, నల్లరాతి శిల్పంలోనూ బైటపడి. నిలబడి చూసేటట్టుచేసే వొక ప్రత్యేక కూర్పుగల మొహమే మో

"లేదా ?" అంది

ఉన్నదన్నట్టు తల వూపాను ఆ పుస్తకంవెనక 'వంద' అంకె వేసుంది. వంద రూపాయలా దానివెల ? వంద నయా పైసలా ? అడగడానికి సిగ్గేసింది. అసలు నాకు స్త్రీతో బేరమాడ్డం చేతకాదు వాళ్ళెంత చెబితే అంతా చెల్లించి. కొన్న వస్తువుని దుకాణంలో దిగవిడిచి పారి పొయ్యే బాపతునేను అర్థంలేకుండా ఏవో పుస్తకాలు తిరగేస్తున్నాను 'కర్మదేవి.' 'పుష్పవేణి' అనే నాటకాలు మంగిపూ డాయనవి. 'రూపవతి' అనేది అట్లూరి వెంకటసీతమ్మగారి నవల వెనకటావిడ వ్రాసిన ఆ నవల ఎల్లావుందో కొని చదవాలనిపించింది వెలకోసం ముందు. వెనకచూశాను ఎక్కడా కనబడలేదు ఎందుకో ఆమెను అడగలేకపొయ్యాను కిరణంకదిలి ఊదారంగులో కరిగి పోతూంది విద్యుత్ దీపం వెలిగింది జనం ఒత్తిడి వెన్నువెనక స్ఫురిస్తోంది కొందరు మూగారు. పుస్తకాలుచూడ్డానికి అడిగెయ్యనా ? వందరూపాయలు పెట్టి పుస్తకం నేనెప్పుడూ కొనలేను పాశ్చాత్య దేశాలనుండి వొచ్చిన ఏ పరి శోధకుడో, పండితుడో కొనగల పుస్తకాన్ని. మనవాళ్ళలో ఎవరైనా "ఊరికే దగ్గర వుండనివ్వండి. ఈ పుస్తకమూ, ఈ వందరూపాయలూ" అని చేతిలో పెడితే. ఇందులో ఏదో కుట్రవుందని నాకొద్దు బాబూ. అని

తిరస్కరించి పారిపొయ్యే మనం — వంద రూపాయల పుస్తకమే! సీతమ్మ గారి 'రూపవతి' వెలెంతో - తెగించి అడిగెయ్యాలి తల పైకెత్తి చూశాను ఆమె అటు తిరిగి ఏవో సర్దుతూంది ఏమనాలి? "ఇదుగో ఇటు చూడండి " అని పిలవాలా? స్త్రీని 'అండి' అనగానే ఆమెని అగౌరవ పరచడం అవుతుందా! అట్లాగంటే 'ఏమిటండీ అంత పెద్ద దాన్నిటండీ' అని తిప్పికొడుతుందా! సకిలించడం, దగ్గడం లాంటివి చేశాను. వెనక్కి తిరిగి, మరికొన్ని కొత్త పుస్తకాలు సర్దుతోంది వాటిల్లో ఈ నాడు సాహిత్యరంగంలో పేరుపడ్డ రచయితల గ్రంథాలున్నాయి — కథలు, నవలలు, వ్యాసాలు, ఖండకావ్యాలు వారి గ్రంథాలు పాత పుస్తకాల షాపులోకి చేరుకున్నాయంటే, వారిపట్ల ఇదివరలోవున్న అభిమానం కాస్త సన్నగిల్లుతుందేమో అభివందనాలతో గ్రంథకర్త మిత్రుడికి తన పుస్తకం కానుకగా యిస్తే, దాన్ని చదివారో లేదో తెలియదుగాని, పాత పుస్తకాల వ్యాపారి కమ్మి సొమ్ము చేసుకుంటున్నారనుకోవల్సివొస్తుంది బెర్నార్డుషా 'అభినందనలతో' స్నేహితుడి కిచ్చిన తన పుస్తకం పాత పుస్తకాల కొట్టులోకి చేరితే, దాన్ని కొని, 'తిరిగి అభినందనలతో' అని వ్రాసి మళ్లా ఆ స్నేహితుడికే పంపాడుట!

ఇప్పుడు పేర్చినవాటిల్లో కొన్ని పాత ఇంగ్లీషు పుస్తకాలుకూడా వున్నాయి మేరీ కోరెల్లీ, హాల్ కెయిన్ రేనాల్డ్స్ గార్ల నవలలు, ఎడ్గార్ వాలెస్ భీభత్స కథలు, జంతుశాస్త్రానికి సంబంధించిన శాస్త్ర గ్రంథాలు, ఎడిసన్ స్పెక్టేటర్ వ్యాస సంపుటాలు, — మొదలైనవికూడా వున్నాయి మరో పుస్తకం సంచీలోంచి తీసి కర్ర పెట్టి మూత తీసి, లోపల వుంచింది ఆమె అదేమిటని తొంగి చూశాను అది బాగా కొత్తగా కనబడుతున్న పుస్తకం

"చూడొచ్చా?" అన్నాను

నవ్వుతూ తీసి ఇచ్చింది

"ఇది అమ్మర్లెండి" అంది ఆమె

అది కొత్త పుస్తకం 'నగుమోము' అన్న పేరుతో — ఖండకావ్య సంపుటి ఇరవై పేజీ లుంటుందేమో వెలలేదు అంకితంమటుకు 'ఆమెకే' అని వుంది. కవిపేరు 'నాస్వామి', లోపలి గేయాలు సుళువుగానే వున్నాయి అదొక ప్రేమ గాథ అతడు ఆమెను ప్రేమిస్తాడు. పెండ్లి చేసుకుంటాడు చేసుకున్నాక వారి ప్రేమపెరిగి వర్ధిల్లుతుంది ఆమెది ఎప్పుడూ నగుమోము ఆ మోము కన లేకుండా వొక్క రోజు గడవదు అల్లాంటి ఇతివృత్తంగల కావ్యం అది అంత మటుకే జ్ఞాపకం కూడా ఇతివృత్తం నూతనమైందేనని వొప్పుకోవాలి మామూలుగా ప్రేమ భగ్నమైనప్పుడే కవి కలంపడతాడు ఇందులో అల్లాకాక,




"నేను కాంగ్రెసు - నేను కాంగ్రెసు"

ప్రేయసి భార్యకావడం, భార్యయికూడా ప్రేయసిగా వర్ధిల్లడం విశేషం అసలు ప్రేయసి భార్య అయిందని తెలుసుకోగానే, పాఠకుడు ఆ పుస్తకాన్ని చదవక విడిచెయ్యడమే కాకుండా, ఆ విధంగా దగాపోయినందుకు కోపగించి చించేస్తాడుకూడా—పాత పుస్తకాల షాంటూ లేకపోతే

కాని ఆ కావ్యం అమ్మకానికి లేదు ఎందువల్లనో అడిగేధైర్యం లేదు వెల ఎంతో ఎందుకమ్మరో ఆమె భర్తనడిగి తెలుసుకోవచ్చుననుకుని లేచాను

"ఇక్కడున్నారా? రండి పెళ్ళివారు మనకోసం చూస్తున్నారు" అన్నాడు సత్యం, ఆడపెళ్ళివారి తాలూకు చుట్టం ఆ ఊరే అక్కడే పరిచయం అయ్యాడు పెండ్లి పందిట్లోకి చేరుకున్నాం

ఆ రాత్రి భోజనాలయ్యాక, వెడుతున్న అతిథులలో సాయంత్రం పలకరించిన పుస్తకాల కొట్టాయన్ని చూసి ఆశ్చర్యపడ్డాను రోడ్డుమీది పాత పుస్తకాల కొట్టాయన్ని ఎందుకు పిలిచారో అని ఆశ్చర్యం స్త్రీ జనంలో ఆవిడ కనబడుతుందేమోనని చూశాను కనబడలేదు ఆయన్నిగురించి 'సత్యాన్ని' అడిగాను ఆయనపేరు నారాయణస్వామిట 'నాస్వామి' అంటారుట అతని తాతగారు యాభై ఏండ్లక్రితం వొక అచ్చుయంత్రం సంపాదించి, దిన పత్రిక, స్త్రీలకి మాస పత్రిక స్వయంగా ప్రచురించేవాడుట.

పాత్రికేయుడుగా పేరుపడినవాడుట కొంత భూమి, పుస్తక భాండాగారం స్వయంగా సంపాదించి, సేకరించినవట ఆయన అనంతరం భూమి, యీ పుస్తకాలు, తన కుమారునికి — అంటే నారాయణస్వామి తండ్రికి-సంక్రమించాయిట ఆ కుమారుని మొదటి భార్య కొడుకు నారాయణస్వామి మొదటి భార్య చనిపోయింతర్వాత, ఆయన రెండోవివాహం చేసుకున్నాడుట ఆమెకు నలుగురు సంతానంట కొంత కాలానికి ఆయన చనిపొయ్యాడు ఆస్తుల పంపకంలో, నారాయణస్వామికి, సవతితల్లి సంతానానికి తగాదా లేర్పడ్డాయిట అవతలవారు, మాకా 'చెత్త' పుస్తకాలు అక్కర్లేదు, భూమే కావాలన్నారుట తాతగారి ప్రతిభని, సంస్కారాన్ని, కృషిని, అల్లా వొక్క మాటలో చులకన చెయ్యటంతో నారాయణస్వామికి రోషంవచ్చేసి, భూమి వాళ్ళకి విడిచేసి, పుస్తకాలు, అచ్చుయంత్రం, తన వాటాగా వుంచుకున్నాడుట ఆ గ్రంథాలన్నీ చదువుకుని, సంస్కృతి, కళారాధనతో తృప్తిపడతాడుట లోగడ వొకటి రెండు చిన్న ఉద్యోగాలు చేశాడు కాని, వాటి నిబంధనలకి తట్టుకోలేక విడిచేసి, పుస్తకాల షాపు పెట్టుకుని కాలం వెళ్ళబుచ్చుతాడుట సత్యం ఇదంతా చెబుతుంటే 'ఊ' కొడుతునే, నారాయణస్వామిని లోలోన అభినందించసాగాను నారాయణస్వామి 'నగుమోము' వ్రాసిన కవి అతను స్వేచ్ఛాజీవి ఏ ఉద్యోగమూ చెయ్యలేదు అతనికి ఆస్తిపాస్తులక్కర్లేదు సాహిత్య వ్యాసంగం, కళా జీవితం కావాలి సౌందర్యంకోసం సౌకర్యం త్యాగంచేసిన వ్యక్తిత్వం, నిజాయితీగల ఆదర్శజీవి అట్లాంటివారు సంఘంలో ఏ వొకరిద్దరో వుంటారు. ఆ సమాజం నాగరికత, సంస్కృతులు వారిమీద ఆధారపడతాయి సత్యం ఇంకా చెబుతూనే వున్నాడు

"ఆ పుస్తకాలు అమ్మే వుద్దేశంవుందంటే నేను నమ్మను అతనికా వుద్దేశం లేదు పుస్తకాలకి విపరీతమైన ధరలు చెబుతాడు పదిదగ్గరనుంచి వందవరకూ — ఎవరు కొంటారు—అందులో ఈ ఊళ్ళో బస్సు కోసం ఎదురుచూస్తూ తోచక, ఈ పుస్తకాలేపటో చూద్దామని కాలక్షేపం కోసం వొస్తారు జనం, కొనేందుకు కాదు పోనీ ఏదన్నా కొందామంటే అన్నీ పది, ఇరవై, వందానూ విద్యార్థినుల బృందంలో వొకమ్మాయి పుస్తకాలు చూడ్డానికి వెళ్ళిందిట వారం వారం వొచ్చి బేరమాడిపోతూ వుండేది, తనకి కావల్సిన పుస్తకాలను అతను వెల తగ్గించేవాడుకాడుట 'నీ పనిల్లావుందా,— ఉండు, ఇవన్నీ స్వంతం చేసుగుంటాను'— అన్నట్లు ప్రేమకలాపం కొనసాగించిందిట, ఆఖరికి ఇద్దరూ పెండ్లిచేసుకోడం జరిగింది—అని చెప్పుగుంటారు కథకంచికి, మనం ఇంటికి "

"కట్నం...?...

"ఒకటే కట్నం. ప్రేమ కట్నం. పుస్తకాల సారి."

"ఎట్లావుంటుంది ?"

"కట్నమా ?"

"ఛ, ఛ,—భార్య."

"ప్రేమించిన ఏ స్త్రీ బాగుండదు ?" అన్నాడు సత్యం. 'ఆ' అనడం తప్ప. ఏం చెయ్యను ?

మర్నాడు పెళ్ళివారు మా ప్రయాణానికి వొక బస్సు ఏర్పాటు చేశారు. బైలుదేరడానికి మరో గంట టైముంది. పుస్తకాల కొట్టుకేసి బైలుదేరాను. అక్కడ ఏ పుస్తకమూ కొనగలననే ఆశలేదు. నా దగ్గర అంతడబ్బూ లేదు ఏ వొక్క పుస్తకం మీదా అంత మోజూ లేదు. ఎవరో అన్నట్లు నాకిష్టమైన పుస్తకం నేనే వ్రాసుకోవా లేమో.

ఓ విధంగా నారాయణస్వామి ఆ పనే చేశాడు. కవికాలేని వాడు విమర్శకుడవుతాడన్నాడు. అందులోనూ రాణించని వాడు పుస్తకాల దుకాణం పెట్టుగుంటాడా? 'నా స్వామి' కవే, సందేహం లేదు. మంగిపూడి వెంకటశర్మగారి పుస్తకానికి విలువ కట్టగలిగిన విమర్శకుడు కూడా— తుదకి పుస్తకాల షాపుకూడా పెట్టాడు. ఈ మూడింటికీ ఏదో వొకరకం సంబంధం వున్నట్టు తోస్తుంది కాని, అదేమిటో చటుక్కున స్ఫురించడం లేదు.

తన పుస్తకం అమ్మకానికి లేదుట.










ఎందుకు? పాతపుస్తకాల షాపులో కొత్త పుస్తకానికి స్థానం లేదనా ? అడిగితే ?

నే వెళ్ళేటప్పుడికి గొడుగు నీడన కూర్చుందామె. ఎర్ర రంగుచీర, తెల్ల జాకెట్టు, జడలో పూలు, చేతికి ఎర్ర గాజులు, చెవలకి గుండ్రంగా చుట్టిన తీగెలు ధరించింది. తీక్షణంగా చూస్తే ఆమె కళ్ళవెనక విషాద ఛాయలు, చరిత్ర గుహల చీకట్లు. సముద్రం మధ్యలో చెలించని విషాద గుండాలు, ప్రస్తుతాన్ని వొక గాలిపటంగా ఎరగవేసి, శూన్యంలో దాని కదలికని తన చూపుతో నిర్ణయించే వొక ఆకర్షణ–ఇవి నా ఊహకి గోచరించ సాగాయి. ఆమె నవ్వులో చిదానందం నీడలు, పలుకులో మాధుర్యం ప్రతి ధ్వనులు, కదలికలో చావుపుట్టకల సమన్వయం–ఏదో వొక శక్తి, నారాయణ స్వామి ఊహని సృష్టికి పురిగొల్పి, లోకం సమర్పించే కానుకలను కాలదన్ని, నిశ్చలమనస్కుడై, ఆనందంతో జీవితపు నౌకలో ఆమె చుక్కాని తిప్పుతూండగా, గానం చేస్తూ సాగిపోతూన్న ఆ ధన్య జీవిని అభినందించా లనిపించింది.

"ఆ పుస్తకం–నిన్నటిది–చూడొచ్చా?" అని అడిగాను.

ఏది అన్నట్లు ప్రశ్నార్థకంగా చూసింది పెట్టెకేసి చూపించాను పెట్టె లోంచి తీసింది.

"ఇది అమ్మరా?"

లేదన్నట్లు తలపంకించింది.

"ఎందువల్లనో అడగొచ్చా?"

"అదుగో వొస్తున్నారు. వారినే అడగండి." అంది ఆమె.

నారాయణ స్వామి వొచ్చాడు కళ్ళ కింద గీతలున్నాయి – జీవితం వేసిన అడుగు జాడలు–అనుభవం మొహంపై వ్రాసిన ప్రేమలేఖ; విషాదంతో క్రుంగి పోయినా, మహదానందంతో మిడిసి పడుతున్నా, ఈ వయస్సు విప్పిపారేసిన దుస్తులని ఉతుక్కోవడం తప్పదు కదా!

"మీ 'నగుమోము' కొన్ని భాగాలు చూచాను చాలా బాగుంది అవుతేదాన్ని అమ్మరుట–నిజమేనా?" అని అడిగాను

నారాయణ స్వామి నవ్వుతున్నాడు. 'ఉండండి' అని ఆమెకి సంజ్ఞచేశాడు.

ఆమె మరో కుర్రవాడిని పిల్చి ఏదో చెప్పింది.

'రండి ఇల్లా కూర్చుందాం' అన్నాడు నారాయణస్వామి. పుస్తకాల వెనక చెట్టు నీడలోకి నడిచాము.

"మీకు బాగుందా? సంతోషం" అన్నాడు.

"అవును. విషాదాంతమైన ప్రేమనే ఇన్నాళ్ళూ కావ్యంలో చూస్తూ ఒచ్చేము. సుఖాంతమైన ప్రేమని వాస్తవుగా స్వీకరించి, విజయం సాధించారంటే, మిమ్మల్ని అభినందించాలి ఆ పుస్తకం కొంటాను" అన్నాను.

"స్వయంగా అచ్చువేసిన పుస్తకం. ఇంట్లో కీటకాలు పాతపుస్తకాల జోలికి

అంతగా పోవడం లేదు ఈ కొత్త పుస్తకంలో వాసన ఏదన్నా వాటిని ఆకర్షిస్తుందేమో, అవి తినడమేకాకుండా, చుట్టు ప్రక్కల వున్న ఎలుకల్ని కూడా గప్పించి, పండుగ చేసుకున్నాయి. మిగిలింది వో పాతిక కాపీలు. వాటిల్లో ఇరవై నాలుగువరకు పనిమనిషి పేడ నీళ్ళకి తడిసి పనికి రాకుండా పొయ్యాయి. నిన్న చూపించాను, మంగిపూడి వారి పద్యం జ్ఞాపకం వుందా? వస్తువులన్నీ పోతే వస్తుందొచ్చు కాని, పుస్తకం తడిస్తే ఎవడుసహిస్తాడు? అన్న పద్యం_ సరే చివరికి ఈ వొక్క కాపీ మిగిలింది." అన్నాడు. ఇంతలో కుర్రాడు గ్లాసుల్తో చెఱుకు రసం, కాస్త ఐస్ ముక్క తెచ్చాడు. త్రాగుతున్నాం.

"మరోమారు అచ్చు వేసినప్పుడు. పంపుదురుగాన్లెండి'' అన్నాను ఇంతలో బస్సు వొచ్చి నిలిచింది. జనం రమ్మంటున్నారు.

"ఇంతకీ మీరు అంతమంచి కావ్యం వ్రాయగలగడానికి _ ఆమె కారణం. ఆమెనుకూడా అభినందించాలి" అన్నాను.

నారాయణస్వామి నవ్వుతున్నాడు.

''కొందరికి ప్రేయసి ఉంటారు, కావ్యాలుండవు నాకు కావ్యం వుంది, ప్రేయసి లేదు" అన్నాడు.

"అంటే? ఆమె...'' వేలు అటు చూపుతూ అన్నాను.

"అదా, ఇక్కడే పిల్లజమిందారుగారింట్లో పనిమనిషి నాకు వీలు కుదరనప్పుడు, కాసేపు వొచ్చి ఇక్కడ కూర్చోమంటాను. భార్య ఏనాడో పోయింది'' అన్నాడు.

''ఓ '' అన్నాను.

మానవుడు కల్పించిన భాషలో, ఈ 'ఓ', 'ఆ' 'ఊ'_లు ఎంత ముఖ్యమైనవో అప్పుడు తెలిసొచ్చింది. ★



# తక్కిన ఇద్దరూ....?

సందు మళుపు తిరుగుతూండగా రివ్వుమని దూసుకుపోయింది ఆ కారు !—ఇంకానయం, కాస్తలో తప్పింది గండం లేచిన వేళా విశేషం ఇవాళ బాగుంది

మళుపు తిరిగిన కారు దాని మానాన అది వెళ్ళిపోలేదు కాస్త దూరంలో ఆగింది ఆ కారులోవున్న వ్యక్తి - నల్లటి సూటులోవున్న ఆ వ్యక్తి - నల్ల కళ్ళజోడు ధరించిన ఆ వ్యక్తి నన్నే పరకాయించి చూస్తున్నాడు నన్నే చూస్తున్నాడు !—

అప్పుడు రోడ్డుమీద నర సంచారం కూడా లేదు

నాకు ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టయింది నే చదివిన డిటెక్టివ్ సాహిత్యమంతా ఒక్కసారి కళ్ళకు కట్టినట్టయింది

ఆగిన ఆ కారు అమట్టునే వెనక్కి రావడం చూశా కాళ్ళూ చేతులూ వణకసాగాయి. ముచ్చెమటలూ పోశాయి.

నా దగ్గరసా వచ్చింది కారు ఆగింది.

కారులో వ్యక్తి కళ్ళజోడుతీశాడు నాకేసి ఎగా దిగా చూశాడు

''నువ్వు ఫలానా కదూ ?'' అని అడిగాడు.

నాకు మాట రాలే

''మీది పిరాపురం కదూ ?''

''అవును ''అన్నా ఆశ్చర్యంతో

''చిన్నప్పుడు మనిద్దరం కలిసి చదువుకున్నాం గుర్తొచ్చానా ?—''

అంటూ కారు దిగాడు ఆ వ్యక్తి.

''హరి—నువ్వా, శ్రీహరివా !—''

అంటూండగానే, అమాంతం కావులిం చేసుకుని, ''ఆః ! — ఎంతకాలానికి కలుసుకున్నాంరా !'' అన్నాడు

మా యిద్దరి కళ్ళమ్మటా జలజలమని నీళ్ళు రాలాయి

ముద్దా విశ్వానాథం

ఇద్దరం కాసులో సాగిపోయాం

*   *   *

శ్రీహరి నేనూ కలిసి చదువుకున్నాం ఒకే వూళ్ళో, ఒకే స్కూల్లో ఒకే క్లాసులో, ఒకే సెక్షన్‌లో, ఒకే బెంచీలో పక్కపక్కని కూచుని చదువుకున్నాం స్కూల్ ఫైనల్ అయేవరకూ కలిసి చదువుకున్నాం

ఇద్దరమూ తెలివయిన వాళ్ళమే అయితే ఇద్దరికీ ఒక్కటే తేడా — నాకు డ్రాయింగులోనూ, తెలుగులోనూ, నూటికి తొంభై తొమ్మిదిన్నర మార్కులొస్తే, వాడికి లెక్కల్లో నూటికి నూటయాభై మార్కులొచ్చేవి

స్వగ్రామం వదిలాక ఇదే మేమిద్దరం కలియడం, శ్రీహరి గొప్ప ఇంజనీరు అయ్యాడు నాలుగు రాళ్ళు వెనకేశాడు నేనో? — అది కాదని ఇది, ఇది కాదని అది, రకరకాల ఉద్యోగాలు చూసి చూసి, చివరికి జర్నలిస్టునయ్యాను జర్నలిస్టుగా నే చేసింది, పెద్ద యేమీ కనబడదు వెనకటి కొక మిత్రుడన్నట్టుగా నేనొక పాతకాలపు రచయితని అంతే

నన్ను తిన్నగా వాళ్ళింటికి తీసుకెళ్లాడు, శ్రీహరి ఎయిర్-కండిషన్ చేసిన ఆఫీసు రూంలోకి వెళ్లాం మనసు విప్పి మాటాడుకుంటున్నాం అయిదు నిమిషాలయింది

తలుపు తీసుకుని - రెండు ప్లేట్లతో ఫలహారం, రెండు కప్పుల కాఫీతో హాజరయింది ఆమె నేననుకున్నట్టు ఆమె శ్రీహరి సతీమణే శ్రీహరే పరిచయం చేశాడు

శ్రీహరి కొక కొడుకు కూడాను ఇంకా కుర్రవాడు ఐదోక్లాసు చదువుతున్నాడు

ఎవళ్ళ కథ వాళ్లం చెప్పుకున్నాం భోజనం చేస్తేగాని వదలనన్నాడు, శ్రీహరి కాని, ఆఫీసుకి టైమయిపోయిందని చెప్పి ఆ పూటకి తప్పించుకున్నా

"సరేలే, ఈ పూటకి తప్పించుకున్నా, సాయంత్రానికి వదిలేదిలేదు మర్యాదాగా, ఆఫీసు వదిలిపెట్టగానే ఇక్కడికి చేరుకో" అంటూ, అప్పటి మట్టుకు వదిలాడు

*   *   *

శ్రీహరి ఇంటినించి వచ్చినప్పటినించీ నన్నొక చిన్న సందేహంపట్టి పీడిస్తూంది ఎంత గింజుకున్నా బుర్ర పాడవుతూందే కానీ, సమాధానం మాత్రం తట్టడంలేదు

అతనూ నేనూ వాళ్ళింటికి వెళ్ళినప్పుడు మేమిద్దరం తప్ప, బయటగాని రూంలోగాని ఎవరూలేరు మేం వచ్చిన సంగతి ఇంటోవాళ్ల కెవరికీ తెలియడానికా, సావకాశంలేదు అయితే, మేం కూచున్న ఐదు నిమి

పాలకల్లా ఆ కాఫీ ఫలహారాలు ఎలా హాజరయ్యాయి? — శ్రీహరి అంత సేపూ నాతోనే వున్నాడు కాని, అక్కణ్నించికదిలి గుమ్మంలోకయినా వెళ్లలేదే పోనీ అంటే కాఫీ తెమ్మని కేకయినా వెయ్యలేదే లెక్కగా, ఎరిగివున్నట్టు, ఆమె మా యిద్దరికి సరి పడా—రెండు ప్లేట్లతో టిఫినూ, రెండు కప్పుల కాఫీ తీసుకురావడం నాకు తీరని సమస్య అయికూచుంది

*           *           *

అన్నట్టుగానే సాయంకాలం ఆఫీసు నించి తిన్నగా శ్రీహరి ఇంటికి వెళ్లా అతనింకా రాలేదు అతని కొడుకు నన్నాఫీసు రూంలోకి తీసుకువెళ్లాడు

'నాన్నారు ఇప్పుడే వచ్చేస్తారు కూచోండి' అన్నాడు

కుర్రవాడిని చేరదీశా నెమ్మదిగా ఆ కబురూ ఈ కబురూ అడుగుతూ, నా సందేహాన్ని వెలిబుచ్చా

ఉత్సాహంకొద్దీ వాడు- —

'దాని కేముందండీ మా నాన్న గారి టేబిల్కి ఈ బటన్ చూశారా? దీనికి బెల్ మా వంటింటోకి వుంది నాన్నగారు దీన్ని ఎన్నిసార్లు నొక్కితే అంత మందికి కాఫీ, టిఫినూ తెస్తుంది, అమ్మ' అని చెబుతూ, అమర్చిన బెల్ చూపించాడు

హమ్మయ్య!—

ఇంత గొప్ప ఐడియా కనిపెట్టి నందుకు శ్రీహరినీ, శ్రీహరి రహ స్యాన్ని కనుక్కోగలిగినందుకు నన్ను నేనూ, అభినందించుకున్నా

అంతలోనే శ్రీహరి వచ్చేశాడు

అవాళ ఎంతో ఖులాసాగా గడిచింది

*           *           *

ఇంటికి చేరుకుంటూనే ఎలక్ట్రిషి యన్ని పిలిపించా వీధివేంపు తడి కలతో తయారయిన నా ఆఫీసు రూములోనించి మా ఇల్లాలి ఆఫీసు రూము అయిన పాకశాలలోకి ఒక బెల్ పెట్టించా

ఈ బెల్ని గురించి మా ఆవిడకి బోధించి నచ్చజెప్పి ఆవిడచేత వప్పించ డానికే నాలుగు నెలలు పట్టింది నాకు

నాలుగు నెలలకయినా—కాదు, నాలుగునెలల్లోనే మా ఆవిడను తర్ఫీదు చెయ్యగలిగినందుకు ఎంతో గర్వ పడ్డాను

*           *           *

తలవని తలంపుగా ఆ వేళ శ్రీహరి మా ఇంటికి వచ్చాడు అతన్ని గౌర వించి, నా తడికల ఆఫీసు రూములోకి తీసుకువచ్చా కూచోబెట్టా

అతనితో మాటాడుతూనే రెండు కాఫీలు కావాలని ఇల్లాలికి సందేశం పంపా అంటే రెండుసార్లు బటన్ నొక్కానన్నమాట

'కూచోడానికి టయిము లేదు, ఖాయ్ ఏస్తా రేపు ఉగాది పండక్కి నువ్వూ, మా చెల్లెలూ, పిల్లలూ మా యింటికి వచ్చెయ్యండి,'—అని ఆహ్వానిస్తూ, కుర్చీలోంచి లేవబోయాడు

బలవంతాన అతన్ని కూర్చోబెట్టి, మరోకసారి బటన్ నొక్కా

మరి రెండు నిమిషాలయింది

ఇంకా కాఫీ రాలే ఇల్లాలి అలికిడీ లేదు

ఒకవేళ పాలవాడు రాలేదేమో!—

లేకపోతే, పక్కింటి పిన్నిగారితో బాతాఖానీలో కూచుందో! ఆవిడ ప్రసంగిస్తూవుంటే కాలమే తెలియకుండా గడిచిపోతుంది

నా ఆత్రాన్ని తెలియజేస్తూ మళ్ళీ బటన్ నొక్కా

నా కంగారు గ్రహించినట్టున్నాడు శ్రీహరి 'నువ్వు చూస్తే కాఫీ ప్రయత్నం ఏదో చేస్తున్నట్టున్నావు వద్దురా బాబూ, మరోకసారి వస్తాలే, తీరిగ్గా' అన్నాడు

విషమ పరిస్థితి ఏర్పడింది నాకు మా ఆవిడమీద పట్టరాని కోపం వచ్చింది

'అదేం కుదరదు, మా యింటో కాఫీ అయినా పుచ్చుకోకుండా వెళతావా ?—అయితే మీ యింటికి వచ్చేదే లేదూ ' అంటూండగా — పొగలు గక్కుతున్న నాలుగు కప్పుల కాఫీతో ఆఫీసు రూములో అడుగు పెట్టింది, మా యజమానురాలు

మా యిద్దరినీ చూసి ఆశ్చర్యంతో 'తక్కిన ఇద్దరూ ఏరండీ ?—' అని అడిగింది, దీర్ఘంతీస్తూ

నేనేం బదులు చెప్పలేకపోయా

శ్రీహరి పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతూ, "అదేమిటమ్మా చెల్లాయ్!- అలా అడుగుతావు ? నేనొక్కణ్ణీ నాకొక కప్పు మావాడు ఇద్దరు మనుషుల పెట్టు, కనుక వాడికి రెండు కప్పులు మొత్తం మూడు కప్పులు ఇలా ఇచ్చెయి తక్కింది నీకూ, ఇప్పుడు సరిపోయిందా లెఖ్ఖ ?—" అంటూ మరింత గట్టిగా నవ్వాడు

సతీ సమేతంగా నేనూ నవ్వక తప్పింది కాదు



## మీ నిశ్చయాన్ని పునరుద్ఘాటించండి
## జాతీయ రక్షణ కృషిలో పాల్గొనండి



# తాయూ బొంగరం

ఆదివిష్ణు

నాలుగేళ్ళ క్రితం—చదువుకుంటూన్న రోజుల్లో — జ్ఞాపకానికి మిగిలిన చిన్న సంఘటన !

ఆదివారం రూములో నిద్రపోతున్నాను మెలుకువ వచ్చేసరికి మా యింటి వారంతా ఖంగారుగా కేకలు వేస్తున్నారు ఏం జరిగిందో మొదట అర్థం కాలేదు

" అయ్యో — ఇప్పుడు యిక్కడే వుండాలండీ ! బంగారు తల్లి ఆడుకుంటుంది గదాని చిన్న కునుకు తీద్దామని నడుం వాల్చాను . ఇలా ముంచుకొస్తుందని తెలిస్తే హయ్యో ! "

" ఛీ. నోర్ముయ్ ఇంకా ఏడుపెందుకూ ? చేసిన ఘనకార్యం చాలదూ ? పసిపిల్లని రోడ్డుమీద వదలిపెట్టి లోపల నిద్రపోతుందిట దొరసాని ఇప్పుడు అఘోరించిక. "

ఇంటాయిన కోపంతో వణికిపోతున్నాడు. పాపం ! ఆవిడేమో కుళ్ళికుళ్ళి ఏడుస్తూంది చుట్టూచేరిన అమ్మలక్కలు పిల్లలెత్తుకు పోవడం గురించి తమకు తెలిసినదంతా చెప్పేస్తున్నారు. ఒక అరగంట అలా గడిచిన తర్వాత—ఇంటాయిన పోలీసులకు రిపోర్టిచ్చేందుకు బయలు దేరాడు

ఆయినలా వెళ్లాడోలేదో యిటు మా విశ్వనాధం పాపని వెంటబెట్టుకొచ్చాడు. పాపని చూడగానే ఆ తల్లి ప్రాణం లేచి వచ్చింది గబగబా వాడి చేతుల్లోంచి పాపని లాక్కుని తనివితీరా ముద్దుల వర్షం కురిపించింది ఆ తర్వాత కాసేపటికిగాని విశ్వనాధంతో మాట్లాడలేక పోయింది కృతజ్ఞత చెప్పుకుని, పాప ఎక్కడ దొరికిందో వివరాలు చెప్పమని అడిగింది

అప్పటి మా విశ్వనాథం స్థితి తలుచు కుంటే యిప్పటికీ జాలీ, నవ్వు కలుగు తుంది ఆవిడ వివరాలు అడగ్గానే హఠా త్తుగా తలవంచుకుని సంజాయిషీ చెప్పు కుంటూన్నట్లు మెల్లిగా—

"పాపని నేనే అలా బజారుకి తీసుకువెళ్లానండి" అన్నాడు

ఇంతకీ నే చెప్పొచ్చిం దేమిటంటే, విశ్వనాథంకి చిన్న పిల్లల మీద వున్న స్నేహభావం కాలేజీదాటి జీవితంలో అడుగుపెట్టినా,ఆవగింజంతైనా తగ్గలేదు

"పసిపిల్లలు దైవ స్వరూపులు. వాళ్ళకి కల్లాకపటం తెలీదు ఎత్తుగడలూ, పగసాధించడాలూ తెలీవు వాళ్ళ నవ్వు నిర్మలంగా మనసుకి హాయిగా ఉంటుంది. జీవితంలో పోగుట్టుకున్న—లేదా—పోతూన్న తీపిదనాన్ని పసిపిల్లలు పూర్తి చేసుకుంటారు. నేనేదో భావోద్రేకం లాంటి పిచ్చితనంలో చెప్తున్న మాటలు కావివి కాబట్టి తీసిపారేయకు దేవుడు దయతలచి నాకేవరం కావాలో కోరుకో మంటే—పది మంది పసిపిల్లల మధ్య నన్నూ ఓ పసిపిల్లాడిలా మార్చేయమని ప్రాధేయపడతాను నావాగుడు వింటూంటే నీకే విసుగ్గా వుండచ్చు కానీ ఇది పచ్చి నిజం" అంటాడు విశ్వనాథం

విశ్వనాథం వాళ్ళ అన్నయ్య దగ్గర పెరిగాట్ట చేదు బ్రతుకు తాలూకు గుణ గణాలు అనుభవ పూర్వకంగా వాళ్ళ అన్నయ్య పెంపకం ద్వారా తెలుసు కున్నాడని వినికిడి. లోకానికి భయపడి అతన్ని చదివించడం తప్పితే, ప్రేమా వాత్సల్యమూ వుండికాదూ అంటారు. నిజమెంతో తెలీదు గాని — ఒకేతల్లి పిల్లల మధ్య వుండవలసిన ఆత్మీయతా అనురాగమూ వీళ్ళిద్దరి మధ్యా లోపించిం దని మాత్రం విన్నాను

ఏమైనా విశ్వనాథం బ్రతుకులో నీడలు చాలా వున్నాయని చెప్పక తప్పదు. నాకు తెలిసిన ఒక నీడ గురించి ఇక్కడ చెప్పడం నా ధర్మం ఇది విశ్వనాథం గురించి రాస్తున్నది కాబట్టే, అతను ఈ కథకి నాయకుడు కాబట్టే, యిలాటి వివరాలు అవసరమను కుంటాను అందు చేతనే యీ పిట్టకథ—

ప్రభావతి అనిచెప్పి ఒక బంతిపువ్వు లాటి అమ్మాయి మా క్లాసులో వుండేది చాలా అందమైన పిల్లనే చెప్పకతప్పదు ఉపమానాలు (బంతిపువ్వు మినహా) వాడి ఆమె అందాన్ని కించపరచడం నా కిష్టంలేదు. ఇక్కడే మరొక మనవి నువ్వు చెప్పేదేదో ప్రేమ కథలావుంది అలాటివి చాలా విన్నామూ, పైగా ఆ కథలపైన మాకు సదభిప్రాయం కూడా లేదూ అని కోప్పడితే ఏమంత బావుండి పోదు ఇదిచెప్పి కథ నడిపిస్తేనేగాని విశ్వనాథం గురించి పూర్తిగా చెప్పినట్టు కాదు ఇది తప్పించి కథరాస్తే వెలితి వెక్కిరించగా, పూర్తిగా రాయలేక పోయానే అన్న దిగులుతో వుండటం



"రా చూద్దాం ! నీ చేతిలో అట్లకాడ గొప్పో, నా చేతిలో 850 పేజీల పుస్తకం గొప్పో తేల్చుకుందాం !"

నా కిష్టంలేదు. కనక యీ పిట్టకథ యిక్కడ అవసరమనే భావిస్తూన్నాను

ప్రభావతిని చాలామంది కుర్రాళ్లు చూశారు. ప్రేమించారు మన సన్నారు, హృదయమన్నారు, వైశాల్యమన్నారు, పవిత్రమన్నారు చాలాచాలా పెద్దమాట లెన్నో ప్రయోగించేరు విని, నవ్వి వూరుకునేది ప్రభావతి పాపం !! ఆ పిల్లలోవున్న సుగుణ మేమిటయ్యా అంటే, ఎదటివాడి కవిత్వం చాలా ఓపిగ్గావిని ఓ చిరునవ్వు వాడి మొహాన్న రుద్ది 'వస్తా' నంటూ వెళ్లిపోయేదేగాని ఖస్సు బుస్సుమని పాములాలేచి ప్రిన్సిపాల్‌తో చెప్పి నీడొక్క చీరిస్తానుండు అని హెచ్చరించేదికాదు ఇది 'అలుసు' కింద జమకట్టి ఆమెచుట్టూ చేరిన ఆకతాయి కుర్రాళ్లు పూల్సవడం మినహా సాధించిం దేమీ లేదు

నాకు తెలిసినంతవరకూ ప్రభావతి 'నిప్పు'లాటి ఆడకూతు రనే చెప్పగలను, కవ్వించే గుణం తనకు లేకపోయినా, అలాంటి పరిస్థితికి తీసుకొస్తూన్నారు కాబట్టి తప్పదన్నట్టు కవ్వించడం మొదలు పెట్టింది

సంవత్సరంన్నర జరిగినా ప్రభావతికి నచ్చిన ప్రేమికుడెవరో తేల్చి చెప్పలేక పోయింది ఆమెను వెంటాడే విద్యార్థి బృందం ! ఎవరికి వాళ్లు నేనంటే నేనని

చెప్పుకోడమేగాని ఆమెనోట 'ఫలానా అతను నా ప్రియుడు సుమా' అనే ముక్క వినలేదు ఎవరూను

అలాటిది కస్తా, ఒకరోజు తల దిమ్మె తిరిగేలా ఆశ్చర్యపోయాను నేను రూముకొచ్చేసరికి లోపలనుండి సన్నగా ఏడుపు వినిపించింది నాగుండె ఝల్లుమంది అనుకోకుండానే లోపలికెళ్లాను నన్నుచూచి లేచి నిలబడింది ప్రభావతి గుమ్మందగ్గరే నిలబడ్డాను విశ్వనాధం పలకరింపుతో మళ్లా మామూలు మనిషయ్యాను, నా పుస్తకాలు సొరుగులో పెట్టి సబ్బూ టవలూ తీసుకుని బావి దగ్గర కెళ్లాను గట్టిగా గాలి పీల్చుకున్నాను అప్పటిగ్గాని ఓస్థితిని పడ్డాను కాను

బావి దగ్గరే మరో అరగంటసేపు కాలక్షేపం చేశాను ప్రభావతి వెళ్లిపోవడం చూచి మరీ లోపలికొచ్చాను వచ్చానన్నమాటేగాని విశ్వనాధంతో ఒక మాటగూడా మాటాడలేదు ఏం మాటాడాలో అర్ధంగాక, ఏమీ మాటాడకుండా గోళ్లు గిల్లుకోవడం నచ్చక నానా యిబ్బందీ పడ్డాను నా అవస్థ గ్రహించాడో ఏమోగాని వాడే అన్నాడు—

"ఫ్లాస్కులో కాఫీ మిగిలింది, ముందది తాగు"

మవునంగా కాఫీ ముగించి సిగరెట్టు ముట్టించి హోల్డాలుమీదినడుంవాల్చాను, అప్పటి గ్గాడా వాడితో ఏం మాటాడాలో తెలీక

వాడు నవ్వాడు నవ్విన తర్వాత అన్నాడు

"ఏం? అలా పిచ్చిమొహం పెట్టి ఏమీ అడక్కుండా నడుం వాల్చావ్ ?"

మళ్లా నవ్వాడు

చచ్చినంత సిగ్గు పుట్టుకొచ్చింది ఏమైనా అడుగుతే ఏం బావుంటుందిలే అని సందేహించి ఏమీ అడక్కుండా నేనూరుకుంటే, ఇదిగూడా ఒక తప్పు కింద కట్టేసి 'పిచ్చిమొహం' అంటాడేవిటాని ( పైగా నవ్వుగూడాను ) బలే కోపం వచ్చింది





"ఇప్పుడు లక్ష యక్షప్రశ్నలు కలగడం సహజం నువ్వూ ఒక సాధారణ నరమానవుడవే గనక ఏమీ సంకోచించకుండా అడుగు "

"ప్రభావతితో నీ కెన్నాళ్లనుండీ పరిచయం ?"

" ఆ అమ్మాయి మా మేనమామ కూతురు ."

ఈ సమాధానంతో ఉలిక్కిపడి లేచి

కూర్చున్నాను కూర్చున్న వెంటనే అడిగిన ప్రశ్న—

"మ రిన్నాళ్లూ చెప్పావుగాదే ?"

"చెప్పదగ్గ విశేషం లేదు గనక"

ఫలానా అందమైన అమ్మాయితో నాకు చిరకాల పరిచయం వుందిస్మా అని చెప్పుకోవడం ఒకానొక ఘనమైన 'క్రెడిట్'గా భావించే యీ రోజుల్లో, విశ్వనాథం అలా అన్నాడంటే కొంత వరకు మీరు అతన్ని ఊహించివుంటారు'

ఆ తర్వాత వాడు చెప్పినదంతా విషాదం టూకీగా—విశ్వనాథం తల్లి దండ్రులు పోయిన తర్వాత, మావయ్య తమపట్ల నిరాదరణ పెంచుకున్నాడుట వ్యాపారంలో లక్షలు సంపాదించిన తమ లాటి పెద్దమనుష్యులకు యీ అర్థంలేని 'బంధుత్వాలకు' విలువ యివ్వడం ఏమిటీ మరీ బడాయికా పోతే (ఇది నా మాట కాదు—విశ్వనాథం మావగారి దిట) పైగా—ఫలానా విశ్వనాథం మా మేనల్లుడనే సత్యం, నగ్నసత్యంగా చలామణి అవడం ఆయన కిష్టంలేదుట (ఇది మరీదారుణం)

ప్రభావతి తండ్రి గుణగణాలకు భిన్నంగా వుంటుంది ఆ అమ్మాయికి విశ్వనాధమంటే ప్రాణం ఈ మాటంటే ఆతండ్రికిమంట ప్రభావతి విశ్వనాథంతో మాటాడినట్టు తెలిసినా సరే, సహించే వారు కాదుట ఆయన—అదేం పాపమో ఏమో

పరాయివాళ్లతో నవ్వుతూ, దర్జాగా రీవిగా మాటాడే ప్రభావతి మా వాడి దగ్గర కొచ్చేసరికి అంటీ అంటనట్లు యిన్నాళ్లూ గటపడం దేనికీ? ఆ మాత్రం 'తెగువతనం' మరోపట్ల ప్రదర్శించ కూడదు అనిపించింది అదే అడిగాను దానికి వాడి జవాబిది ..ఆమెతో మాటా ట్టానికి తనే యిష్టపడటం లేదనీ, తమ మధ్యనున్న బంధుత్వం సాధ్యమైనంత వరకూ మరచిపోవటం యిరుపక్షాలకీ మంచిదనీను

నా కీరకమైన సమాధానం రుచించ లేదు అప్పటి కేదో తలూపాను

ప్రభావతి నాన్నగారు ఆమెకి ఒక పేరు గడించిన డాక్టరుగారిని వరుడుగా నిశ్చయించారట, ఆ పెళ్లి అమె కిష్టం లేక తన నిస్సహాయస్థితిని చెప్పుకుని ఏడుస్తోందట ప్రభావతి

విశ్వనాథం యీ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేనట్లు కన్పించాడు అప్పట్లో ఆ అమ్మాయి పెళ్లవుతున్న రోజున మాత్రం వాడి కళ్లల్లో నీళ్లు నిండుగా నిలిచాయి వాడిలో వున్న ప్రత్యేకత యిదేను బాధపడతాడు బాధపడు తున్నట్లు మాత్రం కనుపించడు ఆ రోజున వాడిస్థితి చూచిన తర్వాత నా వళ్లు మండిపోయింది నన్ను నేను మరిచిపోయి నా యిష్టం వచ్చినట్టు వాగే శాను

"ఎందుకు నటిస్తావ్ ? నువ్వాపిల్లని ప్రేంచినమాట నిజం ఆమెకున్నపాటి ధైర్యం నీకు లేకపోవడం శోచనీయం నువ్వు వప్పుకునుంటే మీ పెళ్లి బ్రహ్మాండంగా జరిగి వుండేది కానీ "

"నీకు తెలీదు రావ్ ! నన్ను పెళ్ళి చేసుకుని ప్రభావతి సుఖపడటం కల్ల మా వాళ్లందరూ రాక్షసులు, మనిషిని కొరుక్కుతినే దానవులు " అన్నాడు విశ్వనాథం

ఇది త్యాగ మనుకోవాలో—లేక— పిరికితన మనుకోవాలో తెలీదుగాని, ఆ విధంగా వాడు జీవితంలో ఒకచోట ఓడిపోయాడు

—ఈ కథ ప్రారంభంలో విశ్వనాథానికీ పసిపిల్లలకీ వున్న స్నేహంగురించి చెప్పి మధ్యలో వాడి ప్రేమగురించి రాయడంలో కథని మరో దోవకి పట్టిస్తున్నట్టు భావించరని తలుస్తాను విశ్వనాథం గురించి నాకు తెలిసినదంతా రాయడమే యీ రచన ముఖ్యోద్దేశం! పైగా యీ శీర్షిక పేరు 'తాడూ — బొంగరం ' బొంగరం మా విశ్వనాథం, వాడిచుట్టూ పెనవేసుకున్న సంఘటనలు తాడూను బొంగరం తిరగడానికి తాడు అవసరం కదూ మరి '

ప్రభావతి పెళ్లిజరిగిన తర్వాత చాలా కాలంవరకూ విశ్వనాథం తన పెళ్లిమాట ఎత్తలేదు ఎన్ని చెప్పి జూచినా ప్రయోజనం కనుపించలేదు చివరికి విసుగుపుట్టి వాడిపెళ్లిమాట అనుకోవడమే (దాదాపు) మానుకున్నాము అలాంటిది మొన్నీమధ్యనే ఓ చిత్రమైన ఉత్తరం రావడంతో కాస్త అలజడిలాటిది కలగడం జరిగింది

ఆ వుత్తరంలో తన పెళ్లిగురించి వాడు రాయకపోయినా, ఎందుచేతనో ఒక ఆశాభావం (ఉత్తరం చదివిన తర్వాత) ఉదయించింది ఉత్తరం మీముందుపెట్టే ముందు రెండు ముక్కలు ..ఇక్కడ 'ఇద్దరి'గురించి చెప్పుకోవాలి

విశ్వనాథం ఉద్యోగరీత్యా విజయవాడలో నివాసమేర్పరుచుకున్న మూడో రోజునే పరిచయమయింది చిట్టి అనబడే ఆరేళ్ళపాప విశ్వనాథం అద్దెకుంటూన్న గది తాలూకు పక్కవాటాలో చిట్టీ వాళ్లు వుంటున్నారు. అదేమి చిత్రమోగాని, విశ్వనాథంతో చిట్టి స్నేహం బహుకొద్ది రోజుల్లోనే అభివృద్ధి చెందింది వాడిని 'మామా' అని చక్కగా పిలుస్తూంటుంది చిట్టి.

లోగడ— ఓ మూడు రోజులపాటు విశ్వనాథంతో గడిపాను ఆ మూడు రోజుల్లోనూ వాళ్ళిద్దరి స్నేహం చూచి ఆనందించక తప్పిందికాదు విశ్వనాథం ఆఫీసునుండి రావడం ఆలస్యం, చిట్టి క్షణంలో వాడిముందు వాలేది 'మామా' అంటూను ఆపిల్ల నెత్తుకుని ముద్దు మాటలు చెప్పి తనుతెచ్చిన చాక్లెట్లూ వగైరా పెట్టేవాడు సహపారిసీ, మీదు

మిక్కిలి సన్నిహితుడినీ అయిన నన్ను మరచి. వాడు యింటి దగ్గరున్న కొద్ది సేపూ చిట్టితోనే గడిపేవాడు అప్పటి కప్పుడు అల్లిన కథలు చెప్పేవాడు, ఏవో పాటలు పాడేవాడు ఆ పిల్లచేత పాడించేవాడు

మావాడికి తగ్గట్టు ఆ పిల్లకూడా కాస్త హడావిడిగా వుండేది వాళ్ళమ్మా నాన్నా ఎంత పిలిచినా ఓ పట్టాన విశ్వనాథాన్ని వదలి వెళ్ళేదికాదు చిట్టినాన్నగారు నాతో అన్నారు—

"చూసారుగా మాస్టారూ వీళ్ళిద్దరి వరసా ! ఈయన ఏక్షణంలో కాలు పెట్టారోగాని. మా పిల్లతో బాగా కలిసి పోయారండి చిట్టికి సర్వం ఆయనే. పసిపిల్లల్తో స్నేహం చెయ్యడం గూడా ఒక గొప్ప ఆర్టే సుమాండి"

నిజమేనేమో ! అదీ ఒక గొప్ప ఆర్టేనేమో ! ఉదాహరణకి - నేనక్కడున్న మూడురోజుల్లోనూ చిట్టి ఏ రెండు మూడుసార్లో నాతో మాటాడింది. అదీ బహుకొద్ది మాటలేను తనపేరు, వాళ్ళ వూరు, ఏమి చదువుతుందీ యివి మినహాయించి మారోమాట నాతో మాటాడింది కాదు అలాంటిది మావాడితో ఒక పెద్ద కావ్యానికి సరిపడే 'విషయమంతా' విసుగు లేకుండా లొడాలొడా మాటాడేస్తుంటుంది వాడిని చూస్తూంటే ఆ పిల్లకి ఎక్కడలేని యిన్స్పిరేషనూ వచ్చేస్తుంది కాబోలు !

ఈచిట్టి ద్వారా వసుంధర అనబడే ఒక గృహిణి మావాడికి పరిచయమైందట ఇది మరీ చిత్రంగా, తమాషాగా జరిగిన పరిచయం వసుంధరని నే నెప్పుడూ చూడలేదు — ఉత్తరాల్లో వినడం మినహాయించి

వసుంధరభర్త మెడికల్ రిప్రజెంటేటివ్‌గా పనిచేస్తూంటాడట నెలలో సగ భాగం 'టూర్'లోనే గడిచి పోతుంటుందట ఆయనకు ఆయన లేని సమయాల్లో ఈ 'చిట్టి'గారితోనే ఆవిడకు కాలక్షేపం

ఒకటీ రెండురోజులు వేళకి చిట్టి కనిపించక పోవడంలో విశేష మేమిటో బోధపడక చిట్టి అమ్మగార్ని అడిగాడు విశ్వనాథం ఆమె నవ్వుతూ—

"మా చిట్టికి కొత్తనేస్తం దొరికిందండీ ! యికమీరు అట్టే గుర్తుండరు వసుంధర అని కొత్తగా మన పక్కింట్లో అద్దె కొచ్చారు ఆవిడగారితో యీవిడ గారికి వల్లమాలిన స్నేహం"

కొత్త స్నేహం దొరికిన తర్వాత చిట్టి రాకపోకలు తగ్గాయి ఒక రోజు విశ్వనాథం పనిమీద బజారుకు వెడుతూంటే, వసుంధర వాళ్ళింట్లోంచి చిట్టి పిలిచిందిట ఆగిపోయాడు చిట్టి తన చేతిని పట్టుకుని ఆ ఇంట్లోకి తీసుకెళ్ళింది ఇద్దర్నీ నిలబెట్టి ఒకరి కొకరికి పరిచయం చేసిందిట




"అదికాదు మిస్ శీలా! నీవు పని బాగానే చేస్తున్నావు! కాని నీవు వొచ్చిన తర్వాత మిగతావాళ్ళు పనిచేయటం మానివేశారు!"

ఈ విషయమై వాడు వ్రాస్తాడూ—

"చిట్టి పరిచయం నాకు బలే వింతగా కనిపించింది పాపం! ఆవిడ మరీ సిగ్గుపడిపోయినట్లు కనిపించారు ముందస్తుగా ఆవిడే నమస్కారంచేశారు నా పొరపాటుని గ్రహించి నొచ్చుకుంటూ ప్రతినమస్కారం చేశాను నిజం రావ్! ఇలాంటి ఇబ్బంది యింతకుమునుపు ఎప్పుడూ తెలియదు నీకు నవ్వుగావుంది కదూ? చిట్టి వయస్సుకి పసిపిల్లయినా చేష్టల్లో మాత్రం ఆరితేరిన గడుగ్గాయి నువ్వేగనుక నా స్థితిలో వుంటే?—"

చెప్పొద్దూ—ఆ సిట్యుయేషన్ తలుచుకుంటూంటే నా కాళ్ళు వణికాయి

ఇంత కధకీ ముఖ్యకారణం చిట్టి చిట్టి లేకపోతే వసుంధర గురించి తెలిసేదికాదు వసుంధర గురించి—

ముందు మా వాడు వ్రాసిన ఈ కొత్త ఉత్తరం చదవండి

డియర్ రావ్,

ఒక పది రోజులనుండీ నే ననుభవించే సంఘర్షణ యీ పెద్ద ఉత్తరంలో తెలియ జేయడమే ఒక ముఖ్యోద్దేశ్యంగా పెట్టుకుని రాస్తున్నాను ఒకటీ రెండు ఉత్తరాల్లో వసుంధర గురించి రాశాను ఇప్పుడు గూడా ఆవిడ గురించే రాస్తూన్నాను

వసుంధరతో పరిచయమైన మొదటి క్షణం ఆవిడ గురించి నేనేమీ అనుకోలేదు అందునా ఆ పరిచయం చిట్టిద్వారా

అయిందేమో మరీ చులకన భావం కలిగింది తోచీతోచక చిట్టి ఎవర్నో పరిచయం చేస్తే ఆవిడ నో ముఖ్యమైన స్నేహితురాలుగా భావించడ మేమిటి మరీను అని కూడా అనుకున్నాను చిట్టి నాకో చిన్న ప్రాబ్లమ్‌ని ప్రసాదించింది

నేను ఆ దారిన వెళ్లడం ఆలస్యం, వసుంధరా వాళ్లింటో వుండి నన్ను పిలిచేది చిట్టి చిట్టి ఎక్కనే ఆవిడ నుంచునుందేది చిట్టి పిలిస్తే వెళ్లకపోదును గాని, ఆవిడ చూస్తూండగా నా దారిన్నే పోతే ఏం బావుంటుందనిచెప్పి వెళ్లక తప్పేదికాదు ఆవిడ కాఫీ తెచ్చి నాకివ్వడం, ఇష్టం లేకపోయినా సభ్యత కోసం రెండుమూడు ముక్కలు మాటాడి రావడం రివాజై పోయింది

ఒక పెళ్లయిన ఆడపిల్లతో నాలాటి బ్రహ్మచారి స్నేహం చెయ్యడం మా చుట్టుపక్కల వాళ్లకేకాదు నీకూ విడ్డూరంగా వుంటుంది అపార్థం చేసుకోడానికి అవకాశం కూడా వున్నది అవుతే— ఎదుటపడి ఒక్కళ్లూ ఒక్క మాటైనా అనలేదు యింతవరకూ అలా అని నేను లోకానికి భయపడటం లేదనికాదు— ఇదంతా ఆవిడకు చెబితే నవ్వి నన్ను గేలి చెయ్యగలదన్న భయం గూడా వున్నది ఆ మనిషీ అలాటిదేను ఆవిడ దేన్నీ లెక్క చెయ్యనట్టు మాటాడుతుంది ఎల్లమ్మా పుల్లమ్మల గురించి చక్కటి సెటైర్స్ చెప్తుంటుంది మొదట్లో యీ లక్షణాలు గ్రహించలేకపోయాను

ఆవిడ చక్కటిమనిషేకాదు చక్కగా మాటాడగల నేర్పూ వున్నది ఆవిడకున్న అభిప్రాయాలు కుండబద్దలు కొట్టినట్టు చెప్పేస్తుంది తార్కాణంగా యీ క్రింద ఒకనాటి మా సంభాషణ రాస్తాను చదివి నీ అభిప్రాయం వ్రాయి

ఒక రోజు—ఆవిడే స్వయంగా పిలిచింది అలా పిలవటం ఇది మొదటిసారి ఆవిడతో చిట్టి లేకపోవడం గూడా మొదటిసారేను వెళ్లక తప్పిందికాదు కాసేపు ఏవో విషయాలు మాటాడుకున్నాం తర్వాత అన్నది

"మీతో ఒక చిన్న కథ చెప్పాలని చాలా కాలంనుండీ వుంది సమయం రాక చెప్ప లేదు ఇప్పుడు చెప్పమంటారా ?" చివర్ని తేలిగ్గా నవ్వుతూ అడిగింది నా యిష్టాన్ని ప్రకటించక మునుపేఆవిడచెప్పడం ప్రారంభించింది

" కాలేజీలో నాకో స్నేహితురాలుండేది ఇందిర దాని పేరు ఆ పిల్ల వేశ్యకులంలో పుట్టినా వృత్తికి దూరంగా సభ్యతా ప్రపంచాన్ని అంటిపెట్టుకుని వుండేది ఇందిర ద్వారా నాకు కుసుమ పరిచయమయ్యింది కుసుమ ఇందిరకు చెల్లెలు వరసవుతుందట ఆర్థిక దుస్థితి వల్ల ఆ అమ్మాయి వృత్తికి వప్పుకోక తప్పిందికాదు నరకం అనుభవిస్తో వెలుగుకోసం వెంపర్లాడే కుసుమని



"మనోవ్యాధి కాదు డాక్టరుగారూ! ప్రేమవ్యాధి చూడండి!"

ఒకతను మోసగించాడు పెళ్ళి చేసుకుని మనం నవజీవనం ప్రారంభిద్దామూ ఎన్నాళ్ళని ఈనరకం అనుభవిస్తావు? సంసారం, భర్త, పిల్లలూ, సౌఖ్యమూ ఇవంటే నీకూ యిష్టంకావా? అంగీకారమైతే నా వెంటరా, స్వర్గం చూపిస్తానూ అని మాయ మాటలు చెప్పి వప్పించాడు అతను దేవుడని భావించి, వెలుగు దొరికి నందుకు సంతోషించి, అతనితో మరో వూరికి వెళ్ళిపోయింది ఇప్పుడు ఆ అమ్మాయి పరిస్థితి చాలా అధ్వాన్నంగా తయారయ్యింది అతను మోసగాడని తెలుసుకుంది కుసుమ 'సంపాదన' ద్వారానైనా బ్రతకాలని ఆ నీచుడు ఆశిస్తున్నాట్ట ఒక సాలెగూడునుంచి తప్పుకుని మరో సాలిగూడులో యిరుక్కుంది కుసుమ ఆ వల నుంచి తప్పుకోడానికి ప్రయత్నాలు చేస్తోంది అయితే-బయటి కొచ్చిన తర్వాత తనని ఆదరించేందుకు మనుషులున్నారో లేదో నన్న దిగులు గూడా ఆమెను వెంటాడుతూనే వున్నది కుసుమకి మంచి రోజులొస్తాయంటారా?"

చెప్పొద్దూ-కుసుమ పట్ల నాకు సానుభూతి కలిగిన మాట వాస్తవం నేను చెప్పిన జవాబేమిటో తెలుసా? ఆవృత్తికీ అలాటి మనుషులకీ దూరంగా వుండి జీవించేందుకు ఏదైనా కుటీర పరిశ్రమ గాని మరోటి గాని పెట్టుకోమన్నాను ఈ మాట విని వసుంధర నవ్వింది

"కుసుమకి కావలసింది జీవనోపాధికి ఉపాయం కాదు జీవితానికి ఒక అర్థం, ఒక తీపిదనం" అన్నది వసుంధర

జవాబు చెప్పలేదు నేను

"పోనీ మీ దృష్టిలో అలాటి పతి తను ఆదరించి ఆమె కోరుకున్న జీవి తాన్ని ప్రసాదించగల యువకు లెవరైనా వుంటే చెప్తారా ?"

దానికీ జవాబు చెప్పలేదు. నేను

"పర్వాలేదు. బాగా ఆలోచించే సమాధానం చెప్పండి" అన్నదామె నెమ్మదిగా ఇంటికి వచ్చి ఆరాత్రంతా ఆలోచించాను బహుశా ఆవిడ నన్నుద్దేశించే ఈ ప్రశ్న అడగలేదుగదా అని అనుమానం కలిగింది ఒక వేళ అదే నిజమై అడిగినట్టయితే నా జవాబు ఎలా వుండాలి ? ఇదీ తెలీదు-కాదు-చెప్పలేక పోతూన్నాను నీ కేమైనా తోస్తే జవాబు రాయి లేదా-ఒకసారి యిక్కడికిరా సెలవు మరి

-విశ్వనాధం

ఒక మాటు వాడి దగ్గరకి వెళ్లితేనే బావుంటుందనిపించింది పైగా ఆవూళ్ళో చక్కబెట్టుకోవలసిన పనులు గూడా వున్నాయి నాలుగు రోజులు సెలవు పెట్టి రైలెక్కాను

వాడి రూముకి తాళం వేసి వున్నది. పక్కవాటా తలుపులు గూడా మూసి వున్నాయి ఏంతోచలేదు అలా అక్కడే నుంచుని వసుంధరా వాళ్లింటి వైపు చూస్తూన్నాను

"మామా" అని చిన్నగా పిలుపు వినిపించిది ఉలిక్కిపడి తిరిగి చూశేను ఎవరూ కనుపించలేదు మళ్లా 'మామా' అని వినిపించింది చూశాను

కిటికీ ఊచలు పట్టుకొని. తల బయటకు పెట్టడానికి అవస్థ పడుతూ. పిలుస్తోంది చిట్టి ఆస్థితిలో చిట్టిని చూడగానే నవ్వు పుట్టుకొచ్చింది గబగబా కిటికీ దగ్గరకు వెళ్లి నిలబడ్డాను

" మామ లేడు స్టేషను కెళ్లాడు ఇప్పుడే వస్తాడు నేను బయటకు రాకూడదు అమ్మతంతుంది నువ్వు ఇక్కడే వుండు ఎక్కడికీ వెళ్లొద్దు ఏం ? " అంటూ గబగబా సాధ్యమైనంత మెల్లిగా చెప్పింది చిట్టి

చిట్టి ఇంట్లో కాలుంచదని నాకు తెలుసు అలాటిది బయటకొస్తేవాళ్లమ్మ కొడుతుందని చెప్పుం దేవిటీ ?

"ఎవరే అది?" చిట్టితల్లి గొంతు వినిపించింది

"రావుమామ విస్సుమామకోసం వచ్చాట్టా "

"అతను లేడని చెప్పు ముందు ఆ కిటికీ దిగి యిలారా అక్కడ నీకేం పనసలు ఊc త్వరగారా " కాస్త బిగ్గరగా అన్నదావిడ

చిట్టి నా వైపు జాలిగా ఓమాటు చూచి కిటికీ దిగేసి వెళ్ళి పోయింది లోపల ఏదో అస్పష్టంగా మాటలు వినిపిస్తున్నాయి మధ్య మధ్య చిట్టి మారాము వినిపిస్తూనేవుంది ఆతల్లి చిట్టిని కొట్టింది కాబోలు—ఏడుస్తోంది

"నోర్మమూయ్ పెద్దదాని వయ్యావు ఆరెందాలా " గట్టిగా కసురుకుంది తల్లి నా కేం తోచడం లేదు అంతా అయోమయంగా వున్నది మళ్లా ఓ మాటు వీధివైపు చూశాను విశ్వనాథం వస్తున్నాడు తల వంచుకుని. అతన్ని చూస్తూనే ఏదో కీడు శంకించాను

వచ్చాడు నన్ను నవ్వుతూ పలుకరించి తలుపు తీశాడు హోల్డాలు పరచి కూర్చోమనిచెప్పి తనూ కూర్చున్నాడు

"ఉత్తరం చదివి వచ్చావా?"

"అవును "

"వసుంధర లేదు వెళ్లిపోయింది "

' అంటే?'' ఆశ్చర్యమని పించింది అతని మాటలు వినగానే

''ఆవిడను యీ వీధి వాళ్లంతా చిత్రహింస చేశారు మాటలకు జంకే మనిషి కాకపోయినా నా క్షేమాన్ని ఆశించి వెళ్లిపోయింది."

ఉలిక్కి పడ్డాను వాడు ఏమిటి మాటాడుతున్నాడో అర్థంకావడంలేదు వాడి కనుకొనల నీరు నిండుకోవడం చూచి గతుక్కుమన్నాను ఇది మరీ విరుద్ధ మనిపించింది

' కుసుమంటే ఎవరో కాదు—వసుంధరే' తనగురించి తిన్నగా చెప్పుకోవడం యిష్టంలేక కథలా చెప్పింది దురదృష్టవంతురాలు-నే వెళ్లేసరికి ఆమె ఎక్కిన రైలు కదిలింది బహుశా మళ్లీ నాకు కనిపించదు కాబోలు " అన్నాడు గాద్గదికంగా

అవుతే వసుంధరను—కాదు—కుసుమని పెళ్లిచేసుకోడం వాడికిష్టమో కాదో స్పష్టంగా చెప్పలేదువాడు అప్పుడే గాదు ఇప్పటి వరకూను ★



# మానవసేవ

## ధనికొండ హనుమంతరావు

తీయని కలలుకన్న నిద్రనుంచి మెలకువ వచ్చింది - డాక్టర్ గోపాలానికి. ఐతే మంచం మీదినుంచి లేవబుద్ధి కాలేదు. గడియారం నాలుగు గంటలు కొట్టింది. ఇంకా గంటన్నరపై మున్నది. కనుక మరో అరగంట సేపన్నా తీయని ఆలోచనల్ని సాగించుకోవచ్చునుకున్నాడు డాక్టర్,

తన జీవితంలోని ముఖ్య ఘట్టాలన్నీ శరవేగంతో ఆయన బుర్రలో మెరుపులవలె మెరిసినవి :

బాల్యంలో తాను అనుభవించిన బీదరికమూ, తల్లి ఎన్నో కష్టాలుపడి చదువు చెప్పించటమూ, తాను తల్లి కష్టాన్ని వృథా కానీకుండా ఉత్తమ తరగతుల్లో ప్యాసు కావటమూ,



స్కాలరుషిప్స్, ఇతర బహుమానా
లెన్నో పొందటమూ, కాలేజీ చదు
వులు కూడా పూర్తిచేసి డాక్టరు
అయేందుకు ఉత్సాహపడటమూ,
ఇంతలో తల్లి కూడా మరణించగా,
ఏకాకిగా మద్రాసువచ్చి, వారాలు
చేసుకుంటూ, ట్యూషన్‌లు చెప్పు
కుంటూ మెడిసిన్ చదవటమూ-తన
ప్రతిభా విశేషాల కారణంగా నలుగురి
మన్ననల్ని పొందటమూ, ముఖ్యంగా
విశ్వేశరావుగార్ని - అంతకన్న అన

సూయాదేవి హృదయాన్ని దోచెయ్య గలగటమూ, ఏకైక పుత్రికను కాదన లే, ఐశ్వేశ్వర రావుగారు అనసూయా దేవినిచ్చి తనకు పెళ్ళి చేయటమూ, ఆ దెబ్బతో తన పని తంతే గారెల బుట్టలో పడ్డట్టు కావటమూ, తన జీవిత చక్రమే సానుకూలంగా తిరగ నారంభించటంతో, ఐశ్వర్యవంతు డైన మామగారి సహాయ సంపన్న తతో కెనడాకు వెళ్ళి హృద్రోగ నిపు ణుడు కావటమూ, ఆ తరువాత స్వంత ప్రాక్టీస్ పెట్టటంవల్ల కొద్ది మందికే తాను సేవ చేయగలుగు తాననే ఉద్దేశ్యం అడ్డురాగా, అత్యధిక సంఖ్యాకులకు తాను సేవచేయాలనే కుతూహలం వెన్నాడగా జనరల్ హాస్పిటల్‌లో హృద్రోగ నిపుణుడుగా చేరటమూ జరిగింది.

ఎంత మంది బీద ప్రజలను తాను మృత్యుగహ్వారంలోంచి తప్పించాడో తలుచుకుంటేనే తన జన్మ పావన మైనట్లు, మైమరిపించే విధంగా శరీరం పులక లెత్తుతుంది. డబ్బు ప్రస్తావన లేకుండా మానవసేవే పరమ లక్ష్యంగా వృత్తి ధర్మాన్ని స్వీకరించాడు. ఐతే తానుకూడా ధన సంపాదన చేసి తీరాలని నలుగురూ అనటమూ, తాను కూడా నమ్మటమూ జరగటంలో, ఉదయం రెండు గంటలసేపు ఇంటి దగ్గర కన్సల్టేషన్ ఏర్పాటుచేశాడు. మొదట్లో ఐదు రూపాయిలతో ఆరంభమై ఇప్పుడది యాభై రూపాయి లైంది. లక్షలు గడించిన తనకు ఇప్పుడా ధనాపేక్ష కూడా లేదు. ఐనప్పటికీ రోగుల సంఖ్య ఐదు రూపాయిల నాడు ఎలా ఉన్నదో, యాభై రూపాయిలనాడూ అలాగే ఉన్నది. ఒక్కోనాడు విసుగుపుట్టి అనేక మంది రోగుల్ని మర్నాడు రమ్మని చెప్పటం, ఆ మర్నాడూ తాను చూడలేనన్ని కేసులు కాచుకొనికూర్చోవటం జరుగు తూనే ఉన్నది.

స్పెషలిస్టుగా తన పేరు ప్రఖ్యా తులు దేశపు నలుమూలలా అలము కున్నవి. దూర తీరాలనుంచి లక్షాధి కారులు వచ్చి, చికిత్సపొంది పెద్దపెద్ద మొత్తాలు ముట్టజెప్పి పోతూనే ఉన్నారు. ఈ విధంగా తాను కలలో కూడా ఊహించలేనంత డబ్బు సంపా యించాడు.

ఇక దాంపత్య జీవితము – మూడు కాయలు ఆరుపూవులుగా ఉన్నది. అసలు ఇల్లాలి రాకతోనే అదృష్ట దేవత కూడా తనను వరించటం జరిగింది. అందుకనే అనసూయాదేవి (అసలు పేరు అనసూయే ఐనా 'దేవి' తాను చేర్చాడు) అంటే తనకు పంచ ప్రాణాలూను.

—ఆ తలపుల ప్రవాహానికి ఆనకట్ట వలె టెలిఫోన్ గణగణమన్నది. టెలి

ఫోన్ వైపైనా చూడకుండానే గోపాలం ఎంతో చికాకుపడ్డాడు. అదేమీ గమనించకుండా టెలిఫోన్ మోగుతూనే ఉన్నది. ఐనప్పటికీ గోపాలం లేచివెళ్ళి టెలిఫోన్‌ను ఎత్తలేదు.

కొట్టుకు కొట్టుకు అదే ఆగిపోతుందనుకున్నాడు గోపాలం. కాని అది ఘోషపెడుతూనే ఉన్నది.

అనసూయాదేవి వచ్చి టెలిఫోన్ ఎత్తింది. కాస్త విని "లైన్‌లో ఉండండి—" అన్నది.

అప్పటికి గోపాలం చిరాకుగా కళ్లు తెరిచాడు.

"ఏరోడ్రోమ్ నుంచి—" అని అనసూయాదేవి టెలిఫోన్‌ను తన భర్త చేతికి ఇచ్చింది.

"హలో!" అన్నాడు డాక్టర్ గోపాలం చిరాకు ధ్వనించే కంఠస్వరంతో.

"డాక్టర్‌గారేనా మాట్లాడేది?"

"ఔను. .డాక్టర్ గోపాలం,హార్ట్ స్పెషలిస్ట్" ఆ చిరాకును రెట్టించాడు.

"నేను ఏరోడ్రోమ్ నుంచి మాట్లాడుతున్నాను సార్. ఛీఫ్ స్ట్యూవర్ట్‌ను. బొంబాయి నుంచి వస్తున్న విమానంలో ఒక పాసింజర్‌కు హార్ట్‌ఎటాక్ వచ్చిందనీ, ఏరోడ్రోమ్ దగ్గిర హార్ట్ స్పెషలిస్టును సిద్ధంగా ఉంచమనీ వైర్‌లెస్ మెసేజ్ వచ్చింది. విమానం మరో గంటా,గంటంపావుకు వస్తుంది. కనుక మీరు దయచేసి ఇక్కడికి రావాలని కోరుతున్నాను-"

డాక్టర్ గోపాలానికి చాలా చిరాకు వేసింది. ఈ రోగాలకు ఆదివారాలేమిటి, సోమవారాలేమిటి — రాత్రులేమిటి, పగళ్లేమిటి? తనను కాస్త విశ్రాంతి తీసుకోనీవుగదా! ఇన్ని వేల మంది గుండె జబ్బులకు చికిత్సచేసే తన గుండె ఎలా తయారవుతుందో నన్న సానుభూతన్నా ఉన్నదా వీళ్లకు? ఎవడో విమాన ప్రయాణీకునికి హార్ట్ ఎటాక్ వస్తే పిలుపు తనకేనా? టెలిఫోన్ డైరెక్టరీ చూసి పిలిచి ఉంటారు. మొదట్లో రోగులమీద ఉండే జాలీ, దయా ఇప్పుడు, యీ వయస్సులో లేవు. అంతా రొటీన్-డైనందిన కార్యక్రమంగా సాగిపోతూన్నది. వృత్తిమీద శ్రద్ధ కూడా పూర్వమంత లేదు.

"నాకు వేరే పని ఉన్నది. ఇంకెవర్నైనా పిలవండి-" అని కాస్త మృదువుగానే చెప్పాడు డాక్టర్ గోపాలం.

"మీకన్న ప్రముఖులులేరు. అవతల ఒక మానవప్రాణం డాక్టర్!"

డాక్టర్ గోపాలానికి చర్రుమన్నది. డాక్టర్‌గా తన బాధ్యతను గూర్చిన హెచ్చరిక ఏమిటి? తాను ఎన్ని వేల మానవ ప్రాణాలను ఇంతకుముందు

రక్షించలేదు కనుక! ఒకవేళ యీ మానవ ప్రాణిని రక్షించలేకుంటే మాత్రం వచ్చిపడే ప్రమాదమేమిటి? అపకీర్తి ఏమిటి? నష్టమేమిటి?

''అయ్యా, నేను ఆలిండియా డాక్టర్స్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళితీరాలి. ఆదివారంనాడు కూడా కాస్త ఊపిరి పీల్చుకోవాలి. మీరు చెప్పేది అంత సీరియస్ కేసే ఐతే, నేను వచ్చి చేసేది ఏమీ ఉండదు. కాకుంటే రేపు ఉదయందాకా ఎలాగూ రోగి బతికి ఉంటాడు కనుక, రేపు చూసు కుంటాను....''

''డాక్టర్! మీరు — ''

"వినండి-నాకు టైమ్‌లేదు. మీరు జనరల్ హాస్పిటల్‌కు ఫోన్‌చేసి ఏంబు లెన్స్ తెప్పించుకోండి. అక్కడ, వాళ్లు చూస్తారు—" అని ఇక యీ సంభాష ణను పొడిగించేందుకు ఇష్టంలేక ఫోన్ పెట్టేశాడు డాక్టర్ గోపాలం.

—గదిలో ప్రశాంతత ఏర్పడ్డంతో గోపాలం తిరిగి తన తలపుల తాలూకు తెగిన కొనను అందుకున్నాడు!

జీవితం తన కిప్పుడు వడ్డించిన విస్తరి. స్వయం ప్రతిభా విశేషాలకు తోడుగా 'కలిసిరావటం' కూడా జరి గింది. సంసారసౌఖ్యం పరాకాష్ఠ నందుకుంది. కలిగింది ఒక్కడే కొడు కైనా-రత్నంలాటివాడు-మాధవరావు. 20 ఏళ్ళ వయసులోనే లండన్ లో యం. డి., చదువుకు వెళ్ళాడు. తన తదనంతరం తనంత గొప్ప హార్ట్ స్పెషలిస్టు అవుతాడనేందుకు ఎలాంటి సందేహమూలేదు.

ఇవాళ ఐదున్నరకు ఆలిండియా డాక్టర్స్ కాన్ఫరెన్స్‌లో తాను 'మానవసేవ' ను గూర్చి అనర్గళంగా మాట్లాడబోతున్నాడు. రాత్రి చాలా సేపు మేలుకొని కూర్చిన ఆణిముత్యా ల్లాటి వాక్యాలు ఆ ఉపన్యాసంలో ఎన్నో దొర్లినవి. వాటిల్లో కొన్నిటిని డాక్టర్ జ్ఞాపకం చేసుకున్నాడు.

'నీవెంత సుఖపడుతున్నావనికాదు నీ చుట్టూ ఉన్న జనావళిని ఎంత సుఖ పెట్టావనేదే ముఖ్యం!

'ఎంత మందిని మృత్యు గహ్వరం నుంచి రక్షించావో, రక్షించాలని కంకణం కట్టుకున్నావో, అదే నీ జన్మ సాఫల్యత!

'మానవుని విలువను డాక్టర్ వృత్తిలోకన్న మిన్నగా చూపేది మరొకటిలేదు, డాక్టర్ ప్రాణదాత అనేదాన్ని ఏ మరిచివుండకు. ఎప్పుడు, ఎక్కడ, ఏవిధంగా ఆపత్సమయం ఆసన్నమౌతుందో, నడుంకట్టుకొని కార్యరంగంలోకి దూకి, మృత్యు వుతో పోరాడి వీరుడివనిపించుకో.

'మానవసేవే మాధవసేవ అనే విష యాన్ని గాఢ నిద్రలో కూడా మరిచి పోకు. ఏ తరగతికి చెందినవాడైనప్ప




"నాకు వకీలు లేదు. నన్ను నేనే డిఫెండు చేసుకుంటాను."

టికి మానవుడు ఒక్కడే! వాడి సేవకు ఎప్పుడూ సందేహించకు. నిండు మనసుతో నీవిద్యాకౌశలాన్ని ప్రదర్శించు. ప్రాణ రక్షణకు మించిన పవిత్రకార్యం మరొకటి యీ ప్రపంచంలో లేదు. నీ శ్రమ నంతట్నీ మానవాభ్యుదయానికే అంకితం చెయ్యి—'

ఇలాటి మెరికల్లాటి వాక్యాలను తలుచుకుంటుంటే డాక్టర్ గోపాలానికి ఒళ్ళు జలదరించింది.

గడియారం అరగంట గడిచిపోయిందని హెచ్చరించింది.

"మీటింగేదో ఉన్నదన్నారు !" అని భార్య కూడా చేసిన హెచ్చరికతో, ఎంతో ఉత్సాహంగా, గోపాలం పక్కమీంచి లేచాడు.

త్వరతరగా బాత్‌రూమ్‌వైపు దారి తీశాడు.

గోరువెచ్చని నీరు ఒంటిమీద పోసుకుంటూంటే నిద్ర తాలూకు బడలికంతా మాయమై హాయిహాయి అనిపించింది. విదేశాల్లో తయారైన సబ్బు పరిమళం ఆహ్లాదకరంగా ఉన్నది. జీవితంలో తనంత హాయిగా ఉండే వారెవరైనా ఉన్నారా?

తన గదిలో మళ్ళీ టెలిఫోన్ మోగుతోంది. రుచికరమైన భోజనం చేస్తూంటే మధ్యలో పలుగురాళ్ళ

పంటికింద పడ్డట్లుందది! అధునాతన ప్రపంచంలో టెలిఫోన్‌ను చూసి మానవుడు మురిసిపోతూంటాడు; కాని ఒకో సమయంలో ఎంత ప్రశాంతతను అది భంగపరుస్తూంటుందో!

భార్య ఏదో మాట్లాడి ఉంటుందని అనుకున్నాడు గోపాలం. తొందర పడకుండా హాయిగా స్నానంచేసి, డ్రెస్ చేసుకొని గదిలోకి వచ్చాడు.

"ఆ ఏరోడ్రోమ్ నుంచి మళ్ళీ పిలిచారు—" అంది భార్య.

"నేను వచ్చేందుకు వీల్లేదని చెప్పినా వాళ్ళకి బుద్ధిలేదు." అన్నాడు డాక్టర్ గోపాలం.

"మీరు వచ్చి మాట్లాడతారని చెప్పాను." తన బాధ్యతను వొదిలించుకున్న దామె.

చిరాకుగా ఉన్నా భార్యమీది గౌరవంచేత, అనురాగంవల్ల డాక్టర్ గోపాలం టెలిఫోన్ తిప్పాడు.

"నేను డాక్టర్ గోపాలాన్ని మాట్లాడుతున్నాను. ఇంతకుముందే నేను రాలేనని తమకు విన్నవించుకున్నాను. మాటిమాటికీ ఫోన్ చేసి..."

"డాక్టర్‌గారూ! ఒక్క మనవి వినండి. తమ ఆదేశానుసారం ఇతర డాక్టర్లకు ఫోన్ చేశాను. ఎవరికి వారు ఆలిండియా మెడికల్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళాలనే అన్నారు. అందులోనూ ఇది హార్ట్ ఎటాక్ కేసు. ఎంత ప్రమాదకరమైనదో, వెనువెంటనే హార్ట్ స్పెషలిస్టు చూడకుంటే ఏమౌతుందో నేను వేరుగా చెప్పక్కర్లేదు.... ఆ వచ్చే రోగి ఎవరో, ఎక్కడివాడో కూడా మాకు తెలియదు. నా బంధువు, స్నేహితుడు కాదు సరికదా - చివరకు పరిచయస్థుడు కూడా కాదు. ముక్కూ మొహమూ తెలియని ఆ మానవుణ్ణి రక్షించేందుకు మేము ప్రయాసపడుతున్నాము. బాధ్యతగా భావించి—"

మధ్యలోనే డాక్టర్ చిరాకుతో అన్నాడు: "మిస్టర్! ఆ మాత్రం బాధ్యతలు మీ కొక్కరికే తెలుసనీ, మాకు తెలియవనీ మీరు పొరబడుతూన్నట్లు తెలుస్తోంది. అహోరాత్రులు మేమెంత కష్టపడి మానవసేవ చేస్తున్నామో బహుశా మీకు తెలియదనుకుంటాను. 'మానవసేవ' అంటే ఏమిటో, యీ వృత్తిలో ఉన్నవారు ఎంత మానవసేవ చేస్తున్నారో మొదలైన విషయాలు ఇవాళ కాన్ఫరెన్సులో మాట్లాడుతాము. తీరిక ఉంటే మీరూ రండి, లేదా రేపు పేపర్‌లో చదువుకోండి. నాకు టైం అయింది—వెళ్ళాలి—"

అని టెలిఫోన్ పెట్టేసి డాక్టర్ గోపాలం ఆదరాబాదరా తన కారు దగ్గిరికి పరుగెత్తాడు.



## 2

కాన్ఫరెన్స్ కళకళలాడుతూ ఉన్నది. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి ప్రత్యేక నైపుణ్యాలున్న డాక్టర్లు, విఖ్యాతులైన వారు ఎందరో వచ్చి ఉన్నారు. చిన్నచిన్న డాక్టర్లు తాము కూడా ఎప్పటికైనా ఆ గొప్ప వారి స్థాయిని అందుకుంటామా అనే అనుమానంతోనూ, ఆ ఘనులు మాట్లాడే పసిడి పలుకుల్ని విని జీర్ణించుకోవాలనే కుతూహలంతోనూ వేచి ఉన్నారు.

'మానవసేవ' అనే విషయంమీద ఒకర్ని మించి మరొకరు మాట్లాడుతున్నారు. డాక్టర్ గోపాలం కూడా రాత్రి తయారుచేసుకున్న ఉపన్యాసాన్ని గంభీర ధోరణిలో చదివేశాడు. అనేకసార్లు సభికుల కరతాళ ధ్వనుల కారణంగా ఉపన్యాసాన్ని కొద్ది క్షణాలపాటు ఆపుకోవలసి వచ్చింది. తాను ఆశించిన దానికన్న ఎక్కువ ఎఫెక్ట్ వచ్చినందుకు డాక్టర్ గోపాలం ఉప్పొంగిపొయ్యాడు. కీర్తితో ఎంతో బరువెక్కిన ఆయన శరీరం కుంగిపొయ్యేందుకు మారుగా ఎంతో తేలికై గాలిలో తేలియాడుతూన్నట్లు తోచింది.

ఆ తరువాత మాట్లాడిన వారు డాక్టర్ గోపాలం ఉపన్యాసాన్ని శ్లాఘించటంలోనూ, అధునాతన పద్ధతుల్లో ఆయన హృద్రోగులకు చేసే చికిత్సా విధానాన్ని పొగడటంలోనూ నిమగ్నులయ్యారు.

ఉపన్యాసాలు ఇంకా సాగుతూనే ఉన్నవి. ఎవరో వచ్చి గోపాలం చెవి దగ్గరకు వొంగి "మిమ్మల్ని ఎవరో టెలిఫోన్‌లో పిలుస్తున్నారు సార్!" అన్నాడు.

వాడే — పరోక్షంనుంచి తనను రమ్మని వేధించుకు తింటూన్నవాడే

నసే అనుమానం కలగటంతో డాక్టర్ గోపాలానికి అరికాలిమంట నెత్తి కెక్కింది. ఎలాగో తమాయించుకొని "ఇప్పుడు ఇక్కణ్ణుంచి కదిలేందుకు వీల్లేదని చెప్పు" అన్నా డాయన. ఆ వచ్చిన వాడు వెళ్ళిపొయ్యాడు.

సభంతా నిశ్శబ్దంగా ఆ యా ఉప న్యాసాలను వింటూ, మానవ సేవ తాలూకు పరమార్థాన్నీ, సారాన్నీ నరనరానికీ పట్టించుకుంటోంది.

పావుగంట గడిచాక మళ్ళీ ఎవరో వచ్చి గోపాలం చెవి కొరికారు: "మీ ఇంటి దగ్గర్నుంచి పిలుస్తున్నారు సార్ !" అని

ఈసారి చిరాకుపడకుండా నే డాక్టర్ గోపాలం లేచి వెళ్ళాడు. అవతలినుంచి అనసూయా దేవి మాట్లాడుతోంది: ఆమె కంఠస్వరం వొణికిపోతోంది, గొప్ప షాక్ తగిలిన వ్యక్తి, మాట్లాడక తప్పనప్పుడు ఏవిధంగా మాటలు కూడ బలుక్కుం టుందో ఎంతో అనుభవమున్న డాక్టర్ గోపాలం ఊహించకపోలేదు.

"ఏరో్డ్రోమ్‌నుంచి కబురండీ.. మన మాధవుడు హార్ట్ ఎటాక్‌తో బోంబే ప్లేన్‌నుంచి దిగి గంట పైగా అయిందట. "

"ఎవరూ ? . మాధవుడా ? . వాడు లండన్ వెళ్ళాడుగా ! బొంబే నుంచి రావటమేమిటి ?" డాక్టర్ గోపాలానికి అంతా అయోమయంగా ఉన్నది.

"మీరు వెళ్ళాక కేబిల్ వొకటి వచ్చింది. నేనప్పుడు అది విప్పలేదు. పారిస్‌లో హార్ట్ ఎటాక్ రావటంతో- ఎవరెంత చెప్పినా వినక, మాధవుడు తిరుగు ప్రయాణం చేస్తున్నట్లుగా కేబిల్‌లో ఉంది !"

ఇక మాట్లాడి కాలయాపనచేయటం ఎంత మౌఢ్యమో డాక్టర్ గోపాలానికి అర్థమయింది.

"ఇప్పుడే వస్తున్నా-" అని టెలి ఫోన్ పెట్టేసి డాక్టర్ గోపాలం ఆఘమేఘాలమీద ఇంటికి బయలు దేరాడు.

తన భార్య మొహంలో కత్తివేటు క్కూడా నెత్తురుచుక్క ఉన్నట్లు తోచ లేదు గోపాలానికి. హడావిడిగా ఏమ ర్జెన్సీ బాగ్ సర్దుకున్నాడు.

"ఏరో్డ్రోమ్‌కు ఫోన్ చేశాను-" అన్నది అనసూయాదేవి. "ఎంతమంది డాక్టర్లకు ఫోన్‌చేసినా ఒక్కరూ రాలే దట. సీరియస్ కేసేనని తాము అభి ప్రాయ పడుతూన్నారట ... యీ డాక్టర్ల గుండెలు ఎంత బండ మొండివో !"

భార్య మాటలు డాక్టర్ గోపా లానికి సరిగా అర్థం కావటంలేదు. కాని చివరకు ఆమె అన్న మాటలు మాత్రం హృదయపు లోతుల్లో




"ఒరేయి కిష్టాయ్, నీ భార్య చచ్చిపోయిందిరా ?"
"అలాగా ! అయితే యింకా రెండు ముంతలు వెయ్యి, దుఃఖం మర్చిపోతాను."

ఘాటుగా నాటుకున్నవి. ఆమె పొరబడినట్లు తేలిగ్గా తెలుస్తోంది. ఎందుకంటే-ఆమె అన్నట్లు డాక్టర గుండెలు మొండిబండతే ఐనపక్షంలో తన హృదయం ఇప్పుడిలా నీరైపోతూ, తనను నిలవనీకుండా చేస్తుందా ?

భార్యా సమేతంగా డాక్టర్ గోపాలం అరవై మైళ్ళ స్పీడుతో ఏరోడ్రోమ్‌వైపు కారు పోనిచ్చాడు.

## 3

డాక్టర్ గోపాలం నిద్రమేల్కొని సూర్యోదయాన్ని చూశాడనటంకన్న మేలుకొనేఉండి తన జీవితంలో మొట్ట మొదటిసారి సూర్యోదయాన్ని యీనాడు చూశాడనటం సమంజసం.

తెల్లవారుజాముదాకా గుండె లవిసేట్లుగా దుఃఖించిన అనసూయాదేవి, కటిక నేలమీద తలకింద మెత్తని తలగడా అన్నా లేకుండానే సొమ్మసిల్లింది. తన చేతుల్లోంచి అన్ని అవకాశాలూ జారిపోగా జీవమున్న కట్టెవలె నిలబడి తన శూన్యదృక్కుల్ని దేనిమీదా కేంద్రీకరించలేని అశక్తుడయ్యాడు డాక్టర్ గోపాలం.

ఉదయపు వార్తాపత్రిక వచ్చింది. బంగళా చుట్టూ భరించలేని శోకం మూర్తీభవించి, గడ్డకట్టిపోయింది.

యదాలాపంగానే పత్రిక విప్పాడు డాక్టర్.

గత సాయంత్రం 'మానవసేవ'ను గూర్చి తానిచ్చిన ఉపన్యాసం మకు

టాలతో ప్రచురించబడింది. అదంతా చదవవలసిన పనిలేదు; దానిమీద ఇంటరెస్టూ లేదు.

ఆ కిందనే ఉన్న వార్తకూడా తనకు కొత్తకాదు. సుప్రసిద్ధ హృద్రోగ నిపుణుడైన డాక్టర్ గోపాలం ఏకైక పుత్రుడు మాధవరావు - సకాలంలో సరైన డాక్టర్ లభ్యపడని కారణంగా, హార్ట్ ఎటాక్‌తో ఏరోడ్రోమ్‌లో మరణించినందుకు పత్రికవారు తమ సంతాపాన్ని తెలియజేశారు!

మానవసేవను గూర్చి తాను నిన్న చెప్పిన ఉపన్యాసంలోని ఆణిముత్యాల్లాంటి వాక్యాలు, తాను మనసా వాచా నమ్మినవి ఎంత నిరర్థకమైనవో డాక్టర్ గోపాలానికి నిన్న ఏరోడ్రోమ్‌లోనే తెలిసింది. ఇప్పుడు వాటిని ఖండిస్తూ తాను మరొక ఉపన్యాసం ఇవ్వవలసిన పనిలేదు. దేశంలో వార్తాపత్రికలు చదివే వారందరూ కూడా వాటిని ఎంతో మెచ్చుకోవచ్చు. పిల్లలకు కాపీ పుస్తకాలకుగాను కొన్ని వాక్యాలను ఏరుకోనూవచ్చు. కాని ఆ మాటలన్నీ కూడా తన జీవితంలో అర్థవిహీనమై, నిస్తేజంగా, నిస్సారంగా- పనిలేనివాడు నిఘంటువులో నుంచి ఏరి, ఏర్చికూర్చిన పదజాలాల వలె నిష్ప్రయోజనం! అందుకనే ఆ వార్తాపత్రికను తునాతునకలుగా చింపిపారేశాడు—డాక్టర్ గోపాలం.

ఇప్పుడు నిజమైన 'మానవసేవ' ఏమిటో దాని రూపురేఖ లెలాటివో, ఆచరించవలసిన విధానాలేమిటో డాక్టర్ గోపాలానికి నసాళానికి అంటేట్లుగా వంటబట్టింది తనలో తను సిగ్గుపడుతూ, కుంగిపోతూ మూలనున్న కుర్చీలో కూలబడి సకాలంలో మానవసేవ చేయలేని తన అసమర్థతనుగూర్చి దుఃఖించసాగా డాయన. ★



"ఒరేయి కిష్టాయ్, నీ భార్య చచ్చిపోయిందిరా ?"
"అలాగా ! అయితే యింకా రెండు ముంతలు వెయ్యి, దుఃఖం మర్చిపోతాను."

ఘాటుగా నాటుకున్నవి. ఆమె పొర బడినట్లు తేలిగ్గా తెలుస్తోంది. ఎందు కంటే–ఆమె అన్నట్లు డాక్టర్గ గుండెలు మొండిబండతే ఐనపక్షంలో తన హృదయం ఇప్పుడిలా నీరై పోతూ, తనను నిలవనీకుండా చేస్తుందా ?

భార్యా సమేతంగా డాక్టర్ గోపాలం అరవై మైళ్ళ స్పీడుతో పరోడ్రోమ్‌వైపు కారు పోనిచ్చాడు

## 3

డాక్టర్ గోపాలం నిద్రమేల్కొని సూర్యోదయాన్ని చూశాడనటంకన్న మేలుకొనేఉండి తన జీవితంలో మొట్ట మొదటిసారి సూర్యోదయాన్ని యీ నాడు చూశాడనటం సమంజసం.

తెల్లవారుజాముదాకా గుండె లవి సేట్లుగా దుఃఖించిన అనసూయాదేవి, కటికనేలమీద తలకింద మెత్తని తల గడా అన్నా లేకుండానే సొమ్మ సిల్లింది. తన చేతుల్లోంచి అన్ని అవ కాశాలూ జారిపోగా జీవమున్న కట్టె వలె నిలబడి తన శూన్యదృక్కుల్ని దేనిమీదా కేంద్రీకరించలేని అశక్తు డయ్యాడు డాక్టర్ గోపాలం.

ఉదయపు వార్తాపత్రిక వచ్చింది. బంగళా చుట్టూ భరించలేని శోకం మూర్తీభవించి, గడ్డకట్టిపోయింది.

యదాలాపంగానే పత్రిక విప్పాడు డాక్టర్.

గత సాయంత్రం 'మానవసేవ' ను గూర్చి తానిచ్చిన ఉపన్యాసం మకు

టాలతో ప్రచురించబడింది. అదంతా చదవవలసిన పనిలేదు; దానిమీద ఇంటరెస్టూ లేదు.

ఆ కింద వేసున్న వార్తకూడా తనకు కొత్తకాదు. సుప్రసిద్ధ హృద్రోగ నిపుణుడైన డాక్టర్ గోపాలం ఏకైక పుత్రుడు మాధవరావు - సకాలంలో సరైన డాక్టర్ లభ్యపడని కారణంగా, హార్ట్ ఎటాక్‌తో ఏరోడ్రోమ్‌లో మరణించినందుకు పత్రికవారు తమ సంతాపాన్ని తెలియజేశారు!

మానవసేవను గూర్చి తాను నిన్న చెప్పిన ఉపన్యాసంలోని ఆణిముత్యాల్లాంటి వాక్యాలు, తాను మనసా వాచా నమ్మినవి ఎంత నిరర్థకమైనవో డాక్టర్ గోపాలానికి నిన్న ఏరోడ్రోమ్‌లోనే తెలిసింది. ఇప్పుడు వాటిని ఖండిస్తూ తాను మరొక ఉపన్యాసం ఇవ్వవలసిన పనిలేదు. దేశంలో వార్తాపత్రికలు చదివే వారందరూ కూడా వాటిని ఎంతో మెచ్చుకోవచ్చు. పిల్లలకు కాపీ పుస్తకాలకుగాను కొన్ని వాక్యాలను ఏరుకోవచ్చు. కాని ఆ మాటలన్నీ కూడా తన జీవితంలో అర్థవిహీనమై, నిస్తేజంగా, నిస్సారంగా- పనిలేనివాడు నిఘంటువులో నుంచి ఏరి, ఏర్చికూర్చిన పదజాలాలవలె నిష్ప్రయోజనం! అందుకనే ఆ వార్తాపత్రికను తునాతునకలుగా చింపిపారేశాడు—డాక్టర్ గోపాలం.

ఇప్పుడు నిజమైన 'మానవసేవ' ఏమిటో దాని రూపురేఖ ఎలాటివో, ఆచరించవలసిన విధానాలేమిటో డాక్టర్ గోపాలానికి నసాళానికి అంటేట్లుగా వంటబట్టింది తనలో తను సిగ్గుపడుతూ, కుంగిపోతూ మూలనున్న కుర్చీలో కూలబడి సకాలంలో మానవసేవ చేయలేని తన అసమర్థతనుగూర్చి దుఃఖించసాగాడాయన. 



4 బొమ్మలకే ప్రాణాలొస్తే




# బతుకుభయం

టి.వి. శంకరం

ఇంటికి వస్తూనే సీతప్ప ఎడుగులాటి వార్త విన్నాడు—కాదు చదివాడు తలుపు కింది సందునుంచి లోపలికి తోసేశారు ఆఫీసువాళ్ళు రాసిన ఉత్తరం ఉత్తరం కూడా కాదు సర్క్యులర్ లాటిది మీరు పెట్టిన శలవు అసంగతమైనది గనకా మీ శలవువల్ల ఆఫీసు పని చెడిపోయి తీరని నష్టం కలుగుతుంది గనకా ఈ సర్క్యులర్ అందిన వారం రోజులలోగా డ్యూటీలో జాయిన్ అయిపోవడమో జాయిన్ కాలేనందుకు సవ్యమైన కారణాలు నిరూపించుకోవడమో చేస్తే తప్ప మిమ్మల్ని బర్తరఫ్ చేసినట్టు భావించవలసిందీ అని ఆ సర్క్యులర్‌లో ఉంది కింది సంతకం యజమానిది కాదు కొత్త సంతకం ఎప్పుడూ సీతప్ప ఆ సంతకం చూళ్లేదు

ఇన్నాళ్ళకి మళ్ళీ గడపలో అడుగెట్టిన మనిషి ఇల్లు సద్దుకునే పని చూడక ఎదో కాయితం పట్టుకుని కళ్ళు పెద్దవిచేసి చూస్తూండటం గమనించి రావమ్మ ఎవిఎండీ అదీ? అని అడిగింది

అసంభవం ఇందులో ఎదో మోసవుంది, అన్నాడు సీతప్ప హీన స్వరంతో

మోసవా? ఎం మోసం? అన్నది రావమ్మ

నీకు తెలీదూరుకో ఎవరో వెటకారానికి చేసుంటారీ పని

ఎ పని

ఒకసారి మంజూరైన సెలవు రద్దుగావడవనేది నా యిన్నేళ్ళ అనుభవంలోనూ ఎన్నాడూ యెరగ



"మీ రలాగే అంటారు. కాకపోయినా మీరాపాటి తెలుసుకోలేరా యేవ న్నానా ?" అన్నది రావమ్మ అసో మయంగా.

"ఏం భయం లేదు. నువు ధైర్యంగా ఉండు గోవిందరావుగారింటి కెళ్ళి దీని పైనవంతా క్షణంలో తేల్చుకు చక్కా వస్తా," అంటూ సీతప్ప. చొక్కా విప్పేసిన సంగతికూడా మరిచిపోయి బయలు దేరాడు.

"ఆ గోవిందరావు కూడా సెలవెట్టా డన్నారూ ?" అన్నది రావమ్మ.

"అతని సెలవూ రద్దయే వుంటుంది!"

"మన సెలవు రద్దుకాలేదు గదా కొంప దీసి ?"

"ఇంత సేపాయి నేజెబుతున్న దేవిటి? సెలవు రద్దుకావడ వేవిటి? ఏకంగా ఉద్యో గానికే ప్రమాద వొచ్చి కూచుంటేను. ఇదే తేదీన రాశారూ? మరిహానేం? వారం

వేవిటి? రెండు వారాలు కూడా కావొస్తోంది"

"వెళితే వెళ్ళారుగాని. చొక్కా అవీ వేసుకు మరీ వెళ్ళండి" అన్నది రావమ్మ.

"అవునే అన్నట్టు! నా తెలివి తెల్లారిపోనూ..."

గోవిందరావుకు సర్క్యులరు సకాలం లోనే అందింది అతను డ్యూటీలో జాయినవనూ అయాడు.

"మరి ఈ సంతక వెవరిదీ?"

"మన కొత్త బాస్‌ది పెద్దబాస్‌గా రబ్బాయి.''

''అలా చెప్పు! అందుకే నేను సంతకం పోల్చలేక పోయానూ ఆఫీసు వైఖరంతా మారిపోయిందా?"

"పూర్తిగా ఇప్పుడంతా స్పీడ్ ఎక్కడా నిద్రమత్తన్నది లేదు ఏదో వంక పెట్టి ముసలాళ్ళందర్నీ లాగవతల పారేస్తున్నారు"

సీతప్ప కింకో అనుమానం వచ్చింది "నే నింటికి వచ్చాను గనక సర్క్యులర్ చూసుకున్నాగాని, సెలవు ముగిసిందాకా రాకపోతే దాని ఊసే తెలీకపోనే నీకు సర్క్యులర్ సకాలంలో ఎలా గందిం దబ్బా ఎటూ వెళ్ళే లేదా ఏవిటి?" అన్నాడు సీతప్ప

"వెళ్ళ కేం? అయితే ఎడ్ర సిచ్చి మరీ వెళ్లా అదో రూ లేడి చిందిగా? సర్క్యులరందగానే పారిపోయొచ్చా — ప్రళయం సంగతి దేవుడెరుగునని ఎంత ప్రళయమైతే మటుకు ఉద్యోగం కంటే ఎక్కువా?" అన్నాడు గోవిందరావు.

ఇందుకు సీతప్ప ఒప్పుకోలేదు. ప్రళయానికీ ఉద్యోగానికీ సాపత్య వేవిటి? గ్రహాలు-అందులోనున్నూ నవగ్రహాలు-తెచ్చిపెట్టే మహాభయంకరమైనటువంటి ప్రళయ వెక్కడ? ముష్టి, మనుష లిచ్చే ఉద్యోగ వెక్కడ? తనను ఆఫీసు వాళ్ళు ఉద్యోగంలో నుంచి తీసెయ్యడవే గనక జరిగెనా, ప్రళయం రావడవూనున్నూ, యీ ఆఫీసూ, దాని కొత్త బాసూ, పాతబాసూ, వాళ్ళ ఇళ్ళూ, వాకిళ్ళూ, పిల్లా, జెల్లా — సమస్తవూ గంగపాలు కావడవూ నున్నూ తప్ప విడిచి మరో హాటి జరుగుతుందనుకుంటున్నారుగావోసు! ఆ శ్రీరామచంద్రమూర్తి ఇలాటి అన్యాయాల్ని, ఇంత లేసి ద్రోహాల్ని సహించి ఊరుకుంటాడా?

అయితే సీతప్ప యీ మాట లేవీ గోవిందరావుతో అన్లేదు అతనినోట నువుగింజనాను యజమాన్లతో చేఅనెయ్యగల్డు. అప్పుడు వాళ్ళు తగు జాగర్తపడి ప్రళయంనుంచి తప్పించుకుపారిపోగల్రు

పైకి మాత్రం, "ప్రళయవే వొచ్చే మాటుంటే ఇంకా ఈ ఉద్యోగాలూ, ఆఫీసులూ నిలుస్తాయా ఏమిటి? అబ్బో! మళ్ళీ పునః సృష్టి జరగవలిసిందేనూ!" అన్నాడు సీతప్ప.

"పునః సృష్టి మాట దేవుడెరుగు. నేననేదేవిటంటే, జల ప్రళయంలో చస్తే

పది మందితో చావు, పెళ్ళితో సమానం ఉద్యోగంపోయి చచ్చేచావు ఒంటరిచావే' అది చావుతోనే సమానం "

"నీకు చూడగా ప్రళయభయం ఏవీ లేకుండా పోయినట్టుందే?" అన్నాడు సీతప్ప

"ఏవోమరి' చాలామంది ప్రళయం రాదు పొమ్మంటున్నారు చాలామంది అష్టగ్రహకూటం శుభవనికూడా అంటున్నారు మన ఆఫీసు మాత్రం, జలప్రళయ వచ్చేది, అగ్నిప్రళయ వొచ్చేది, చచ్చినట్టు పనిచేసి తీరుతుందిట "

ఈ మాట వినగానే సీతప్ప కింకో భయం పట్టుకుంది జల ప్రళయంలో సర్వనాశనవై పోయే గీత ఉండి ఆఫీసు వాళ్ళు తనని నిజంగా ఉద్యోగంలోంచి తీసేస్తారేవోనని' గోవిందరా వన్నట్టు జలప్రళయం రావడంకంటెకూడానున్నా ఉద్యోగం పోవడవే భయంకరవే(వో' జల ప్రళయం తప్పించుకుని ఏ తిరువణ్ణామలే అయినా పారిపోవచ్చు ఉద్యోగం పోవడమంటూవస్తే అది పారిపోతే తప్పేదికాదే! ఏది దారి ?

"రేపలా ఆఫీసుకొచ్చి సంగతి సందర్భాలన్నీ చెప్పుకుంటాను నన్నొకంతట తీసెయ్యరు, నాకు తెలుసుననుకో ఆఫీసు తోటి పుట్టినవాణ్నికదూ?" అన్నాడు సీతప్ప గోవిందరావుకు ధైర్యంఇస్తూ

"అలాటి వారందరినీ లాగేస్తున్నారండీ, బాబూ! ఆఫీసుకు కొత్తరక్తం కావాలిట' యువకరక్తం!" అన్నాడు గోవిందరావు కొంచెమైనా ధైర్యంతెచ్చుకోకుండా

"కొత్తబాస్ చాలా స్ట్రిక్టాయేం?"

"స్ట్రిక్టేవీలేదు ఆఫీసుకు కోతులసర్కస్ అని ఒక పేరూ? స్లానే జి క్వారీ అని మరో పేరూ, ఓపియం హీపని ఒక పేరూ పెట్టాడు పెద్ద తలకాయ లందరికీ స్లాత్ నంబర్ వన్, స్లాత్ నంబర్ టూ — ఇలా నామకరణాలు చేశాడు ఆ పరిభాష అతనితోబాటు వచ్చిన కుర్రాళ్లకిమాత్రమే తెలుసు వాళ్లు నవ్వుకుంటారు "

"సరే, నే వస్తా' రైలుదిగినబట్ట లింకా విడవనైనాలేదు " అంటూ సీతప్ప యింటికి వచ్చేశాడు ఆ రాత్రి ఆయనకు పీడకల వచ్చింది ఒక రాక్షసి ముందు కుర్రాళ్ళందరినీ బలిఇచ్చి రక్తం గంగాళంలో పోస్తున్నారుట ఆ రాక్షసి తమ ఆఫీసుట

మర్నాడు శుభవార్త తెలియనే తెలిసింది ఆయన ఉద్యోగం పోయింది ఎకౌంటు సెటిలయిపోయింది, డబ్బుతీసుకుని క్షేమానవెళ్ళి లాభాన రమ్మన్నారు

సీతప్ప ఒకంతట అపజయం ఒప్పలేదు కొత్త యజమాని నవ్వుతూ మాట్లాడటం ఆయనకి మరింత బలాన్నిచ్చింది

"నేను సర్క్యులర్ అందగానున్నా డ్యూటీలో జాయినై పోలేదావటానితమరు నన్ను ఉద్యోగంలోనుంచి తీసిపారేశారు

నాకు తెలుసు. తమకు కోపం రావడం కూడాను న్నూ సబు వేతప్ప విడిచి మరోటీ మరోటీకాదు. అయితే నా సంగతికూడా తమరు కొంచెం వినాలి. నేనేవోనున్నూ అవతల నా మనవరాలి బారసాలా నావ కరణవూ శాంతీగట్రావచ్చిపడి వూరెళ్లాను. తీరా వెళ్ళాక అక్కడ కొన్ని వ్యవహారాలూ, చిక్కులూ, పేచీలూ, అవాంతరాలూ వచ్చిపడ్డాయి. అవన్నీ వదలకుండానే తిరిగి వచ్చేశా నేవిటనుకున్నారేవిటోను! నవగ్రహకూటవని భయపడి వెళ్ళినవాణ్ణే అవుతే ఆ బెడదతీరకుండానే తిరిగి వచ్చేద్దునా? ఈ ఒక్క సంగతీ తమరాలోచించి రట్టాయినా నేను మరేవీ కోరను! నవగ్రహకూటానికి జడిసి పారిపోయిన వాళ్ళతో నన్నూ జమకట్టడం సబువు కాదనే నేను తమకి మనవిచేసేది."

కొత్తబాసు నవ్వి "నవగ్రహకూటం మా కెక్కడొచ్చిందయ్యా, బాబూ? ఆఫీసులో చాలామార్పులుచేశాం. కొంతమంది పాతవాళ్ళని పంపేశాం. శలవు పెట్టటానికీ దీనికీ సంబంధం లేదు.



కాకపోయినా జలప్రళయం గురించి ఆఫీ సంతటినీ అదరగొట్టింది మీరేటగదూ? నాతో పదిమందిదాకా చెప్పారు ఈ కాస్త కోసం అబద్ధ వాడతా రెందుకూ?'' అన్నాడు



''మరిహనేం? మీకా అనుమానం ఉండబట్టే నన్ను తీసేస్తావంటున్నారు ఆ అనుమానం రహితమైతేనేగాని మీరు మీ నిర్ణయం మార్చుకోరు అంచేతే నే నింతగా చెబుతూంట," అన్నాడు సీతప్ప

కొత్త బాసు మరింత విరగబడినవ్వి, ''నిన్ను తీసేస్తాననటంలేదయ్యా, బాబూ ఎప్పుడో తీసేశాం దానికీ జలప్రళయానికీ సంబంధం లేదంటినిగా,'' అన్నాడు

''నావిలవ నే చెప్పుకోకూడదు అది మీ నాన్నగారికిబాగాతెలుసు మీ వ్యాపారం ప్రారంభించిన నాటినుంచీ నేనున్నాను పాత లెడ్జెర్లుతీసి చూడండి నా దస్తూరీయే కనిపిస్తుంది నావల్ల ఎప్పుడైనా కించిత్తు పొరబాటేనైనా వచ్చుంటే చెప్పు చ్చు క్కొట్టండి, పడతాను కాని ఇలా అకార ణంగా—"

చిన్న బాస్ అకస్మాత్తుగా సీతప్ప మాటలు వినడమానేసి, టెలిఫోనెత్తి ఏదో నంబరు డయల్ చేస్తూ, వెళ్ళమని సీతప్పకు చేత్తో సంజ్ఞచేశాడు

తనకింత ఘోరమైన అన్యాయంచేసిన చిన్న బాస్ నెత్తిన ఏ పిడుగో పడక పోవడం కూడా ఆ శ్రీరామచంద్రమూర్తి వారి మాయే అయుండా లనుకుంటూ సీతప్ప లేచి ఇవతలకొచ్చాడు ఉద్యోగం పోయిందన్న దడ ఆఫీసువా రిచ్చిన ఆరు నెల్ల జీతంతో కొంచెంగా – బహు కొంచెంగా – ఉపశమించింది

## 2

''ఏమండీ, కోడంబాకం కోయిల దగ్గిర అహోరాత్రాలు మంత్రోచ్చాటన జరుగుతోందిట డబ్బు కడితే మనపేరు చెప్పి సహస్రనామ పూజ చేస్తారుట. అవే విటి చెప్మా. సినిమాలో లాగా గట్టిగా అందరికీ వినిపించేవి ఏవోపెట్టి భూమ్యాకాశాలు మంత్రాలతో నింపేస్తున్నారుట. కలియుగ వైకుంఠ పేట.'' అన్నది రావమ్మ.

''మంత్రోచ్చాటన అహోరాత్రాలు అవిరామంగా జరుగుతోంది గాదా? జరగనీ. అది నిలిచిపోయేట్టుంటే మనం కూడా డబ్బుగట్టి చదివింతాం. ఉత్తినే ఎందుకూ? ఇంకా ప్రళయానికి మూడ్రోజులే ఉంటా! మనం రవణాశ్రమంపోతే మంచిదేవో ననిపిస్తోంది. కాని ఆ నాయుడు ఎల్లుండి ఇంటర్‌వ్యూ ఏర్పాటు చేశాడు. ప్రళయం సిగ్గోసిరి, ఇంటర్‌వ్యూకు ఉండి పోదావాఅంటే ఉద్యోగం ఖాయంగా దొరుకుతుందని రూఢీ లేదాయిరి! ముందునుయ్యీ, వెనగ్గొయ్యీ అయూరుకుంది!'' అన్నాడు సీతప్ప

''మళ్ళీ ఇంకో ఉద్యోగం చూస్తున్నారు గదా? చెప్పరేం?'' అన్నది రావమ్మ పరమానందంతో.

''చెబుతున్నాను గానా? ధైర్యంగా ప్రళయాన్నెదిరించి ఉండిపోవడవా, ఆ రామచంద్రమూర్తివారి మీదే భారంవేసి రవణాశ్రవానికెళ్ళి పోవడవా. ఏదీ తేల్చుకోలేకుండా ఉన్నా.''

''ప్రళయంరాదు, అంతా ఉత్తదేనని చాలామంది' అంటున్నారండీ. మరి మూడ్రోజుల్లో సముద్రం పొంగుతుందీ అంటే ఈ సరికి కాలమేహాలన్నీ కమ్మేసుకోవద్దూ ఆవటాంటున్నది శేషంపిన్ని.''

''అదీ ఒకవిధంగా సబువైన మాటేనూ, సుతరావూ కొట్టి పారేశానికి వీల్లేదు. కాని నిన్నకూడా రవణాశ్రం నుంచి కరపత్రాలొచ్చాయి. బతకదల్చిన వాళ్ళకి ఆఖరు చాన్సు అలాగని. మన మంచికేగదూ బోలెడంతడబ్బు తగలేసి కరపత్రాలేస్తున్నారూ? మరోటీ మరోటీ అయితే తోసిపారేద్దుంగాని ఇటొచ్చి నవగ్రహాలూనూ, అటొచ్చి రవణాశ్రవున్నూ అయింది గదామరి! ఇంకో వారందాటించి ఇంటర్‌వ్యూ పెట్టించవయ్యా, బాబూ, అంటే నాయుడు విన్నాడు కాడు. ఇదంతా కూడా నన్ను ఆ శ్రీరామచంద్రమూర్తివారు పరీక్షించడవేనూ! వీ డెటుమొగ్గుతాడు? ప్రాణం మీదెక్కువతీపా, వీడికి ఉద్యోగం మీదెక్కువమోజా? ఈ సంగతి తేల్చుకుందుకే నాకీపరీక్ష పెట్టాడు! నా దేవుంది? మానవమాత్రుణ్ణి ఆ శ్రీరామచంద్రమూర్తి వారు ఈ క్షణం నన్ను, 'ఒరే, నువు తిన్నగా రవణాశ్రం వెళ్ళిపోయి ప్రాణం దక్కించుకో,' అంటే ఉద్యోగం

పూసెత్తక వెళ్ళిపోతాను.' లేదూ ? 'నీ ప్రాణానికి నా ప్రాణం వడ్డేస్తాను. ఎక్కడికీ వెళ్ళక ఉద్యోగం సంపాదించుకో' అంటే ప్రళయానికి ఏమాత్ర పూనున్నా లక్ష్యపెట్టక ధైర్యంతో ఉండిపోతాను." అన్నాడు సీతప్ప.

కాని తన భక్తుణ్ణి పరీక్షించ దలుచుకున్న శ్రీరామచంద్రమూర్తివారు సీతప్ప ఇచ్చిన రెండు సూచనల్లో ఏ ఒకటీ ఆమోదించక మౌనం వహించాడు. అందుచేత సీతప్ప రావమ్మతోసహా, అష్టగ్రహకూటం ఇంకా ముఃప్ఫయ్యారు గంటలకనగా, రవణా శ్రమం బస్సెక్కేశాడు.

అక్కడవాళ్ళకి ఆటే సౌకర్యాలేవీ కలగలేదు. కాని "ఈ సరికి ట్రిప్లికేను మునిగుంటుంది. ఈ పాటికి మౌంటురోడ్డుండదు. ఈ సరికి స్టూడియోలన్నీ నీటి అడుగున ఉంటాయి," అని సంతృప్తి పడడంతో ఆ పుణ్యదంపతులకు ఏ కష్టాలూ తెలియలేదు. కాని ఈ తృప్తిఅయినా దక్కకుండా వారికి త్వరలోనే జలప్రళయం జరగలేదన్న వార్త తెలిసింది. ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం నిక్షేపంగా వార్తలూ గట్రా ప్రసారం చేస్తూనే ఉంది. వెయ్యి నిలువుల నీటి అడుగున మునిగి ఉంటే ఇది సాధ్యపడునా ?

"ఎంత మోసం! ఎంత వంచన!" అన్నది రావమ్మ.

"అలా అనకు. ఎన్ని యగ్గాలు జరిగాయి! ఎంత వేదపఠనం! ఎంత గ్రహశాంతి! అంతా ఊరికే పోతుందా? జలప్రళయం రాకపోవడాన్ని బట్టే ఈ యెగ్గాలూ, భజన్లూ వట్టినేపోవని తెలిసిపోతోంది," అన్నాడు సీతప్ప.

"అలా అయితే మనవెందుకు పారిపోయొచ్చినట్టూ? హాయిగా పట్నంలోనే ఉండి ఆ ఉద్యోగ ప్రయత్నం చేసుకునే పనిగా?"

భార్య అన్న ఈ మాటకు సీతప్ప నిరుత్తరుడయాడు.

ఇంటికి తిరిగివస్తూనే సీతప్ప నాయుణ్ణి చూడబోయాడు.

"నే నెంత చెప్పినా ఆ రోజుకు ఊళ్లో లేకుండా ఎందుకు పారిపోయావయ్యా, వెర్రిబ్రాహ్మడా? ఆ ఉద్యోగం ఇంకోరికి ఖాయవయింది నీతో బాటు ఊస్టయిన వాడే – మీ నాగభూషణం," అన్నాడు నాయుడు.

సీతప్ప లోపలిపొరల్లో సన్నగా దడ ఆరంభమయింది.

"వెళ్ళానంటే మరి అందర్లానే నేనూ ప్రళయ వొస్తుందావటానుకున్నా గాని రాదని నాకేం తెలుసూ? లోకంవంతా కోడై కూస్తోంటే ఎలా నమ్మకండా వుండడం? అయ్యా. యిది ద్రోహబుద్ధితోచేసిన పనికాదు; ఉద్యోగంపట్ల నిర్లక్ష్యమన్నది మొదలేకాదు; శరీరం వాచ్యవన్నారు గనకనున్నా, నవగ్రహ

కూటం దాటి వెళ్ళిపోయిందాకా తమరు ఎవరినీ వేసుకోరావటానుకునిన్నీ అలా రవణాశ్రమంకేసి వెళ్ళిరావడం జరిగిందని చెబితే నా కేసు రీకన్సిడరు చేస్తారేఁవో?" అన్నాడు.

నాయుడు సీతప్ప కేసి తెల్లబోయి చూస్తూ, "నాగభూషణానికిచ్చేసిన ఉద్యోగం లాగేసుకుని నీకివ్వరా అనా అడుగుతున్నావు?" అన్నాడు.

సీతప్ప దడ హెచ్చిపోయింది.

"అబ్బే. అదేమ్మాట? ఒకరి కీడ్డెంచేరాదు. న్యాయంగా నాకు రావలసినటువంటి ఉద్యోగవేఁవోనున్నా ఆ అబద్ధాలకోరు నాగభూషణానికి అన్యాక్రాంతం అయితేకూడానున్నా అతడి ఉద్యోగం పోవాలని మనం కోరేకూడదు. ఈ రోజుల్లో చేసుకునే ఉద్యోగం పోవడమంటే మాటలా? ఎంత యిది! పగవాళ్ళకూడా జరగ్గూడదంతే! మనవెలా కోరుకోవాలంటే ఆ చాడీకోరు నాగభూషణానికీ ఉద్యోగం రావాలి, నాకూ రావాలి! అలా ఆలోచించాలి మనం."

"సరే, నీ ఆలోచనే సహం ఫలించింది. నాగభూషణానికుద్యోగఁవయింది. ఇక నీ సంగతి చూసుకోమరి," అన్నాడు నాయుడు.

## 3

సత్యం తల్లికి ఉత్తరం రాశాడు.

"నాన్నకు ఉద్యోగం పోయిందని తెలిసింది. శేషూ, వాడి భార్యా ఇక్కడికేదో పని మీద వచ్చారు. ఆయన ఉద్యోగం పోగొట్టుకున్న పద్ధతిచూస్తే ఆయనకు ప్రపంచజ్ఞానం తక్కువని తెలుస్తోంది. ఆయనకు లేకపోవడమేగాక నాకూ, సోమక్కక్కూడా ప్రపంచజ్ఞానం లేకుండా చేశాడు. అందుకే ఆయనంత లౌకికుడు లేడనీ, అంత జ్ఞాని లేడనీ అనుకున్నాం. పాతికేళ్ళు కరుడుగట్టిపోయిన నా బుర్ర ఇప్పుడిప్పుడే కదలబారుతున్నది. లోకాన్ని కొత్తకళ్ళతో చూస్తున్నాను. శేషునుగురించి ఎంత తేలిక భావాలుండేవి నాకు! వాడికున్న తెలివీ, నిబ్బరమూ ఎవరికున్నాయి? బావగారెంత ఓర్పరి. ఎంత తెలివిగలవాడు! అక్క కాస్త తెలివితేటలు ఉపయోగిస్తే ఆయనతో ఎంత సుఖపడి ఉండును! అక్కకి కొంచెం కొంచెమే బోధిస్తున్నాను. అన్నిటికీ అవు నవునంటుందేగాని నా మాటలు అర్థంచేసుకుంటోందనుకోను. నీవు స్వతహాగా నాన్నకంటె హెచ్చు ఆలోచనాపరురాలవనీ, నే చెప్పే విషయాలు కొంతలో కొంత అర్థంచేసుకోగలవనీ అనుకుని నీకీ ఉత్తరం రాస్తున్నాను.

"ఇప్పుడు నేను అక్కదగ్గిరే ఉంటున్నాను. బావగా రుండమన్నారు. ఆయన నాకు ఉద్యోగం ఇప్పిస్తున్నారు. గుడ్డిదాన్ని పిల్లతో సహా వచ్చేమంటే రాన



"దీనికి మా అమ్మ కారణం! చిన్నప్పుడు నాకు గాడిదపాలు పోసిందట."

న్నది. నీ యిష్టం వచ్చినట్టు చావు అని వచ్చేస్తుంటే నర్సు నాతో ఏదో వాదన వేసుకున్నాడు. వినీ వినీ వాణ్ణిగూడ అది రేలాకొట్టి వచ్చేశాను. వాడు వట్టి పిరికి పంద: వాణ్ణి కొట్టినందుకు నాలో కలిగిన ఆనంద మేమని చెప్పను! నా జోలికొచ్చి నప్పుడల్లా తంతాను. అనవసరంగా కలగ జేసుకునయినా వాణ్ణితన్నాలని నాకు మహ తీటగా ఉంది.

"నాన్న చాలా డబ్బుకూడబెట్టాడు — నాకు తెలుసు. ఇంకా ఆయనకు ఉద్యోగ మెందుకు? పట్నంలో నివాస మెందుకు? మన ప్రాంతాలకి వచ్చేసి రామకోటి రాసుకోమను. నా పూచీ ఆయన ఏనాడో వదిలించేసుకున్నాడు. కాని మీరిద్దరూ ఉన్నంతకాలమూ మీకు అన్న వస్త్రాలకు లోటు జరక్కుండా నేను చూడటానికి యత్నిస్తాను.

"గుడ్డిదానికి ఈ నెలా ఖరుదా కా కైమిచ్చాను. ఈ లోపల నా దగ్గిరికి వచ్చె య్యకపోతే ఎవతెనన్నా తెచ్చి పెట్టు కుంటానని చెప్పాను. నిజంగానే పెట్టు కుంటాను..."

ఈ ఉత్తరంచూసి సీతప్ప ఒక్కటే ముక్క అన్నాడు. "నే నమ్మ!"

మనిషికి కనువిప్పు కావటమనేది చాలా చిత్రంగా ఉంటుంది. అది మనిషిలో ఎలా జరిగేదీ చెప్పటం కష్టం. కొందరిలో అది అమిత నింపాదిగా జరుగుతుంది. మనిషి మారు తున్నట్టు పైవాళ్ళకు చచ్చినా తెలీదు. పైకి తేడా కనిపించేసరికి మనిషి పూర్తిగా మారే ఉంటాడు. మరికొందరు మొదటి క్షణంనుంచీ పైకి కనిపించేలా మారతారు. కాని ఆ మార్పు పూర్తి కావటానికి చాలా కాలంపడుతుంది. కొందరు మారేటప్పుడు

చాలా మానసిక బాధలకు లోనవుతారు. కొందరు చాలా ఉత్సాహంతో మారి పోతారు.

సత్యంలో కలిగినమార్పు ఆకస్మిక మైనదీ, ఉత్సాహభరితమైనదీనూ. సోమి దేవిలోకూడా మార్పువచ్చింది ముఖ్యంగా తన తండ్రి ప్రళయానికి బెదిరివచ్చిన పైనమూ, వెళ్ళినపైనమూ, ఉద్యోగం పోగొట్టుకోవడమూ, వియ్యాల వారింట అవమానం పాలుకావడమూ, తమ్ముడి తిరుగుబాటూ, తనభర్త వాణ్ణి ఆదుకోవ డమూ - ఇవన్నీ ఊరికే పోలేదు. కాని పైకి ఆమెలో ఏమార్పూ తెలియరాలేదు. గర్భంలో జరిగే గొడవ కడుపుతోన్న దానికి తెలిసినట్టు, తన మనసులో జరిగే మార్పులవల్ల ఏ బాధలైతే కలిగాయో అవన్నీ ఆమె మౌనంగా భరించింది.

"ఎంతచెడ్డా అది నీభార్య. అందులోనూ పిల్లతల్లి. దాన్ని నువ్వలా విడిచేసి రావడం మంచిది కాదొరే!'' అని తమ్ముణ్ణి సోమి దేవి మందలించింది. కాని తమ్ముడిలో ఆకస్మికంగా కలిగిన ధైర్య సాహసాలకు ఆమె లో లోపల ఆశ్చర్యపడక పోలేదు, మెచ్చుకోకనూ పోలేదు. అలా మెచ్చు కోడం తప్పేమోనని కూడా భయపడింది.

అయితేనేం? చలి దేశంలో పేరుకున్న నదులు కరగడం ఆరంభిస్తే బయలుదేరేక ఇంక మరి ఆగదుట. అంతకంతకీ అది వేగం హెచ్చుతుంది. ఎన్నేళ్ళుగానో సోమిదేవి కడుపులో పెట్టుకుని ఉన్న అక్కసంతా అగ్ని పర్వతం పగిలి శిలా ద్రవం వచ్చినట్టుగా పైకి తన్నేసింది. సత్తెం అత్తవారు తనని మొదట్లో ఎలా ఉపయోగించుకుని తరవాత ఎలాచూశారు? వాళ్ళతో వియ్యమే ఎంతో గొప్ప అను కున్న దానికి మామూలు లాంఛనాలేనా జరిపారుకారు — వీళ్ళ బ్రహ్మ సమాజం బొగ్గులవా! అల్లుణ్ణి ఇంటికుక్కను చేసేసు కుని అల్లుడివైపు వాళ్ళందరినీ గడ్డిపరకల కంటె హీనంగా చూశారుగద! ఎంత హీనంగాబతికే వాళ్ళైనా రాకరాక యింటి కొచ్చిన వియ్యాలవారి నిలాగా చూస్తారు?

ఒక్కొక్కటీ తలపుకొచ్చేకొద్దీ సోమిదేవి అగ్గయిపోయింది. అందుచేత ఒకనాడు సత్యం అత్తగారు అల్లుడిమీద సొద్దేసి పోవడానికొచ్చేసరికి, సోమిదేవి పూనకం వచ్చిన దానిలాగా రెచ్చిపోయి కడిగేసి వదిలి పెట్టింది పడవలసిన మాటలన్నీ పడి ఆవిడ అలా వెళ్ళిందోలేదో సోమిదేవికి అత్యాశ్చర్యం కలిగించే సంఘటన ఒకటి జరిగింది. భద్రాచలం మెట్లుదిగి, బయటికి వెళ్ళిపోకుండా లోపలికొచ్చాడు.

ఆయన తనకేసి తేరిపార జూస్తున్నట్టు గ్రహించి సోమిదేవి కొయ్యబారిపోయి తలవొంచుకు నిలబడింది.

''మరేంలేదు. ఇవాళ రాత్రికి అందరమూ కలిసి భోంచేస్తే బాగుంటుం దనిపించింది. వంట — నువుచేస్తావా, లేక — " అన్నాడు భద్రాచలం.



"ఎలాగ ఇప్పటికి మూడుసార్లు చెప్పా కాఫీ ఇంకా కాగలేదని"

'నేనే చేస్తాను _ అంతకంటేనా ?'' అన్నది సోమిదేవి తల యెత్తకుండానే

ఆ రాత్రి భద్రాచలమూ, పార్వతీ, సత్యమూ చిత్తుగాడూ, సోమిదేవీ ఒకే సారి భోజనానికి కూర్చున్నారు సోమిదేవి వంటను పార్వతి మెచ్చుకున్నది ఆ తరువాత భద్రాచలం కూడా మెచ్చుకున్నాడు అది సోమిదేవీ జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖించవలసిన రోజు

4

"ఏవి శేవిటీ? శివన్నయ్యే? ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు! ఎప్పుడు రావడం? వదినె కులాసానేగదా? అలాముసక్కాడ కంట బడితేచాలు నువు గ్యాపకం వస్తావుగదా! కాళ్ళు గడుక్కో! ఊం!'' అని సీతప్ప అన్నగార్ని చూసి పరవళ్ళు తొక్కాడు

శివన్నయ్య వాలుకుర్చీలో కూచుంటూ "నేనూ మీ వదినే తిరపతి దేవుణ్ణి చూసుకుని, కాళహస్తిమీదుగా వచ్చాం తిరపతి కొస్తూ తోవలో రాజమండ్రిలో ఒకరోజు నిలిచాం అంధా కులాసాగానే వున్నారు అన్నట్టు సత్తెం సికిందరాబాదు వెళుతున్నాట్ట గదూ? వాడికక్కడేం వుద్యోగం వయిందన్నారూ?' అని అడిగాడు

''నాకా విషయవే తెలీదే ఎంత న్యాయం! ఎంతన్యాయం!'' అన్నాడు సీతప్ప

శివుడు ఆశ్చర్యంతో 'అన్యాయ

వేవిట్రా ? నిక్షేపంటాంటి వుద్యోగంట, నెలకు ఏ మూడొందలలో ఇస్తారుట కూడా గదూ ?'' అన్నాడు

''ఇచ్చినప్పటి మాట గద ' ముందు వాణ్ణి దూరం తన్ని తగిలేస్తున్నారూ ! దరిదాపుల్లో ఎక్కడా లేకుండా చేసేస్తే తరవాత వాడిపాట్లు వాడే పడతాడు '' అన్నాడు సీతప్ప విచారంగా

''ఎవరు తన్ని తగిలేస్తున్నా రంటావు ? ఈ ఉద్యోగం భద్రాచల విప్పి చ్చాట్ట '''

''ఆపాటి తెలుసుకోలేవా ? మహా రాజులా అత్తారింట మనుగుడుపులు గుడుస్తూ ఇంతకాలవూ అత్తారింట కాల క్షేపంచేసిన వెధవ అజ్ఞానంకొద్దీ అత్తవారి తోటి తగాదాపడి, పనిమానుకుని, పెళ్ళాన్నీ బిడ్డనీ వొదిలేసి భద్రాచలం యింట దాగుతున్నాడు అత్తగారు గనక భరించారు గాని భద్రాచలవెందుకు భరి స్తాడూ ? అందులోనూ పెళ్ళాన్ని వొది లేసినవాణ్ణి ఆ పెళ్ళాం వింటికి ఎదురింటోనే పెట్టుకు భరించడం యెంత నామోషీ ఏ విటి కథ ! అదలావుంచు కందకిలేని దురద బచ్చలికాన్నట్టు, సోవి దేవి నే- యేలనివాడికి దాని తమ్ముడిమీద మంవ కారంవా ? ఎవరు నమ్ముతారు 'ఈ అబ్బి మనింటోదేనికి ? పీడ ! పెందలాడే సాగ నంపండి ''' అని భద్రాచలానికీ ఆ- అమ్మాయి చెప్పంటుంది ఇంకేంవుందీ, రైళ్ళు మారితేగాని చేరనిచోటికి తోసే శాడు ఇందులో ఇంకో తిరుగుడు కూడా గమనించావో లేదో, సత్తెం సంసారం శాశ్వితంగానునూ్నా విచ్ఛిత్తి అవడానికేవోనునూ్నా యిది పసందైన పథకం ఎంచాతంటావా ? ఎదరింట పెళ్ళాం వుందన్నాక సత్యం మనసు మారొచ్చు సూదంటురాయే తప్పవిడిచి మరొకటి కాదుగదా ' అందులోనునూ్నా ఎంతచెడ్డా, కుర్రాళ్ళాయిరి సత్తాన్ని సికిందరాబాదు తోలేస్తే వాడక్కడ ఏ బూబునోమరిగి మరి పెళ్ళాం బిడ్డలమాటే తలవడు ఇంతాలోచనా చేసి వాళ్ళాపని జేస్తే, నువు ధర్మరాజులాటి నిష్కల్మ షుడివి గావటంచేత నునూ్నా మరోలా అనుకుని లోలోపల ఆ భద్రాచలాన్ని మెచ్చుకు నుంటావు ''

సీతప్ప పూర్తి చేసిందాకా అన్నగా రాయన్ని రెప్పార్చకుండా చూసి, ''ఏళ్ళతోబాటు నీ తెలివి అమోఘంగా ప్రజ్వలిస్తోందొరే ' అయితే నువు చెప్పిం దానికి ఒకటి రెండు చిన్న తభిశీ ళ్ళున్నాయి భద్రాచలవింట్లో ఇప్పుడంతా యేకవయారు అదివరకులా రెండు పొయిల్లేవు అంతా కలిసే భోజనాలు'' అన్నాడు

ఈ వార్తలోగల దారుణాన్ని సీతప్ప ఇట్టే పసికట్టేశాడు

''అంతపనీ జరిగిందీ ? ఇంక సోవి దేవికి ప్రంవాదవేనూ ' ఇదిమంచి కొచ్చిం దనుకుంటున్నావు గావోసు '

పోరబాటు! సోవిదేవికి చిత్తుగాడికీ ఏరాత్రో అన్నంలో ఇంత విషంగలిపి పెట్టేస్తారు ఆ-అమ్మాయికి పిల్లా పీచూ లేదు వెంటనే వాళ్ళిద్దర్నీ ఏదో వంక పెట్టి తోలుకురావాలి లేకపోతే వాళ్ళ ప్రాణాలు నిలువునా తీసేస్తారు'' అన్నాడు సీతప్ప, శైలింజన్లా అయిపోతూ

''తీసుకరాక తప్పుతుందా ఏఁవిటి? సోవికి రెండునెల్లు నిండాయన్నారు ఏ ఆరో నెలలోనో, ఏడో నెలలోనో తీసుకొద్దూగాని!'' అన్నాడు శివుడు

అన్న చెప్పింది ఒక్క ముక్కా అర్థం కాలేదు ఈ వార్త చుట్టూ చాలా సేపు ఆలోచనల గూడు అల్లుతేనేగాని ఆ వార్త లోని దారుణం బోధపడదు! నిప్పులాంటి మనిషి! తపస్విని! కాలుజారడం అసంభవం! మొగుడికి తెలిస్తే యింకేవేనా వుందా? అటు భర్తకీ, ఇటు పుట్టింటి వారికీ ఎంత అప్రతిష్ట! ఎంత!

''ఇంకో విషయం కూడా చెప్పడం మరిచానొరే మీ కోడలుకూడా సికింద్రాబా దెళ్ళిపోతోంది, పిల్లతో సహా! అన్ని ఏర్పాట్లూ అయిపోయాయి'' అంటూ శివుడు వాలు కుర్చీలోంచి లేచాడు

''అప్పుడే వెళ్ళిపోతున్నావా?'' అన్నాడు సీతప్ప ఆ సద్బ్రాహ్మడికి అంతకంటే అనడానికేవీ తోచలేదు

''సత్యానికీ, సోవిదేవికీ ఒకచిన్న సలహా యిచ్చి మరీ వచ్చా! అదే నీక్కూడా యిద్దావనుకుంటున్నా మంచితనానికేనా కోరలూ గోళ్ళూ ఉండాలిరా! పొట్లకాయ మంచి తనవూ, సొరకాయ మంచి తనవూ కత్తిపీటలని చెడ్డవి చేస్తాయిరా! ఆ సీతాపతీ, వాడి కొడుకూ, మీ భద్రాచలం — వీళ్ళంతా చెడ్డవాళ్ళంటావా? అందర్లాంటి వాళ్ళే కాని వాళ్ళని రాక్షసుల్లా చేసిందెవరు? కాస్త ఆలోచించుకో! వస్తా!'' అంటూ శివుడు కాలుసాగించాడు

★

విశ్వనాథ సత్యనారాయణగారి 'కిన్నెరసానిపాట'ల్లో నాయిక కిన్నెరసాని. భద్రాద్రి దగ్గరవున్న కొండచుట్టూ తిరిగి ప్రవహించే వాగు పేరు కిన్నెరసాని. ఆ కొండనూ, ఆ నదినీ, చూచిన తర్వాత విశ్వనాథ వారి మనస్సులో కలిగిన భావవీచీ ప్రచారమే ఒక కథాకల్పనగా రూపు దిద్దుకుంది; ఒక మధుర వీణా ఝంకృతిగా రవళించింది వారి రసహృద్దృష్టికి నది నాయికగా భాసించింది కొండ నాయక భావం వహించింది. పెనుగొండ యందలి 'బృందావనా'న్ని చూచి శుక్తిమతీ కోలాహల పాత్రల్ని భట్టుమూర్తి సృష్టించినట్లే, విశ్వనాథ వారు ఈ కిన్నెరసాని చుట్టూ కథ కల్పించి వుంటారని పుట్టపర్తి నారాయణాచార్యులుగా రభిప్రాయపడి



నారు[1] "ఈ కథ జనప్రచారంలో లేదు. కిన్నెరసాని వాగు భద్రాద్రి పోయే త్రోవలోవుంది. ఆ వాగు చూసి ఆ మధురనామం నిరంతరం మననం చేసుకోవటంవల్ల కలిపించు కొన్న కథ యిది" అంటూ విశ్వనాథ వారు చెప్పుకున్నారు.[2]

కిన్నెరసాని కావ్యానికి పూర్వకథ యిది. కిన్నెర మహా పతివ్రత. 'కొడుకు సౌఖ్యమెరుగని అత్త' కిన్నెర మీద నింద లారోపించగా, కిన్నెర హృదయం శోకంచేత ప్రళయ సముద్రమై పోతుంది. భర్త ఏమీ అన లేని, ఏమీ చేయలేని స్థితిలో వుంటాడు. కిన్నెర ఆవేశంతో అడవులవెంట పరు గెత్తుతుంది. భర్త వలదని ఆవిడను కౌగిలించుకున్నాడు. "ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరై వాగై ప్రవ హించింది. అతడు శోకించి శోకించి శిల అయినాడు" విశ్వనాథవారు కావ్య ప్రారంభంలో వ్రాసుకున్న మాటలివి. ఈ కల్పన పూర్వరంగానికి చెందినదే. కావ్యమంతా ఈ సంఘటన తర్వాత జరిగిన వృత్తాంత కథనమే.

ఈ కథా కల్పనమీద ఏ యితర ప్రభావంలేదని విశ్వనాథ వా రన్నారు. దీనికి మూలాలని చెప్పలేను గాని పోలికలున్న కథలు ఒకటి రెండు న్నవి. దీంట్లోవున్న చమత్కారం మంతా నదిని నాయికగా భావించ డంలోనూ నాయిక నదిగా మారి పోవడంలోనూ వుంది వాల్మీకి రామాయణంలో ఒక చిన్న కథవుంది. విశ్వామిత్రుని చెల్లెలు కౌశికి. విశ్వా మిత్రుడు సిద్ధాశ్రమంలో తపస్సు చేసుకుంటూ వుండగా అన్నగారిమీది ప్రేమతో కౌశికి ఆ ఆశ్రమం వద్దనే నదీ రూపంలో ప్రవహింపసాగింది ఇంతకు మించి సంస్కృతాంధ్ర సాహిత్యాల్లో వనిత వాగుగా మారిన జాడలు కను పించవు. 'శుక్తిమతీ కోలాహల' ఘట్టం వసుచరిత్రలో వున్నట్టు ప్రసి ద్ధమే. ఈ కథలో శుక్తిమతీనది నర్మద మొదలైన అన్యనదులతో కలిసి స్త్రీ రూపంలో బ్రహ్మసభకు పోయి వస్తుంటే కోలాహల పర్వతు డడ్డగించి ఆమెతో బలవంతంగా రమిస్తాడు. ఈ ఘట్టాన్ని వర్ణించడంలో నదీ పరంగా, నాయికాపరంగా శ్లేషించి రామరాజ భూషణుడు చమత్కారం చూపాడు. నదికి నాయికాభావం ఇవ్వడంలోతప్ప దీనికి కిన్నెరసానికి పోలిక లేదు.

ఇంగ్లీషు కవిత్వంలో షెల్లి వ్రాసిన

1. 'మహాకవి విశ్వనాథ' (వ్యాసం): భారతి: చిత్రభాను మాఘం.

2. జయంతి: 2వ సంచిక.

'ఎరితూజా' (Arethusa) అనే గేయం లోని కథకూ కిన్నెరసానికీ కొన్ని రేఖా మాత్రమైన పోలికలున్నవి. ఎరితూజా ఒక చిన్న నది పేరు. మబ్బుల నుండి, కొండ శిఖరాలనుండి దిగి నృత్యంచేస్తూ మెలికలు తిరుగుతూ అది పడమటి దిక్కుగా ప్రవహిస్తుంది.

She lept down the rocks
with her rainbow locks
Her steps paved with green
The downward ravine
with slopes to the western gleems.

ఈ పదాలు కిన్నెరసాని నడకలను స్ఫురింపజేస్తాయి.[3]

"And gliding and springing
She went, ever singing,
In murmurs as soft as sleep ,
The earth seemed to love her
And heaven smiled above her,
As she lingered towards the deep"

ఈ చరణాల్లో కిన్నెర నృత్య సంగీతాల విషయం వాసనా ప్రాయంగా ఉంది ఆ నదిని పృథివ్యాకాశాలు ప్రేమింపనాగ నడడంలో ఆమె సౌశీల్యం ప్రతిపాదింపబడింది. కిన్నెర శీలం గూడా ఇలాంటిదే. ఎరితూజాను ఆల్ఫియస్ (Alpheus) అనే నదీ దేవత (పురుషుడు) చెరపట్టడానికి వెంబడిస్తాడు.. ఎరితూజా ఆర్తనాదం చేస్తూ సముద్రంవైపు ప్రవహిస్తుంది.

'Oh save me oh guide me,
And bid the deep hide me'

ఈ ఆక్రందనంవిని సముద్రం జాలి పడుతుంది.

'The loud ocean heard
To its blue depth stirred',

దీంట్లో కథ అడ్డం తిరిగింది. సముద్రుడు కిన్నెరసానిలో ప్రతి నాయకుడు. కిన్నెర తలదాచుకున్నది గోదావరి అనే మరొక నదిలో. ఈ కథలో అలాకాక తోటి నది ఎరితూజా అనే నదీ కన్యను కామించి వెన్నాడుతుంది. సముద్రం ఈ కథలో నదీ కన్యకు ఆశ్రయమిస్తుంది. అయితే రెండు నదులూ, ఒక సముద్రం, ఈ రెండు కథల్లో వుండడం గమనింప దగిన అంశం. 'ఎరితూజా' గేయంలో గూడా నదికి స్త్రీత్వం ఇవ్వబడిందన

3. కిన్నెరసాని పాటల్లోని 'కిన్నెరసాని నడకలు' చదువుతూ వుంటే రామాయణంలో భగీరథునివెంట పరుగెత్తే గంగ నడకలు రేఖామాత్రంగా స్ఫురించకపోవు.

"మున్ను భగీరథ భూపతి
వెన్నువెంట పరుగెత్తిన
ఆ న్నాకధునీ వైఖరి
నున్నది నీ చన్నత్రోవ."

అనే చరణాల్లో విశ్వనాథవారు ఈ విషయాన్నే ధ్వనింపజేశారు.

డానికి ఏరితూజా మొరపెట్టుకున్నప్పటి 'for he grasps me now by the hair' అనే పంక్తి చక్కని నిదర్శనం.

'The loud ocean heard
To its blue depth stirred'

అనే చరణాలు అచ్చంగా కిన్నెరసాని పాటల్లోని 'గోదావరిదేవి గుండె గూడులు కదలి' అనే భావనతో సరిపోతున్నవి.

తెలుగులో అబ్బూరి రామకృష్ణారావుగారు రచించిన 'నదీ సుందరి' అనే ఏకాంతరూపకం లోని వస్తువుకూ కిన్నెరసాని పాటల్లోని ఇతివృత్తానికీ కొంచెం పోలిక కనిపిస్తుంది. నదీసుందరి 1931 లో - కిన్నెరసాని పాటలకంటె ముందుగానే ప్రచురింపబడింది. ఈ రూపకంలోని నాయిక కావేరి. ఈవిడ నదీకన్య. దైవవశాత్తున కులపతి ఆశ్రమంలో కన్యగా పదునెనిమిదియేండ్ల వరకు పెరిగింది. ఆ తరుణప్రాయంలో ఆమెకూ, అగస్త్యుడనే మునికుమారునికీ ప్రేమానుబంధం ఏర్పడింది. ఇరువురూ కలిసి ఒకనాటి వెన్నెలరేయి సహ్యాద్రి పర్వతసీమలో విహరించడానికి వెళ్ళుతారు. ఒకానొక రమణీయ నికుంజంలో కాలు మోపగనే కావేరి మనుష్య రూపాన్ని విడిచి నదిగా మారిపోతుంది ఆ ప్రవాహంనుంచి 'జీవనపతీ! ప్రతి సంవత్సరం ఈ రోజున నీకోసం వేచివుంటాను' అనే మాటలు వినిపిస్తాయి. వన కన్యకలు, ఉద్యాన దేవతలు, లతాకన్యలు చేరి 'కావేరి దేవేరియై వచ్చె నేడు' అని పాట పాడుతారు. ఈ రూపకంలో కన్య నదిగా మారిపోవడం, ఆమె కొక ప్రియుడుండడం అనే రెండంశాల ప్రభావం కిన్నెరసాని పాటల్లోని వస్తువుపై ప్రబలంగా పనిచేసింది. ఈ రకంగా 'ఏరితూజా'తో 'నదీసుందరి'తో కొన్ని పోలికలున్నా విశ్వనాథవారి 'కిన్నెరసాని' ఆంధ్రకవితా ప్రపంచంలో అమృతసృష్టియని చెప్పక తప్పదు.

కిన్నెరసాని పాటల్లోని కథాకల్పనం మానవజీవనపరంగా సాగింది. కిన్నెర మొదట మానవాంగన. తర్వాత వాగుగా మారింది. కథాకల్పనంలో పూర్వ భాగంలోని విషయాలు ఉత్తర భాగానికి ప్రాతిపదికలైనవి. భర్త శిలగామారిన తర్వాత కిన్నెర అతనిచుట్టూ తిరగడంలో ఆవిడ పాతివ్రత్యం సూచింపబడింది. కిన్నెర నృత్య సంగీతాలకు ఆవిడ ఉద్విగ్న హృదయమే మూలం. ఆవిడ అత్త చేసిన నింద భరించ లేదు. కడలి పొంగును చూచి కళవెళ ఉడికిపోయింది. విశ్వనాథవారు'కల్పన'లో అత్తను 'కొడుకు సుఖమెరుగని'దని అన్నారు. దీంట్లో కిన్నెరకూ ఆమె

భర్తకూ నడుమవున్న అనురాగమయ దాంపత్యం ధ్వనిస్తుంది

అత్త పెట్టిన ఆరడి కోర్వలేక కిన్నెర అడవులపాలైనది ఆమె 'రసాకృతి' కాబట్టి ధునీవైఖరి వహించిందని, భర్త శిలాత్ముడు కాబట్టి శిలయైపోయాడని విశ్వనాథవారు సూచించారు ఈ యిద్దరి దుఃఖం ఒక్కటే అయినా, వారివారి వాసనలను పురస్కరించుకుని పరిణామాలు భిన్నంగా గోచరించినవి స్త్రీ ప్రకృతి స్వరూపిణి కావుననే ఆవిడ స్వభావం అతి మధురం కిన్నెరసాని నదిగా మారిపోవడంలో ఈ రహస్యమేవుంది పురుషుడు స్త్రీ కంటె ధీరుడుం గభీరుడూ కాబట్టి నదీత్వం వహించలేపోయాడు, స్తబ్దుడుగా వుండిపోయాడు అంటే శిలీభూతుడైనాడు దుఃఖభారంవల్ల అతని గుండె జడీభవించడం దీంట్లోని రహస్యం కిన్నెర భర్త రాయిగామారిన ఘట్టం చదువుతుంటే భవభూతి పలికిన

'అనిర్భిన్న గభీరత్వా దంతర్గూఢ ఘనవ్యధః
పుటపాక ప్రతీకాశో రామస్యకరుణో రసః'

అనే శ్లోకం స్ఫురిస్తుందని పుట్టపర్తి వారన్నారు నిజమే

కిన్నెరసాని పాటల్లో ప్రధానపాత్ర కిన్నెర. ఆవిడ పతిశీలతను అడుగడుగునా రసాభిముఖంగా చిత్రించడమే విశ్వనాథవారి లక్ష్యం వారు కిన్నెరను తెలుగువారింటి పడుచుగా ఉపలక్షించి ఈ పాటల్ని రచించారు తెలుగు నాటవుండే భార్యాభర్తల నడిమి లోక వృత్తాన్ని, దాని పరిణామాన్ని వెల్లడించారు 'కిన్నెర పుట్టుక' లో విప్రలంభం నాయక పరంగావుంది 'ఓహో కిన్నెరసానీ' అని ఆవిడ వెంట పరుగెత్తి, ఆమె నదిగా మారిన పిమ్మట భర్త విలపించిన ఘట్టమిది 'కిన్నెర నడకల'లో విప్రలంభం నాయికాపరంగా సాగింది 'కడలి పొంగులో సముద్రుని రతిభావం నిక్షిప్తమైంది కిన్నెర దుఃఖంలో ప్రత్యాశారహితమైన కరుణస్థితి నిరూపింపబడింది 'గోదావరీ సంగమం'లో నాయికా శీలరక్షణకు ఆశ్రయప్రాప్తి కలిగింది 'కిన్నెర వైభవం' లో నాయికా ప్రాశస్త్యం, ఆవిడ నిర్వాణ యత్నం సూచింపబడినవి కిన్నెర నృత్యం, కిన్నెర సంగీతం అనే ఘట్టాలు శబ్దనాద రమ్యతకు పరాకాష్ఠలు వీటిల్లో ప్రధానంగా కిన్నెర దంపతుల పూర్వ (సంయోగ) శృంగారం ధ్వనిస్తుంది కిన్నెరను అత్తవారింటికి సాగనంపడం, ఆవిడ 'తల్లి దగ్గరనుండి తన మెడకు పలుపోసి లాగబడ్డట్టి లేగ' లాగా కదలి

పోవటం మున్నగు సందర్భాలు పూర్వ స్థితిని చర్వణంచేసి చూపుతున్నవి.

కిన్నెర తన భర్తను విడిచిపోయే టప్పుడు, భర్త ఆవిడ జడను పట్టుకుని, చేలాంచలం లాగి, పాదానతి చేసినట్లు సూచింపబడింది. ఇవన్నీ కుపిత నాయికకు నాయకుడు చేసే లాలనరీతులు. ఆ చరణాలివి

"పరుగెత్తెదు నీ వేణీ
బంధము పూనితి చేతను
కరమున వేణికి బదులుగ
కాల్వగట్టె నీటి పొరలు
ఎడమచేత నీ కొంగును
ఒడిచి పట్టుకొంటి చెలీ!
తడిచేతను కొంగుతోడ
తడబడితిని ప్రియురాలా.
నీ పాదమ్ములు మోచిన
నా ఫాలమ్మున చెమ్మట
ఈ పగిదిని వాగులైన
నీపై ప్రేమము చూపెడి."

ఈ చరణాల్లో కుపితయైన కిన్నెరను పతి లాలించడంతోపాటు గొప్ప భావనాశక్తి ప్రదర్శితమైంది. ఈ వర్ణన ఒక రకంగా కిన్నెర మానవత్వంనుండి నదీత్వంవైపు పర్యవసిస్తున్న సంధికాలావస్థను సూచిస్తుంది అతడామె వేణిని గ్రహించాడు, వేణినీరై పోయింది. కొంగును పట్టుకున్నాడు; కొంగు నీరై పోయింది. పాదాలమీద ప్రణమిల్లాడు, పాదాలు నీరై పోయినవి అతని ఫాలంలోని చెమట ఈ విషయాన్నే సూచిస్తుంది. తలనుండి పాదాలదాకా క్రమపద్ధతిలో చేసిన వర్ణనమిది. ఆమె పైనుంచి క్రిందిదాకా వరుసగా జలజలా ప్రవహించిపోయిన దశాంత్రిత యానికి విశ్వనాథవారి వర్ణనం దృశ్య చిత్రణం లాంటిది.

కావ్యాంతంలో విశ్వనాథవారిలా వ్రాశారు:

'తెలుగుదైవమ్ము భద్రాద్రిపై నెలకొన్న
రామయ్య, అతని దర్శనము చేసే
త్రోవ కాచింది కిన్నెరా'

ఈ చరణాల్లో కిన్నెర భద్రాద్రి రాముని చరణ సన్నిధిలో లీనమై బ్రహ్మసాయుజ్యం పొందినదనే భావం నిగూఢంగా చెప్పబడింది. ఈ రకంగా కిన్నెరను పతిశీలతకు, రసాత్మతకు ప్రతీకయైన శృంగార నాయికగా చిత్రించారు విశ్వనాథవారు. తెలుగులోని శృంగార నాయికల్లో కిన్నెరకు విశిష్టమైన స్థానముంది.



# సినిమా క్విజ్



పై రెండుబొమ్మలూ రెండు సినిమాల పేర్లు తెలియజేస్తాయి ఏమిటవి?

(జవాబులు 96 వ పేజీలో)

# సరాగ రాగం

ఇసుకపల్లి దక్షిణామూర్తి

పార్వతి కోసం ఎదురుచూస్తూ, గోపాలం మంచంమీద కూర్చున్నాడు కాళ్లు పైకి పెట్టుకున్నాడు. నేల తేమగా ఉంది. వంటింట్లో అంతా భోజనాలు చేసిన తర్వాత గచ్చు కడిగారు తడి ఆరలేదు. సాయంత్రం అనుకోకుండా చుట్టాలొచ్చారు వాళ్ళందరినీ హాలులో పడుకోబెట్టి, కొందరిని వరండాలో పడుకోమని, తను మెల్లిగా వంటింట్లోకి చేరక తప్పలేదు. అరికాళ్లు తుండుగుడ్డతో తుడుచుకుని మల్లెపువ్వులాంటి పక్క మాసిపోకుండా బాసిపెట్టు వేసుకుని కూర్చున్నాడు. కిందా, పక్కనా, పైనా ఎలికలు జంటలు జంటలుగా తిరుగుతున్నాయి. వాటిని పట్టుకోవటానికి పెట్టిన బోనులో పిల్లి పిల్ల పడటం, వెంటనే చూసి తప్పించడం వలన ఆ హత్యాదోషం కొద్దిలో తప్పి గుడికట్టించాల్సిన అవసరం లేకుండా పోయింది. ఆ నాటినుంచి ఎలికల్ని పట్టుకునే భారం ఆ పిల్లిపిల్లకు వప్పచెప్పేసి ఊరుకున్నారు.

గోపాలం మెడవంచి మధ్య హాలులోకి తొంగి చూశాడు. పార్వతి అక్కడ బాసిపెట్టు వేసుక్కూర్చొని కొత్తగా వచ్చిన చుట్టాలువేసే ప్రశ్నలన్నిటికీ ఓపిగ్గా సమాధానాలు చెపుతోంది అక్కడ కూర్చున్న వాళ్ళందరికీ పెళ్ళయి ఏళ్ళు గడిచి పోయినాయి అందులో కొంత మందికి వాళ్ళ పిల్లల పెళ్ళిళ్ళు చెయ్యాల్సిన వయసుగూడా వచ్చింది. గోపాలానికి పెళ్ళయి ఏడాది దాటలేదు. కబుర్లు చెప్పేవాళ్ళకి బుద్ధి ఉన్నదా, లేదా? అని తీర్పు ఇచ్చే అధికారం తనకు లేకపోయినా, పార్వతి ఏదో సాకు చెప్పి అక్కడనుంచి లేచివస్తే బాగుండునని గోపాలానికుంది. ఏమని చెపుతాడు? ఒక్క నిమిషం ఆలోచనలో పడ్డాడు మెల్లిగా దుప్పటిలాక్కుని పడుకున్నాడు. కూర్చుని ఉంటే తనని గూడా కబుర్లు చెప్పటానికి రమ్మంటారేమోనని భయం. కళ్ళుమూసుకుంటే నిద్రపడుతుందేమోనని భయం. కళ్ళు తెరుచుకుని పైకిచూస్తే ఎలికలు అటక మీద తిరుగుతూ అతనివంకచూసి చెవులు రిక్కిస్తున్నాయి తళుక్కున ఆలోచన వకటి మెరపులా మబ్బులు పట్టిన తన మనస్సుమీద మెరిసింది.

'కాసిని మంచినీళ్ళిచ్చి పో..' అన్నాడు

లేచి కూర్చుని. దుప్పటి పక్కకు తోసేశాడు.

గోపాలం తల్లి వర్ధనమ్మ ఆ మాట వింది

'వాడేదో అడుగుతున్నాడు చూడమ్మా...' అని ''వచ్చేపొద్దా... పోయేపొద్దా ... పోయి పడుకోండి ... కబుర్లకేమొచ్చె ... తెల్లవారింతర్వాత చెప్పుకుందురుగాని...''అంది పార్వతి 'ఏమిటి...పిలిచారు...''అని అడిగింది.

'ఆ...ఏంలేదు. దొడ్లోకిపోయి తెల్లవారిందేమో చూసివస్తావని పిలిచాను.' అన్నాడు గోపాలం పార్వతికి నవ్వు వచ్చింది.

'మీరే చూడకపోయారూ,...! దొడ్లోకి ఒంటరిగా వెళ్ళాలంటే భయంవేసిందా..' అంది పార్వతి, మెల్లిగా తలుపు దగ్గరగా వేసి గడియవేసి వచ్చింది.

'ఎంతసేపు అక్కడ కబుర్లు ,అంతూ పొంతూ అక్కర్లేదా...' అన్నాడు గోపాలం విసుక్కుంటున్నట్టు

'అయితే వాళ్ళు అడిగినదానికి సమాధానం చెప్పకుండా వచ్చెయ్యమంటారా.. నే వెళ్ళి జోలపాటపాడితేగాని మా ఆయన



నిద్రపోరూ..., నన్ను వదిలెయ్యండి... అని వాళ్ళని అడగమంటారా..' పార్వతి అలమారలోని తమలపాకులు, వక్క-పొడిడబ్బా తీసుకు వచ్చింది.

'అట్లా ఏం చెప్పకర్లా...ప్రతిదానికీ చెప్పే తీరుంటుంది..' గోపాలం కొద్దిగా వక్కపొడి అందుకున్నాడు.

"ప్రతిదానికీ నన్ను అని మీపిరికితనం దాచుకోవడంగాని ఇంకోటికాదు...మీకు మీ అమ్మగారిని చూస్తే హడలు. 'కబుర్లు చాల్లెండి...ఎంతసేపు పడుకోకుండా?' అని అడిగేధైర్యం మీకుండాలి గాని ఆడదాన్ని నేను ఏమన్నా మాట్లాడటం బాగుంటుందా..." పార్వతి తమలపాకులకి సున్నంరాసి ఈనెలు తీసింది.

'ఇట్లా ఇయ్యి...'

'నోరు తెరవండి...'

'మెల్లిగా మాట్లాడు ... ఎవరన్నా వింటారు...'

'నోరు ముయ్యండి అంటే తప్పుగాని నోరు తెరవండి అంటే అందులో తప్పేం లేదు. ఎవరన్నా విన్నా ఫరవాలేదు...'

తమలపాకు చిలకల్ని నములుతూ కిటికీలోనుంచి బయటకు చూశాడు. కాచిన వెన్నెలంతా నేల తాగేస్తోంది. కొబ్బరి ఆకులు వెన్నెట్లో మాగుతున్నాయి. అందంగా మెరుస్తున్నాయి. దొడ్డంతా మల్లెపూలు పరిచినట్లుంది. పార్వతి తల్లో పూల చెండు వాసనలు విరజిమ్ముతోంది.

'నీ తల్లో పూలు బాగున్నాయి...'

'కథలు వ్రాస్తారుగా ... ఊరికే బాగున్నాయి అనకపోతే...నల్లటి కొండమీద మంచు శిఖరంలా తలమీద పూల చెండు ఉందనో...మనసున మల్లెల మాల లూగెనే, శిరసున మల్లెలుఊయలూగెనే.. అనో కొంచెం కవిత్వం చెప్పరాదూ...' పార్వతి చిరునవ్వు నవ్వితే పళ్ల వరుసలు కొంచెంగా కనపడి తళుక్కుమన్నాయి.

'నీక్కూడా కవిత్వం అల్లటం వస్తోందే...'

'మీ కవిత్వమే నాకూ కొంచెం అంటిందిలెండి .. మీ పిరికితనమే అంటలా...'

'నాకు పిరికితనమని ఎవరుచెప్పారు..'

'ఇప్పటి సంగతి ఎవరు చెప్పాలి. కనపడుతునే ఉందిగా ... చిన్నప్పటి నుంచి ఇల్లాగే ఉండేవారని మీ అమ్మగారే చెప్పారు నాకు ..'

'ఏదో తమాషా కని ఉంటుంది....'

'తమాషాలేదు ... గిమాషాలేదు ... ఎవరన్నా ఇంటికివస్తే పారిపోయి గదిలో కూర్చునేవారుట ... ఏమన్నా చేతికిస్తే తినకుండా చేతిలోనే పెట్టుకునేవారుట... మీ అమ్మగారు వచ్చి తినమనిఅంటే అప్పుడు తినేవారుట...అంతాచెప్పారు.. వాళ్ళెవరింటికో భోజనానికివెళ్ళి .అమ్మా ఈగారప్పచ్చి తిననుటే ... ఈ చింతకాయ పచ్చడి తిననుటే ... అని అన్నీ అడిగి తినేవారుటగా ... మీరు దాస్తేదాగుతుందేమిటి ... ఆ భయమే ఇప్పటికీ ఉంది. మీ అమ్మగారిని చూస్తేహడలు,

మీ నాన్నగారిని చూస్తే హడలు...పక్క భాగంలో వాళ్ళనిచూస్తే హడలు ... హడలు, హడలు...'

పార్వతి పాలు తీసుకు వచ్చింది. 'తాగండి...' అంది.

'పోనీ మీ అమ్మగారిని అడిగి తాగుతారా...' అంది. గోపాలానికి చిరుకోపం వచ్చింది. పాలగ్లాసు అందుకున్నాడు. గడ గడా తాగేశాడు.

'మీరు కధలు వ్రాస్తారుగదా...నాకు గూడా వ్రాయటం నేర్పరాదుటండీ...' పార్వతి విషయం మార్చేసింది. 'చక్కగా పత్రికల్లో పేరూ పడుతుంది, నాలుగు డబ్బులూవస్తాయి...'

'వ్రాయి...ఎవరొద్దన్నారు...'

'వ్రాయటం చేతకావద్దేమిటీ...దాని కిటుకులు చెపుతే నేర్చుకుందామని కదూ. ఇన్ని కధలు వ్రాశారు...నా చేత కధ వ్రాయిస్తే...అదీ గొప్ప...'

గోపాలం కోపం పోయింది. మనస్సు తేలికయినట్లయింది. తనకు విలువ హెచ్చినట్టు తోచింది. తనపెళ్ళి కాక మునుపుగూడా అనేకమంది స్నేహితులు తనే కధలు వ్రాసే గోపాలం అని తెలుసుకుని మర్యాద ఇవ్వటం బాగాగుర్తు. నిత్య అనుభవంగా ఉండేది. స్నేహితులే కాకుండా కొంతమంది స్నేహితురాళ్ళు గూడా దొరికారు. అంతా మెచ్చుకునేవారు — కాని పార్వతి మాత్రం మొదటినుంచీ ఏదోరకంగా ఎగతాళి చేస్తూనే వచ్చింది గాని తనని మెచ్చుకున్న సందర్భాలు కనిపించలేదు. ఎంతమంది ఊళ్ళోవాళ్ళు మెచ్చుకున్నా పెళ్ళాం హర్షించకపోవడం కొంచెం లోపంగానే ఉంటోంది. మనస్సు చివుక్కుమంటుంది. పార్వతివచ్చిన కొత్తలో తను వ్రాసినకధలను గురించిన అనేక వివరాలు చెప్పుకవచ్చాడు. 'అట్లాగా... అట్లాగా...' అంటూ ఊరుకుందిగాని. 'అబ్బా...మీ కథలంటేనాకు చాలా ఇష్టమండీ...మీ కధ వక్కటిగూడా వదిలిపెట్టలేదు...కొన్ని కథలు రెండు మూడు సార్లు చదివాను...' అటుందేమోనని ఆశించాడు.అట్లాంటి ప్రవర్తన కనిపించక పోవడం ఆశాభంగంగానే ఉంది, అందరి మనస్తత్వాలూ నిశితంగా పరిశీలించగలను అనుకున్న గోపాలం పార్వతి విషయం మాత్రం తెలుసుకోలేకపోయాడు.

'ఆడవాళ్ళ కళ్ళు చేపల్లాగా ఉంటాయని అంటా రెందుకనండీ...' అని అడిగింది పార్వతి.

'చేపల్లాగా ఉంటాయి కాబట్టే...' అన్నాడు గోపాలం తడుముకోకుండా.

'మరి చెవులు చేపతోకల్లాగా ... బుగ్గలు చేపనడుములాగా...చింపిరిజుట్టు విసిరిన వలలాగా ఉంటాయి గదా ... ఆ విషయం ఎవరూ వ్రాయరేమండీ...' అంది పార్వతి. గోపాలం గతుక్కుమన్నాడు.

'నా డైరీ తీశావా...'అన్నాడు.

'మీ డైరీ సంగతి నా కేం తెలుసు... పొద్దున వక ముష్టి అమ్మాయి వస్తే నా కట్లా కనబడింది......అందుకని అడిగాను...' పార్వతి నవ్వు దాచుకోలేక పోతోంది

'అయితే ఇకనుంచీ డైరీ పెట్టెలో పెట్టి తాళం వెయ్యాలన్న మాట...'

'ఏం నేను చూడగూడదా...?'

'డైరీలు చూడగూడదు...'

'నాకు తెలియని రహస్య మంటూ మీ దగ్గర ఉండగూడదు...'

'అదే అనుకుంటున్నాను...'

'మీరేమైనా అనండి......రహస్య మంటూ మనదగ్గిర ఎనికిరాదు... పెట్టెలో పెట్టండి..భోషాణంలోపెట్టండి.. మీరు రహస్యమని అనుకున్నచోట నేనే ఉంటాను...' పార్వతి నవ్వుతోంది

'మెల్లిగా......హాలులో వాళ్ళు వింటారు...'

'తప్పేమిటండీ...ప్రతిదానికీ భయ మేనా ... మొగుడూ, పెళ్ళాం అన్న తర్వాత మాట్లాడుకోకుండా, నవ్వుకో కుండా ఉంటారా .. అంత హడలు అయితే ఎట్లాగండీ...'

'దీంట్లో హడలేమిటి ... ఏరగబడి వెర్రివాళ్ళ నవ్వుతారు...'

'నాకు వెర్రి, పిచ్చి అని ఎందుకు అంటారు ?...మీకు మి అమ్మ గా రు అంటే భయం అని వప్పుకోండి... నేను నోరు మూసుకుంటాను ...' అంది పార్వతి. మంచం మీద పక్కనే కూర్చుంది. గోపాలం మీదకు వరిగింది.

'ఏమిటి; వప్పుకుంటారా...' అంది గోపాలం కళ్ళల్లోకి చిలిపిగా చూస్తూ.

'ఇక్కడ ఎవరికీ భయం లేదు... అంతా నువ్వు కల్పించింది తప్పితే...'

'అయితే పందెం కడతారా... చెప్పండి...'

'ఏమిటి పందెం...'

'మీ అమ్మగారంటే మీకు భయం అని నేను...భయం కాదని మీరు...'

'అనవసరంగా గొడవ చెయ్యకు... ఎదకొం డవస్తోంది...'

'అట్లా అంటేకాదు .పందెం...మీరు ఓడిపోతే ... నాకు షిఫాను చీరె కొని పెట్టాలి...నేనే ఓడిపోతే కాశ్మీరు సిల్కు చీరె కొనిపెడితే సరిపోతుంది..సరేనా..'

గోపాలం నవ్వుతున్నాడు.

'ఏమయితే ఏమయింది...నీకు చీరె కొనిపెట్టడం తప్పదుగా...' అన్నాడు.

'ఇంతకీ పందెం ఏమిటి...'

'పందెం ఏమీలేదు...బాగా వెన్నెల కాస్తోంది కదండి...కాసేపు డాబామీదకు పోయి కబుర్లు చెప్పుకొని వద్దాం. మీకు ధైర్యం ఉంటే, మీ అమ్మగారంటే భయం లేకపోతే...మీ అమ్మగారిని అడగండి. అడిగి వెళదాం...'

'ఇప్పుడు వాళ్ళందరినీ లేపటం ఎందుకు...దొడ్డి దారివెంబడి పోదాం..'

'మాట తిప్పుతా రెందుకు? అడగటానికిభయమేనా...అమ్మగారంటే నాకు భయం అని వప్పుకోండి...ఇటేపోదాం.. ఇంతచిన్న విషయానికి గూడా హడలు.'

'అడగటాని కేం భయం కాదు... అనవసరంగా వాళ్ళ నిద్ర చెడగొట్టట మెందుకని గాని...'

'అదికాదండీ..అప్పుడొకసారి మనం రాత్రిపూట రోడ్డుమీదకు షికారుగా వచ్చాము...ఎటు వెళ్ళామో ఏమిటో అని వాళ్ళు భయపడ్డారుట ... నాతో అన్నారు ... వక్కసారి అడిగిపోతే సరిపోతుంది...'

'అనవసరంగా నిద్రలేపటం ఎందుకా అని - దొడ్లోనుంచిపోతే సరిపోలా ..'

'మళ్ళీ మీరు ... అదేమాట...రాజా లాగా సింహద్వారం లోనుంచిపోక ... దొడ్డి గుమ్మంలోనుంచి ఎందుకండీ...' అంది పార్వతి. గోపాలం తటపటా యించాడు. వక క్షణం ఆలోచించాడు. 'సరేపద...' అన్నాడు. మధ్య తలుపు తీశాడు. తలుపు చప్పుడికి తల్లి వర్ధనమ్మ ఉలిక్కిపడి లేచింది

'అబ్బాయీ...లేచావుటరా..' అంది, కళ్లు బలవంతానా తెరిచింది

'కాసేపు మేడమీద కూర్చుని వస్తాము...' అన్నాడు గోపాలం ధైర్యంగా.

'అట్లాగేకాని ...డాబామీద కొబ్బరి మట్టలు...తుక్కు వున్నాయి...కొంచెం దూరంగా కూర్చోండి...బయట చల్లగా ఉంది...ఎక్కువసేపు ఉండకండి...' అంది వర్ధనమ్మ. గోపాలం, పార్వతీ మెల్లిగా బయటకు వచ్చారు. వెన్నెట్లో దొడ్డి అంతా మునిగిపోయింది. మామిడి చెట్టు పక్కగా మెట్లున్నాయి. చుట్టుపక్కల ఇళ్ళలో వాళ్ళంతా గాఢ నిద్రలో ఉన్నారు. మెట్లదగ్గరకు రాగానే పార్వతి భుజంమీద చెయ్యివేశాడు గోపాలం. పార్వతి అతన్ని అంటిపెట్టుకుని మెట్లు ఎక్కటం మొదలు పెట్టింది ఇద్దరూ కలిసి ఒకళ్ళుగా డాబా ఎక్కారు.

'అయితే షిఫానుచీరె కొనుక్కురావ టానికి రేపు పోదామంటారా...' అంది పార్వతి

'షిఫానుచీరె గూడాను..మాఅమ్మంటే నాకు పెద్ద భయమన్నావే...నిద్ర లేపటం ఎందుకని కాస్త ఆలోచించాగాని...' అన్నాడు గోపాలం.

'ఓడిపోయి ఇంకా మాటలు మెలిక వేస్తారెందుకు ..' కట్టుకున్న భార్యతో మేడమీద కాసేపు కబుర్లు చెప్పుకోవా లన్నా మీకు మీ అమ్మగారి పర్మిషన్ కావాల్సివచ్చె ..దీన్ని హడలు కాకపోతే ఇంకేం పేరుతో పిలుస్తారు...?' ఎకపకా నవ్వుతూ గోపాలాన్ని లతలాగా అల్లు కుంది పార్వతి



ఇంట్లోనుంచి సత్యం వీధిలోకొచ్చాడు.

వెంటనే తలుపులు దభేలుమని మూసుకున్నాయి. అతను ఒకసారి వెను దిరిగి చూసి, నవ్వుకున్నాడు.

సత్యం నడుస్తున్నాడు.

అంతకుముందు ఇంటిలో జరిగిన సంభాషణలు అతని చెవుల్లో గింగురు మంటూనే వున్నాయి.

"నేను చెప్పింది అర్ధమయిందా సత్యం?"

"అర్ధమయింది అన్నయ్యా!"

"అయినా నువ్వు రాను రాను పూర్తిగా చెడిపోతున్నావు."

"చెడిపోయింది నేనేకదా!"

"ఇదుగో చెబుతున్నాను. నువ్వు ఆయింటికి వెళ్ళడం మానుకోవాలి. లేదంటావా నాయింట్లో అడుగు పెట్టకు. అంతే! అష్టకష్టాలుపడి నిన్ను చదివించాను ఏంలాభం? కొంచెమయినా కృతజ్ఞతలేదు నీకు. అడిగేవాళ్లు లేరని నీ యిష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తున్నావ్; బుద్ధిగా వుండమంటే మొండిగా మాట్లాడుతావు."

"నువ్వు నన్ను కట్టుబాట్లో ఉంచడం సాధ్యం కాదన్నయ్యా! నాయిష్టమొచ్చినట్లు చేసుకోవడానికి నాకు స్వతంత్రముంది."

"అవునులే, భోగంవాళ్లింటికి పోవడానికి కూడా నీకు స్వతంత్రముంది."

"ఎలాగైనా అనుకోవచ్చు."

"అందరూ నీగురించి ఏమనుకుంటున్నారో తెలుసా?"

"తెలుసు"

"తెలిసికూడా ఇలా ప్రవర్తిస్తున్నావన్నమాట?"

సత్యం మాట్లాడలేదు. ఊరికే వాదించి ప్రయోజనం లేదనుకుని ఇంట్లో నుంచి బయటపడ్డాడు.

సత్యం రోడ్డుమీద మెల్లగా నడుస్తున్నాడు.

"అందరూ నీగురించి ఏమనుకుంటున్నారో తెలుసా?"

సత్యంకు ఈమాట చెవుల్లో గింగురు మంటూనే వుంది.

రోడ్డుప్రక్కన నిలబడి తనవైపే చూస్తూ ఎవరో అనుకుంటున్న మాటలు అతనికి వినిపించాయి.

"అదిగో, వెళుతున్నాడు చూడండి. వాడికి ఎంత గర్వమనుకున్నారు?"

"అలాగా"

"బంగారంలాంటి అన్నను చంపుకు తింటున్నాడు వెధవ. ఈ వీధి చివరన పార్వతమ్మ ఇల్లు లేదూ – అక్కడికి వెళుతున్నాడిప్పుడు."

"వెళితే ఏంలెండి! పార్వతమ్మ ముసలిదయిందిగా? మునుపున్న వైభవం ఇప్పుడు లేదు."

" కూతురుందిగా? అందుకే."

" అదికూడా అలాంటిదేనంటారా? "

" ఎక్కడికిపోతాయిలెండి బుద్ధులు, తల్లిలానే కూతురూనూ "

సత్యం మెల్లగా నడుస్తూనే వాళ్లను దాటి ముందుకు వెళ్లిపోయాడు. ఆకాశంలో నల్లని మేఘాలు భారంగా కదులుతున్నయ్.

రోడ్డుప్రక్కన ప్లేగ్రౌండులో ఆడుకుంటున్న విద్యార్థుల ఆట పూర్తయింది కబుర్లు ప్రారంభమయినయ్

" అందరూ నీగురించి ఏమనుకుంటున్నారో తెలుసా? "

" తెలుసు" అనుకున్నాడు మనసులోనే సత్యం

విద్యార్థులు మాట్లాడుకుంటున్న మాటలు అతనికి వినిపించినయ్.

" అదిగో అలా వెళుతున్నాడే హి వస్ మై ఫ్రెండ్ "

" అలాగా "

" అతనిప్పుడు ఎక్కడికి వెళుతున్నాడో తెలుసా? యు నో? "

" నాకు తెలుసండీ...మీకంటే బాగా తెలుసు."

" మీరుండండీ. అతడు చెప్పనీ ... చెప్పరా శంకరం? " —

" షికారెళుతున్నాడు. "

" అదే నీకు తెలీదనేది...వీధి చివరిన ఇల్లు లేదూ? "

" ఉంది "

" అక్కడికి. 'కమల' అని భోగందాని కూతురు ఒకామె వుంది. అక్కడికి వెళుతున్నాడు మహానుభావుడు..."

" ఐ సీ! వాట్, హి టూ యిన్ లవ్? "

" అతనంటే ఆమెకు చాలా ఇష్టం."

" అయితే అతడ్ని 'సినిక్' అని పిలుస్తారుకదా? "

" సినిక్ అయితే మాత్రం రొమాన్స్ ఉండకూడదంటారా? "

" అతనికుంటే, వాళ్లో? "

" సరిపోయింది...ఏం! ఆమె మహా పతివ్రత అనుకున్నావా? కావాలంటే నువ్వూ ఒక ఛాన్సు చూడు "

" ఛీ ఛీ!! అవన్నీ మనకెందుకండీ...? "

" అలా చెప్పండి... హి యీజ్ డేంజరస్ టు ది సొసైటీ. "

" కాని చూడండి.. ఆమె చాలా బ్యూటిఫుల్‌గా వుంటుంది "

" మీరు చూశారా ఆమెను? "

" అవునండీ, చూశాను ఆమెకు చాలా గర్వమండీ! "

" ఆమె మిమ్మల్ని ఏమైనా అందా ఏమిటి? "

" అబ్బే! "

సత్యంకు నవ్వొచ్చింది వాడికి చెప్పు దెబ్బలు పడటం తనముందే కదా జరి



"మీ నాయన నీకు ఇంటిపనులు బాగా చాతనవునని ప్రకటిస్తే నేను నమ్మి చేసుకున్నాను. ఇదేనా నీ ఏంట!"

గింది. అప్పుడేగా కమలకూ, తనకూ పరిచయమయింది?

సత్యం నడుస్తున్నాడు. మళ్లీ యిళ్లొచ్చాయి.

"ఇప్పటి యువకులు చెడిపోతున్నారు" అన్నాడొక ముసలాయన

"అవునులెండి." అన్నాడు మరో వృద్ధుడు.

సత్యం వాళ్లనూ దాటిపోయాడు

* * *

"సత్యంగారూ! నేను మిమ్మల్ని ప్రేమించాను."

"యు సెంటిమెంటల్ స్టఫ్"

"నాకు ఇంగ్లీషు రాదు"

"నాకు 'ప్రేమ' అనే పదానికి అర్థం తెలీదు కమలా! నన్ను ఎవరూ ప్రేమించరు. నేనుకూడా ఎవరినీ ప్రేమించను"

"ఆవేశంతో మాట్లాడుతున్నారు మీరు"

"నాన్సెన్స్"

"అట్లయితే మీరిక్కడికి రావడంలోగల ఉద్దేశ్యం ఏమిటి?"

"ఏమిటి? ఏమిటి? ఏమిటి?"

"ఇదేమి సత్రమనుకున్నారా?"

"అట్లాని ఊళ్లోవాళ్లంతా చెప్పుకుంటున్నారు."

— కమల కళ్లు చింతనిప్పులయ్యాయి.

" మీరంత తేలికగా మాట్లాడకండి."

" నేనెప్పుడూ అంతే ''

'' ఊళ్లోవాళ్లు చెప్పుకునే మాటలు మీరు నమ్ముతారా? ''

'' నేనెందుకు నమ్ముతాను. ''

" మరి..."

'' ఊళ్లోవాళ్లందరూ అలా అనుకుంటున్నారు అని చెప్పాను అంతే! ఆవేళ నన్ను పిలిచావుకదూ – వాడికి చెప్పుదెబ్బలు పడ్డరోజు ... ఎందుకు పిలిచినట్లు? ''

" మీరు మంచివాళ్లలా కనిపించారు. ఇంటిదాకా ఒంటరిగా రావడానికి భయమేసింది. అందుకని పిలిచాను ''

'' నేను నీకు అపరిచితుణ్ని. నేను మంచివాణ్నని ఎలా అనుకున్నావు? ''

'' మీరు అపరిచితులు కారు నాకు "

'' అట్లయితే పరిచయం ఎక్కడైంది? ''

ఆమెనుంచి జవాబురాలేదు.

— ఎప్పుడో ఒకరోజు ప్రేమతో మాట్లాడిన ఆమె మళ్లీ ఆసంగతే ఎత్తలేదు. అయితే తనకే ఆసంగతి మనసులో పీకుతోంది.

రోడ్డుమీద నడుస్తూ ఆలోచిస్తున్నాడు సత్యం.

కమల అప్పట్నుంచీ చాలా ముభావంగా నడచుకుంటున్నది. ఎందుకో? ఇది మొదటిసారిగా సత్యం హృదయంలో ప్రవేశించిన పురుగు. అబ్బ! మనుషులు ఎంత స్వార్థపరులు? తాము కోరింది లభించినప్పుడు దాన్ని ద్వేషించే స్వభావం కలవారు. కమలకూడా అంతేనేమో! ఇదేమిటి తన హృదయంలో ఆరాటం? ఆమెకు ఇవాళ చెప్పేస్తాను.– " నేను చాలాదూరం వెళ్లిపోతున్నాను. నువ్వు సుఖంగావుండు. " అని.

సత్యం ఆయింటి గుమ్మందగ్గరకొచ్చి నిలబడ్డాడు.

తలుపు సగం తెరచివుంది. సన్నగా దీపం వెలుగుతోంది లోపల్నుంచి ఏవో మాటలు...మధ్య మధ్యన ఏడుపు ...వేరొకధ్వని వినిపిస్తున్నాయి. సత్యం అక్కడే నిలబడిపోయాడు.

'' నువ్వుండమ్మా ... ఏదో ఒకటి చెబుతుంటావు ... ఆయన ఎటువంటివారైనా అవనీ ... మూడురోజులనుండీ ఆయన రానేలేదు ... ఆయన కొంచెం మొరటుతనం అంతే! కాని మంచివారు ...లేనిపోనివన్నీ చెప్పొద్దు నువ్వు. ."

" అదిసరే కమలా! ఆయనగురించి అందరూ ఏమేమో..."

" అందరూ నీగురించి కూడా అనుకుంటున్నారు. నన్నుకూడా అంటున్నారు. వాటినంతగా మనసులో పెట్టుకుంటే అవుతుందా? "

" అయితే ఆయన యింకోసారి ఇక్కడికి రావాలికదా! '' అంతలో




తలుపు 'కిర్' మంది. తల్లీ కూతుళ్లిద్దరూ వెనుదిరిగి చూశారు.

"కమలా!" సత్యం పిలిచాడు.

తల్లి లోపలికి వెళ్లిపోయింది.

''మూడు రోజుల నుంచీ రాలేదు. అందుకని...''

''ఇక్కడ మీకోసం ఎవరూ ఎదురు చూస్తూ కూర్చోలేదు."

''ఇక మా అన్నయ్య యింటి ఋణం తీరిపోయింది. మంచిదేగా?"

''ఎందుకు?''

"ఇక్కడే ఉండవచ్చు."

"ఇక్కడే ఉండటానికి ఇదేమి పత్రమా? మాదేమో ఈఊరు కాదాయె."

"నేనూ అంతే"

"మీరు మగవాళ్లు."

"నేను యిల్లు విడిచి వచ్చేశాను కమలా!"

— కమల ముఖం పైకెత్తింది.

"నేను మీయింటికి రావడం మొదలెట్టినప్పటినుంచీ, ఈ ఊళ్లో వాళ్లకు నేను లోకువైపోయాను."

— కమల కళ్లు అశ్రుపూరితాలయినవి.

"ఎవరెవర్నో...ఆఖరికి నిన్నూ.. నొప్పించాను."

కమల ముఖం క్రిందకు దించుకుంది

"నేను 'సినిక్' నట డేంజరస్టు ది సొసైటీ నట ఇంకా ఏమేమో నట."

— కమల మౌనంగా వింటోంది.

"ఈరోజు ఈఊరు విడిచి చాలా దూరం వెళ్లిపోదామని బయలుదేరాను... నీకు చెప్పిపోదామని వచ్చాను"

— కమల శరీరం వణికింది, పెదవులు కంపించాయి

"నేను ఎవరినీ ప్రేమించలేదు... ఎవరినుండీ ప్రేమను ఆశించలేదు కమలా! అందుకే నేను 'సినిక్'. ఎవరినీ లక్ష్యపెట్టలేదు"

— కమల గోడకానుకుంది

"ప్రేమ ఎవరి జీవితానికైనా అవసరమని నాకనిపించనేలేదు ఎన్నడూ... కాని..."

"అయితే ఈరోజు..." ఏమిటో ఆశ, ఏమిటో కోరిక అతని మాటలలో వ్యక్తమయింది

"ఈ రోజు ... ఆఁ! ... ఇప్పుడిప్పుడు అది చాలా అవసరమనిపిస్తోంది... నేను ఒక విధంగా ఎండలో తిరిగి తిరిగి అలసిపోయి వచ్చినవాణ్ని కమలా ! ... నీడలో సేదతీర్చుకోవాలి"

"ఊఁ...పోనీలే!... కోరుకున్నదంతా లభిస్తుందా?"

"మీరు ఎవరిని ప్రేమించారు?" అన్ని ఆశలనూ కళ్లల్లో ఇముడ్చుకుని అతనివైపు సూటిగా చూస్తూ ప్రశ్నించింది.

"నిన్ను" మెల్లగా చెప్పాడు సత్యం.

అంతవరకు బిగబట్టిన ఏడ్పు కట్టలు త్రెంచుకుని వచ్చింది, కమలకు. ★

## సినిమా క్విజ్ - జవాబులు

*1 చిరంజీవులు 2. జీవితం*

# భరతుని మువ్వ

గంగా నదీ తీరంలో తీర్థరాజమైన హృషీకేశం ధర్మశాల ఆవరణలో ఉన్న ఒక పెద్ద గదిలో మేము విడిది చేశాం నేనూ, మా మేనమామ కొడుకు పులిన్ బాబూ, ఆతని పదేళ్ళ కొడుకు

మూలం

స్వర్గీయ పరశురామ్

అనువాదం

కు. జానకిరామ్ పట్నాయక్

పల్టూ, నౌకరు టహల్ రామ్—మా బృందం. అన్నట్టు మేమే కాకుండా మాతో మరో నాలుగు జీవాలున్నాయ్ అవి పల్టూ పెంపుడు ఎలకలు! తెల్లగా, బొద్దుగా, ముద్దుగా ఉంటవి ఆ ఎలకలు! పులిన్‌బాబు యింటి దగ్గరనే కొడుకును ఆటంక పర్చాడు ఆ ఎలకల్ని తీసుకు రావద్దని' కాని—పల్టూ మాత్రం "ఉఁహుఁ.. వీటిని ఇంట్లో ఉంచేస్తే ఎలా? నేను తిరిగి వచ్చేసరికి ఉంటాయా? మన పెంపుడు పిల్లులు ఆరున్నూ ఫలహారం చేసీవూ? కాగా — వీటికి టిక్కెట్లు కొనాలా ఏమిటి?" అని వెంట తెచ్చుకున్నాడు రాత్రుల్లో అవి పంజరం లాంటి చిన్న దేవదారు పెట్టెలో ఉంటూం టాయ్! పగట్లో—పల్టూ కోటుజేబుల్లోనూ, చేతుల్లోనూ, భుజాల మీదా విహరిస్తుంటాయ్।

ఆ రోజు ఉదయమంతా మేము నగరంలో షైర్లుకొట్టుకొచ్చాం పదకొండయేసరికి బస చేరుకున్నాం. ఆత్మారాముడు 'ఆకలి—ఆకలి' అని మారాం పెట్టనారంభించాడు తేనీరుసరంజామా అంతా మాతో ఉందికాని వంటావార్పులకు ఏమీతెచ్చుకోలేదు' బజారే శరణ్యమైంది టహల్‌రామ్ బజారుకు వెళ్ళి



ఒక బుట్టలో తినుబండారాలు తెచ్చాడు. పిడకల్ని గుర్తుకు తెచ్చే గోధుమ రొట్టెలూ, శనగలూ, గుమ్మడిముక్కలూ కలిపిన జిగురుకూరా, తాండ్ర బెత్తు ల్లాంటి దబ్బాపాల కోవాబిళ్ళలూ ఆ బుట్ట నుంచి బయట కొచ్చాయ్' అప్పటికే స్నానాదికాలు ముగించుకొని సిద్ధంగా ఉన్నాం' ఆ తెచ్చిన ఆహారాన్ని మర్రి ఆకు విస్తళ్లలో టహల్‌రామ్ వడ్డించాడు కూచుని భోజనానికి ఉపక్రమించే సరికి బయటనుంచి "జయ్ ..మహాశంభో '" అన్నమాట వినవచ్చింది ఎవరో ఏమిటో అని నేను లేచి వరండాలోకి వచ్చాను వాకిట్లో ముసలి సాధుబావా ఒకడు నిల్చుని ఉన్నాడు

అతని రంగు ఒకప్పుడు తెల్లగా ఉండే దేమోకాని ప్రస్తుతంమాత్రం తామ్ర వర్ణంగా ఉంది సన్నగా, పొడవుగా ఉన్నాడు తలమీద చిన్న చిన్న జడలు (సహజ సిద్ధమైనవే గాని మర్రిపాలతో అంటించుకొన్నవి కావు) చెదురు మదురుగా ఉన్నగడ్డమూ, మీసమూ ఉన్నాయ్' ఆ గడ్డం మాత్రం నాభి వరకూ వేలాడుతున్నది దిగువ భాగం చిక్కగా ఉన్నది చివర వెంట్రుకల్ని పెద్దముడిగా కట్టాడు ఆ ముడిని జన్మలో ఏనాడూ విప్పి సంస్కరించినట్టు కనిపించలేదు బాగా మాసిన కాషాయాం బరం మ్మోలకు లుంగీలా కట్టుకొన్నాడు భుజం మీదుగా దళసరి కంబళి వేలాడు తున్నది. శరీరమంతా అంగుళం మందాన మురికిపట్టి ఉంది. మెడలో చిక్కని లావుపాటి యజ్ఞోపవీతమూ, చేతిలో లొత్తలూ సొట్టలూ పడినచెంబూ ఉన్నవి సామాన్య సాధువుల దగ్గర ఉండే యితర సామగ్రి — అంటే — రుద్రాక్షమాలలూ, విభూతీ, గంజాయి చిలుమూ, నిప్పుపట్టు కొనే చిమటా, దండమూ, కమండలమూ— ఇత్యాదులు లేవు

"ఏంకావాలి బాబాజీకి" అని ప్రశ్నిం చాను

బాబాజీ జవాబివ్వకుండా సరాసరి గదిలో జొరబడ్డాడు నా క్యాంప్ కాట్ మీద కాళ్ళు బారచాపుకొని కూచున్నాడు టహల్‌రామ్ చాలా కాలంనుంచీ బంగాళీ వాళ్ళతో కలిసి మెలిసి ఉన్నాడేమో కాస్త నాస్తికత్వం పట్టించుకున్నాడు అందు వల్ల బాబాజీ అసభ్యత్వాన్ని చూసి "ఏయ్' ఏఁ విటాచొరవ ' లే' లే' మంచం దిగు '" అని గద్దించాడు అదివిని బాబాజీ అచ్చమైన రాష్ట్రభాషలో నోటికివచ్చిన కూతలు పుంఖాను పుంఖంగా కురిపించాడు పులిన్ బాబు ముఖం కందగడ్డలా చేసుకొని ఒక్క ఉదుటునలేచి ఆ సాధు బాబాను అర్ధచంద్ర ప్రయోగంతో మన్నింప చూశాడు కాని— మధ్యలో నేను కల్పించుకొని "ఆఁ ఆఁ. .శాంతించవోయ్' బాబాజీతో కాస్త మాటామంతీ కానివ్వు" అని వారించాను

ప్రముఖ తత్త్వవేత్త ప్రమోదుచటర్జీ మహాశయుడు సాధువుల విషయంలో అనేకానేక సంగతులు ఉల్లేఖించి ఉన్నాడు యోగులూ, అవధూతలూ, వామాచారులూ, తాంత్రికులూ, అఘోర పంథులూ – మొదలైనవారి చరిత్రలు ఆకళింపు చేసుకున్నాడు ఆతని రచనల సారాంశం ఏమిటంటే . ఆత్మరక్షణార్థం పశువులకు కొమ్ములూ, తుమ్మ, గచ్చ, బలుసు యిత్యాదులైన చెట్లకు ముండ్లూ, పిల్లులకు వాడిగోళ్లూ, కుక్కలకు పదునైన పళ్లూ ఉన్నట్లు ఈ సాధుబాబాలకు తిట్లూ, శాపాలూ, మంత్రాలూ ఉంటయ్' ఆ తిట్లూ, శాపాలూ, మంత్రాలూ విని మూఢులైన భక్తులు వెనక్కి-తిరిగి చూడకుండా లగెత్తుకుంటారు! ముక్తీ, మోక్షమూ యాచించే మొండి శిఖండి భక్తులుమాత్రం వాటన్నిటినీ విని సహనంతో ఆ సాధువుల్ని కొలుస్తుంటారు!

ఇప్పుడీ సాధుబాబాగారి హావభావ విలాసాలూ, తిట్లవైఖరీ గమనిస్తే తప్పక వీరిలో ఏదో అలౌకిక మహత్త్వం యిమిడి ఉందని గ్రహించి, వినయాన్ని ప్రదర్శించి "క్షమించండి బాబాజీ' తమ ఆదేశం ఏమిటో శలవీయండి" అన్నాను బాబాజీ కాస్త శాంతించి "ఆతిథ్యంకావాలి' పొట్టలో ప్రేవులు అల్లాడుతున్నాయ్ .. ఆఁ ... అన్నట్టు మీరు బంగాళీల్లా కనిపిస్తున్నారు బంగాళీలోనే మాటలు కానివ్వండి'' అన్నాడు బెంగాళీలో' బాబాజీ నోటినుంచి మా మాతృభాష వినే సరికి ప్రాణం లేచివచ్చిన ట్టయింది కాగా ఏదో వెర్రిఅభిమానమూ పుట్టుకొచ్చింది' ఆనందంతో "బాబాజీ! ఈ పూరీలూ, కూరా, కోవా బిళ్ళలూ తమకు నచ్చుతవా?'' అన్నాను

"ఆఁ...ఆఁ' నచ్చక పోవడమేమిటి? భేషుగ్గా నచ్చుతవి! కాని... ఇవేమాత్రం? ఇంతమందికీ ఈ స్వల్పం ... ఛ ... ఛ' మరో రెండు శేర్లయినా తెప్పించు' '' అన్నాడు బాబాజీ.

టహల్‌రామ్‌ను బజారుకు పంపక తప్పిందికాదు ఆంతలో పులిన్‌బాబు బాతాఖానీలోకి దిగాడు, అసల్లో పులిన్ బాబు వృత్తి ప్లీడరీ! అంటే వకాల్తా పుచ్చుకోవడం, వాద ప్రతివాదాలు చేయడం' ఐతే—సరైన పార్టీలు లభించక పోవడంవల్ల – ఎక్కడైనా, ఎవరైనా తటస్థపడితే వాళ్ళతో తెగవాగి నోటిదుల తీర్చుకుంటూ ఉంటాడు!

"ఐతే బాబాజీ' తమరు బెంగాళీ బ్రాహ్మలా?'' ప్రశ్నించాడి పులిన్‌బాబు

"మా జాతీ, మతమూ తెలుసుకొని ఏంచేస్తావయ్యా? నీ కుమార్తెనిచ్చి పెళ్లిగాని చేస్తావా?...భేష్!...ఐతేవిను! నా భాష సంస్కృతం' ఆఁ, అచ్చఁవైన దేవభాష' ఐతే – నువు బోధపర్చుకోలేవనీ, పైగా నీ కిష్టమనీ నీ మాతృభాష

అయిన బంగాళీలో మాటాడుతున్నాను అంతమాత్రాన నన్ను నీ జాతివాణ్ణిగా కట్టి వేయకు ।" వ్యగ్రంగా జవాబిచ్చాడు సాధు బాబా

"ఓ...అలానా ? ఐతే – తమ రే సాంప్రదాయానికి చెందినవారు ?"

"ఛీఛీ! నా సాంప్రదాయం నువు చెప్పే దాంట్లో ఏదీ గాదు నా పూర్వాశ్రమం – బ్రహ్మలోకం ...నేను-బ్రహ్మర్షి ని !"

"తమ నామధేయం అడగవచ్చా ?"

"ఆఁ ..ఆఁ! మూగవాడివి కావు కదూ ఊరుకోవడానికి ? ఖుషీగా అడగ వచ్చు ! కాని–నేను చెప్పింది విశ్వసిస్తావో లేదో ? ఏమంటే మీరంతా నాస్తికులూ, పాఖండులూన్ను ।... నేను ..నేను . దూర్వాస మహామునిని ।...తెల్సిందా ?"

అది విని మేమంతా ఆశ్చర్యంలో మునిగిపోయాం ! కాసేపటివరకూ నోటి నుంచి మాటేరాలేదు తరువాత తేరు కొని వినయవిశ్వాసాల్తో తలవంచి, నమ స్కరించి, "ధన్యోస్మి । ధన్యోస్మి !! ఆహాహా ! చరితార్థులమైనాం । . తమ రూప విలాసాదులు లోకు లనుకున్నట్టు గానే కనిపిస్తున్నాయ్ । ఐతే మహాత్మా । మూఢమానసులు మాత్రం తమరు మహా కోపదారులు అంటూ ఉంటారు కాని – మాకుమాత్రం తమ వర్చస్సులో ఆ కోప చిహ్నాలు పిసరంతయినా గోచరించ లేదు మాతో తమరు అతి సుప్రసన్నంగా వ్యవహారిస్తున్నారు ।" అన్నాం

"క్రోపదారితనఁవా ? లేదు లేదు ! ఇప్పుడదంతా విలుప్తమైపోయింది । ఆఁ...ఒకానొక కాలంలో మహా తేజ స్సంపన్నుడనై ఉండేవాణ్ణి । కాని – ఆ దుర్జాతిముండ.. నా తేజస్సునూ, పౌరు షాన్నీ, ప్రాబల్యాన్నీ చల్లార్చేసింది।–"

అరే ? ... ఈ మహాముని ఏమి టిలా అంటున్నారని మహదాశ్చర్యం పొందాను । చేతులు జోడించి వినయంగా "తపోధనా! గుప్తవిషయం కానట్ట యితే–ఆ దుర్జాతిముండ ఎవరో, ఆ గత చరిత్ర ఏమిటో శలవిస్తే వీనులలర వింటాం । తమరేమో సత్య, త్రేతా, ద్వాపరయుగ మహావ్యక్తులు । అలాంటిది ఈ ఘోర కలియుగంలో, అందునా ఈ యిరవయ్యో శతాబ్దంలో మాలాంటి అధమాధమ మానవులచెంతకు ఎలా దయచేశారు ?" అన్నాను

దూర్వాస మహాముని విషాదంగా నిట్టూర్చి "పూజ్యనీయులైన జనకులు – అత్రిమహామునివరేణ్యులు స్వప్నంలో కనిపించి 'అబ్బాయీ । గంగానదీ తీరాన హృషీకేశ తీర్థరాజంలో విలసిల్లుతున్న ధర్మశాలా ప్రాంగణంలో ఒకానొక గదిలో విడిదిచేసిన మానవులచెంతకు వెళ్ళావంటే నీ సంకట విమోచన మవు తుంది ।' అని ఆజ్ఞాపించారు । అందుకని–"

మధ్యలోనే కల్పించుకొని "పుణ్యాత్మా! తమరు – సంకటావస్థలో తగులు



"చివరి బొట్టుదాకా పిండావు, నా దూడ ఏమవుతుంది ?"

కొన్నారా ? ఆశ్చర్యంగా ఉందే ?...ఇత రులను సంకటాల్లో తగులుకొనేటట్లు చేసే ప్రతిభాశాలురు కదా తమరు-తమరు ఎలా మహాత్మా ?'' అన్నాను

"అంతా వివరించి చెబుతాను ముందు భోజనం కానివ్వండి ! ఆ( మీరందరూ, నిస్సంకోచంగా ఆరగించండి !"

''చిత్తం! తమరు స్నానాదికాలు చేసుకోరా ?'' పులిన్‌బాబు ప్రశ్నించాడు

''స్నానాదికాలా ? అది ఎప్పుడో అయిపోయింది ! బ్రహ్మలోకంలో - గంగాజలాల్లో ఒక మునుగు మునిగి వచ్చాను-''

''అలానా ?... కాని ... ఆ జడలూ, గడ్డమూ మురికితో ఉన్నాయిలెండి ! మా దగ్గర ప్రశస్తమైన మురికి పోగొట్టే సబ్బు ఉంది. అది ప్రయోగించండి! కాగా-తమ యావత్ శరీరమూ నల్లుల్తో నిండి ఉంది ! అవి వేలాది సంఖ్యలో స్వేచ్ఛావిహారం చేస్తున్నాయ్ ! ..ఆజ్ఞా పిస్తే-కాస్త డి డి టి, జల్లుతాను" అన్నాడు పులిన్‌బాబు

అదివిని మునివర్యులు కోపంతో ''ఖబర్దార్ ! అలాంటి పిచ్చిపని చేయ వద్దు ! ఏవో కొన్ని అసహాయప్రాణులు నాశరీరంలోనూ, కాషాయాంబరాల్లోనూ, జడల్లోనూ, గడ్డమూ మీసాల్లోనూ ఆశ్ర యం పొందాయంటే పొంద నివ్వండి ! వాటిని పారదోలి దూరపర్చడానికి నువ్వె వరవు ?" అన్నాడు

అంతలో టహల్‌రామ్ బజారునుంచి భోజన సామగ్రితో వచ్చాడు మహాముని ఆజ్ఞ అయిన తరువాత అందరమూ భోజనానికి ఉపక్రమించాం ! ఉన్నదాంట్లో సగంమునిగారికి వడ్డించి, మిగిలినసగమూ మేము కానిచ్చాం ! చేతులు కడుక్కున్న తరువాత సిగరెట్ డబ్బా మునీంద్రుల కందిస్తూ ''ప్రభూ ! ఇది తమను తృప్తి పరుస్తుందో లేదో ? మా దగ్గర యింత కన్నా అతీతమైన ధూమపానం లేదని

చెప్పడానికి సిగ్గుపడుతున్నాను" అన్నాను. డబ్బానుంచి ఒక సిగరెట్ తీసి దుర్వాస ముని "ఫరవాలేదు ఇదేచాలు ' అయినా గంజాయి అంటే నాకు సహించదు దాన్ని 'జ్ఞానపత్రి' అని అంటారు కాని నాకు మాత్రం అది ఉపయోగిస్తే వాయుప్రకోపం కలుగుతుంది ఆఁ...మీరూ కానివ్వండి'' అన్నాడు

''ఛ ఛ' ..తమబోటి మహాత్ముల సమక్షంలో అసభ్యంగా ధూమపానం '' అన్నాను వినయం ఉట్టిపడేలా

''వేషాలు వెయ్యకోయ్ ' నా ఎదట దొంతర్లకొద్దీ రొట్టెలు స్వాహాచెయ్యడానికి లేని సిగ్గూ, అసభ్యతా, ధూమపానం చెయ్యడానికే వచ్చిందా ?... కానివ్వండి–" అన్నాడు మునివర్యుడు గట్టిగా ఒక దమ్ములాగి '

నేనూ, పులిన్‌బాబూ చెరో సిగరెట్ వెలిగించాం ' రెండు నిముషాల్లో వాటిని బూడిదచేసి సావకాశంగా కూచున్నాం, మునీంద్రులు చెప్పబోయే కథను వినడానికి '

"ఆఁ ' మీరంతా ఆగత చరిత్ర వినాలని కుతూహల పడుతున్నారుకదూ ? వినండి !... శకుంతల కథ మీకు క్షుణ్ణంగా తెలుసుకదూ ? . మహాకవి కాళిదాసు తన నాటకంలో ఏమని ఉల్లేఖించాడంటే–దుష్యంతుని గురించి శకుంతల ఆలోచిస్తూ ఉండగా నేనక్కడకు వెళ్ళి ఆమెను పిలిచాను కాని–మధురాతి మధురమైన తలంపులలో ఉన్న శకుంతలకు నా పిలుపు వినిపించలేదు ఆమె మూకీభవాన్ని అలక్ష్యంగా తీసుకొన్నాను కోపంతో "నీ వెవరి గురించి ఇంతగా ఆలోచిస్తూ నన్ను నిర్లక్ష్యపర్చావో అతను నిన్ను చూసికూడా నీవు ఫలానాఅని పోల్చుకొనికూడా, నిరాదరణతో నిన్ను బహిష్కరించుగాక '' అని శపించాను కాని–ఆ నా శాపవాక్యాలుకూడా శకుంతలకు వినిపించలేదు ' ఐతే–ఆమె సమక్షంలోఉన్న ఒక దాసి నా శాపం విన్నది వెంటనే నా దగ్గరకు వచ్చి, సాష్టాంగపడి బహువిధాల ప్రార్థించింది. ఆ దాసిపేరు అనసూయ ' నా ప్రియజనని పేరుకూడ అనసూయ అవడంవల్ల నాకామె ప్రార్థనవల్ల దయ కలిగింది ' నే నిచ్చిన శాపంలోని ఉగ్రతను తగ్గించి స్వల్పమాత్రంగా తగలాలని మార్చాను'

ఐతే ఆ దాసి – మహా దుష్టురాలు' సరాసరి శకుంతలతల్లి అయిన మేనక దగ్గరకు పరుగునవెళ్లి ఆ శాపవార్త ఆ దేవలోకపు వారకాంత చెవిలోవూదింది'. అది జరిగి పదిమాసాలైంది అప్పుడు నేను శిష్యుల్తో గంగోత్రీ సమీపంలో ఉంటుండేవాణ్ణి ' ఒకనాటి ప్రాతఃకాలం భాగీరథీ తీరంలో కూచొని ఉన్నాను అప్పుడొక శిష్యుడు ప్రవేశించి ''గురువర్యా ' తమతో ఒక దివ్యసుందరీమణి కలియ నభిలషిస్తున్నారు ఏం శలవ్ ?' అన్నాడు. అప్పుడు నాకెక్కడలేని

చిరాకూ కలిగింది 'అబ్బబ్బా' ఇక్కడ కూడా యీ దివ్య సుందరీమణులు అఘో రి స్తే ఎలా చావడం? ఏదో నిరసంగా ఉంటుందనీ, మరెట్టి ఆటంకాలకూ అవ కాశం ఉండదనీ, ఆ పరాత్పరుని చింత నలో లీనమై ఉండవచ్చనీ అనుకున్నాను కాని చూ స్తే అదే పాతవరుస'' అనుకొని, శిష్యునితో "ఎవరు వచ్చారో పంపించు" అన్నాను. - ఆ దివ్య సుందరీమణి ప్రవే శించింది. చూసీ చూడగనే పోల్చు కున్నాను మరెవ్వరూ కాదు' మేనక'

"ఛీ ఛీ' సభ్యత అన్నది ఆ దుష్ట రాల్లో ఏ మాత్రమూ లేదు నోట్లో పలుదోము పుడక ఉంచుకొని 'తుప్- తుప్' మని ఉమ్ముతూ, పండ్లుతోము కుంటూ వచ్చి నిల్చుంది' అలాటి వేషంతో వస్తే యింకా మనోహరంగా ఉంటానను కుంది కాబోసు దొంగముండ'

"ఏం .ఎందుకొచ్చావ్? నే నెవరినో తెలుసా? మహా తేజస్సంపన్నుణ్ణయిన దూర్వాస మహాముని ని? పాపం' నీ టక్కు టమారాలూ, అందచందాలూ, తళుకు బెళుకులూ, కులుకు చమకులూ చూపి వలలో వేసుకోవడాని కా విశ్వామి త్రుణ్ణి అనుకున్నావేమో?" అన్నాను కసితీరేలా'

అదివిని ఆ మాయలాడి బుంగమూతి పెట్టి ''వారేవా? . మీకన్నా యోగ్యులీ ముల్లోకాల్లో ఎవరూ లేరనీ, అందుకని మీ వెంటపడడాని కొచ్చాననీ అనుకుం టున్నారా? భేష్' భేష్'. సరేకాని - నేనిప్పుడు రావడం మీ గురించి అంటే మీ మంచిగురించి, మీ భవిష్యత్తుగురించి' అంతేకాని మీతో కులకడానికి కాదు' పొమ్మంటే పోతాను' నాకేం? తరవాత చిక్కుల్లో పడిపోయాక నన్నాడిపోస్తే లాభం లేదు'" అన్నది

చూశారా ఆ గడుసుముండ వ్యవ హారం? నన్ను 'మీరు - మీరు' అని సమానస్థాయిలో సంబోధిస్తున్నదే కాని గౌరవపురస్సరంగా 'తమరు' అనలేదు పట్టరాని ఆగ్రహం ముంచుకొచ్చింది వెంటనే 'గర్వబోతా' సువ్వీక్షణంలో మండ్రగబ్బవై పోదువుగాక' అని శపించి వేయాలని తలంచాను కాని - ఎందు కొచ్చిందో ఏమిటో ఏదో నన్నుద్ధ రించడాని కొచ్చినట్టు మాటాడుతున్నది అది విన్నాక ఆలోచిద్దా మనుకొని, ఆ యాగ్రహాన్ని దిగమింగి ''ఎందు కొచ్చావ్?" అని ప్రశ్నించాను

"మరేం లేదు మీరేమో శకుంతలను అకారణంగా శపించారు పాపం' ఆ వేల ఏం చేసింది ఆ విషయం ఎలానో కైలాస వాసులు - మహాదేవులకు తెలిసింది అతను ప్రచండకోపంతో మూడో నేత్రం తెరిచి మిమ్మల్ని భస్మం చేయ నుంకించేసమయంలో నేను వెంటనే అతని పాదాలు పట్టుకొని వేవిధాల ప్రార్థించి శాంతింప జేశాను"

మేనక మాటను వినేసరికి నాకు ముచ్చెమటలు పోశాయ్! దేవమానవుల్లో ఏ ఒకరికీ నేను భయపడను కాని ఈ మహాదేవుడంటే మాత్రం గజగజలాడు తాను కొంపమునిగిం దనుకొని "ఐతే నువ్వా భోళాశంకరుణ్ణి ఎలా శాంతింప జేశావ్ ?" అని ప్రశ్నించాను

"ఎలానా ?... 'పార్వతీనాథా' దూర్వాసముని అమాయక బ్రాహ్మణుడు కాగా కాస్త మతిచెడి ఉన్నాడు వెనకా ముందూ చూడకుండా నిరపరాధి అయిన శకుంతలను శపించివేశాడు ఐనా—పెద్ద ప్రమాదం లేదులెండి' ఆ శాప ఫలం శకుంతల పెద్దకాలం అనుభవించ నక్కరలేదు కనుక తమరా మునిని యీ సారికి క్షమించి కాపాడండి' ఇంకో పర్యాయం అలా చేస్తే తమ యిష్టం" ఇలా అనేసరికి మహాదేవుడు సంబరపడి పోయాడు కాగా — నేనంటే ఎంతో మక్కువ' ఎందుకంటే వారి అత్తగారి పేరూ, నా అత్తగారి పేరూ ఒకటే కదూ...అందుకని! ఐతే మాత్రం.. ఆ నందివాహను డొక షరతు పెట్టాడు షరతు కాదు — ఒక విధమైన ప్రాయ శ్చిత్తం"' అన్నది మేనక "ప్రాయ శ్చిత్తమా ?.. ఏమిటో ?" సంశయంగా ప్రశ్నించాను

"భయపడకండి మునివర్యా! ప్రాయ శ్చిత్తమంటే — ఏదో గురుతర కార్యం కాదు! చాల సుళువైందే'...శకుంతల యిప్పుడు హేమకూట పర్వతం దగ్గర కశ్యపాశ్రమంలో ఉంది కొన్నాళ్ళ క్రితం ఆమెకొక కుమారుడు కలిగాడు కశ్యపమునీంద్రుల వచనానుసారం యీ బాలుడు భరతుని పేర రాజాధిరాజుగా విలసిల్లుతాడు! తరవాత యీ భూఖండం వాని పేరుమీద భారతవర్షంగా లెక్కకు వస్తుంది నేనొకసారి వెళ్ళి ఆ పిల్లవాణ్ణి చూసిరావాలనుకున్నాను కాని అవకాశం లేదు ఏమంటే ? హటాత్తుగా మహేంద్రుడు దేవలోకంలోని అప్సరలను పిలువనంపించాడు ఎందుకన...అతని సుపుత్రుడు జయంతుడు మహా అల్లరి చిల్లరగా తిరుగుతున్నాడట' అందుకని ఆ జయంతుని వివాహం ఎలానైనా చేసి వెయ్యాలని ఇంద్రుని సంకల్పం' ఆ కారణం చేత రెండు నెలలవరకూ రాత్రీ పగలూ మాకు తీరిక ఉండదు ఆటలూ, పాటలూ, నృత్యాలూ, విందులూ, వినోదాలూ నడుస్తూ ఉంటవి' ఇదిగో .. యివ్వాళ కాస్త తెరిపి చేసుకొని యిలా వచ్చాను ఈ రెండు నెలలూ పూర్తి అయిన తరవాత వెళ్దామంటే ఏంలాభం ? అప్పటికి భరతుడు శతవృద్ధు ఐపోతాడు మరిదేవమానానికీ, మానవ మానానికీ శతసహస్రాంశం భేదం ఉందికదా ? అందుకని మిమ్మల్ని అక్కడకు పంపించా లనుకుంటున్నాను"

అప్పుడు నాలో నేను 'ఓస్సిదేనా ? ఏమిటో అనుకున్నాను కాగా —



యిప్పట్లో నేను వెళ్ళి శకుంతల కొడుకును చూసి ఆశీర్వదిస్తే లోకులుకూడా హర్షిస్తారు శకుంతలకు నే నిచ్చినశాపం మరుగుపడి పోతుంది అనుకొని మేనకతో "సరే వెళ్ళొస్తాను కాని ప్రాయశ్చిత్తం అన్నావ్... అదేమిటి? అక్కడకు వెళ్ళి ఏంచెయ్యాలి?'' అన్నాను

''పూచీతో నిండుకున్న కార్యం మీద వేసుకొని మీరు వెళ్ళాలి. ఇదిగో.. ఈ మువ్వ .దీన్ని పట్టుకొని నా మనుమడు భరతునికి నా పేరుమీదుగా బహూకరించాలి. ఆ పైని నాపక్షంగా వాణ్ణి ముద్దులాడి ఆశీర్వదించాలి. ఐతే — మీ రూపము బహు దుర్గంధంగా ఉంది ఆ పిల్లవాడు స్ఫటిక సదృశంగా ఉండవచ్చు ముందు మీ చేతుల్ని పరిశుభ్రం చేసుకొని, మువ్వను అందించి ఆ చేత్తో పిల్లవాని చుబుకాన్ని స్పృశించి నోటి దగ్గరకు తెచ్చుకొని ముద్దులాడాలి. తెల్సిందా?'' అన్నది

నాకేమో ఆ మాయదారి మాటలు బోధపడలేదు అందుకని "ఎలా ముద్దులాడాలి?" అని ప్రశ్నించాను

"ఎలానా?... ఇదిగో... యిలా." అంటూ మేనక తన చేతితో నా గడ్డాన్ని ముట్టుకొని, ఆ చేతిని పెదవులదగ్గరపెట్టి ముద్దులాడింది. తరవాత "ఇదుగో. మువ్వ. దీన్ని అతి జాగ్రత్తగా తీసుకుపోవాలి. ఎక్కడైనా జారవిడిచేరు సుమా? అలా జారవిడిచి పోగొట్టుకున్నారా. .దాని పర్యవసానం మహా ప్రమాదమని గ్రహించండి" అన్నది.

మువ్వ తీసుకొని "ఎందుకు పోగొట్టుకుంటాను? చిన్న వాణ్ణా చిటికివాణ్ణా? భయపడ నవసరంలేదు మంచి ముహూర్తం చూసుకొని బయలుదేరుతాను" అన్నాను

అంతలో పులిన్ బాబు "ప్రభూ. చిన్న విషయం. ఆగ్రహించకండి. ఆ(... ఇంతకూ ఆ దేవవేశ్య - మేనక వయసు ఏ మాత్రం ఉంటుందని తమ అభిప్రాయం?" అని ప్రశ్నించాడు

"ఏమిటయ్యా నీ తెలివితక్కువ ప్రశ్న? అప్సరలనే వాళ్ళకు వయసనేది ఉంటుందా? వాళ్ళది నిత్య నూతన యౌవనం! వెన్నెలా, మెరపూ, ఇంద్ర ధనస్సు — వీటికి వయసనేది ఉన్నదా? అలానే ఈ అప్సరలు కూడాను! .. ఇక తరువాయికధ.. మువ్వను అందించి మేనక వెళ్ళిపోయింది మూడు రోజుల వరకూ ప్రయాణానికి ముహూర్తం కుదర లేదు నాలుగోనాడు బయలుదేరాను ఐతే — మేనకను అప్సర అనే పిలవండి లేదా ..దివ్యాంగన అనే పిలవండి . ఎంతయినా ఆవిడ దేవవేశ్య! ఇంగిత జ్ఞానం, లోకాచారం తక్కువ! మను మడికి బహూకరించమని ఒక మువ్వనే యిచ్చింది కాని మరేదీ యివ్వలేదు అంత మాత్రాన నన్నూ జ్ఞాన శూన్యునిలా ప్రవర్తించ మంటావా? , వెళ్ళేది పసిపాప ఉన్నచోటు! ఆట వస్తువొకటుంటే అయి పోతుందా? తినడానికేదైనా తీసుకు పోవాలామరి? అందుకని ఆశ్రమ సమీ పంలో ఉన్న అడవినుంచి బాగా పెరిగిన ఒక కందమూలం — అంటే — ఎర్రగా తియ్యగా ఉంటుందే దుంప అదీ, రమా రమి రెండు శేర్లు ఆరముగ్గిన చింత బొట్టలూ తీసుకువచ్చి సంచిలో వేశాను . . . ''

మధ్యలో పులిన్‌బాబు "మునీశ్వరా! అంత పసిబాలుడు కందమూలమూ, చింతబుట్టలూ తింటాడా?'' అని సంశయ స్వరంతో ప్రశ్నించాడు దానికి నేను ''సరిసరి! ఎందుకు తినరు? ఆ కాలం నాటి క్షత్రియకులంలో పుట్టిన పసికందులు దుంపలూ, చింతబుట్టలూ ఏమిటి . నల్ల ఇనపరాళ్ళ ముక్కలుకూడా తిని జీర్ణింప జేసుకొనేవారు! ఇప్పుడా అంటే మన పిల్లలకు విదేశీ పాలగుండలూ, పాల డబ్బాలూ గత్యంతరమై ఉంది'' అన్నాను ఆపైని దూర్వాసముని యిలా అన్నారు — "నిజంగా మీరంతా శుద్ధ మూర్ఖులు! తీసుకువెళ్ళిన కంద మూలమూ, చింతబొట్టలూ ఆ పిల్లవా డొక్కడే ఆరగించివేస్తాడా ఏమిటి? తక్కిన ఆశ్రమవాసులంతా తలోయింతా పంచుకొని ఆరగిస్తారు! సరే! మిగి లిన గాధ వినండి! యధాసమయంలో బయలుదేరి సకాలానికి హోమకూటం చేరుకున్నాను అక్కడ మరీచి మునీం ద్రుల సుపుత్రులు కశ్యప భగవానుల్నీ వారి ధర్మపత్ని అదితీదేవినీ దర్శించి తరువాత శకుంతలదగ్గరకు వెళ్ళాను

నన్ను చూసి ఆయమ్మ మహదా నందం పొందింది! సంచినుంచి కంద మూలమూ, చింతబొట్టలూ తీసి బహూక రించాను పిల్లవాడు ఆమె తొడలమీదనే ఉన్నాడు మేనక చెప్పినట్టు వాణ్ణి ముద్దు లాడి ఆశీర్వదించాను తరవాత శకుం తలతో ''అమ్మాయీ! నీ కుమారుడు సర్వదమనుడై, భరతుని పేర యీ భూభా గాన్ని సర్వతోముఖంగా, ప్రజారంజ

కంగా పాలిస్తాడు ధర్మాన్ని నాలుగు పాదాలా నడిపిస్తాడు ఈ భూఖండం వీని పేరున 'భారతవర్షం' అవుతుంది ' నువు కూడా శీఘ్రాతిశీఘ్రంగా నీ పతిదేవుని కలుసుకుంటావు '" అని మొలలో చేయి పెట్టి మువ్వ తీయబోయాను కాని-ఉత్తి మొల ' మువ్వలేదు ' ... నా తల గిర్రు మన్నది ' కట్టుకున్న కాషాయాంబరం, కప్పుకున్న కంబళీ పదిసార్లు దులిపాను సంచీ, చెంబూ చివరకు జడలూ అన్నీ తిరగవేసి, విదళించి వెదికాను కాని-లాభంలేకపోయింది ' ఆ మువ్వ - నల్లపూసకన్నా మిన్నఐపోయింది '...శకుంతల నిజపరిస్థితి అడిగి ఏడుపుముఖం పెట్టింది పాపం ' కన్నవారిచ్చిన బహుమానం కదూ ? పోతే ఎలాగుంటుంది ?' వాస్తవానికి మేనక వేశ్య అయినా .. అసల్లో కన్నతల్లి కదా ? శకుంతల దీనావస్థ గమనించి "అమ్మాయీ శకుంతలా ' ఎందుకు విచారిస్తావ్ ? ఆ మువ్వను మించిన మరోమువ్వ తీసుకువచ్చి నీకిచ్చే పూచీ నాది '" అన్నాను.

అంతలో యిద్దరు వృద్ధ తపస్వినులు వచ్చి శకుంతలపక్క కూచున్నారు విషయమంతా విని నా వేపు కొరకొర చూసి "చాల్లేవయ్యా ..పిచ్చివాడిలా బడబడలాడకు ' పిల్లవాని అమ్మమ్మ వాత్సల్య పురస్సరంగా యిచ్చిన కానుకతో యింకోటి సరితూగుతుందా ? ఏమనూ నిన్ను చూస్తుంటే బుద్ధిభ్రష్ఠునిలా కనిపిస్తున్నావ్ ' ఎక్కడ్నో స్నానం చేసిన దగ్గర ఆ మువ్వ మొలనుంచి జారి నీళ్లలో పడిపోయి ఉంటుంది దాన్ని ఏ చేపో, జెల్లో మింగివేసుంటుంది ' . వెళ్ళు ' ఎక్కడెక్కడ స్నానం చేశావో-ఆ నదీ నదాల్లో, సరస్సుల్లో, తటాకాల్లో ఉన్న గండుమీనుల్ని పట్టుకొని, వాటి పొట్టలు చీల్చి, ఆ మువ్వను తీసి పట్టుకురా '" అన్నారు ఆ ముసలమ్మల మాటలు వినీ వినగానే మరి నా కక్కడ నిలవబుద్ధి కలగ లేదు వెంటనే వెనక్కు మళ్ళిపోయాను వచ్చినతోవనే నడుస్తూ ప్రతీ అంగుళం మేరా వెదుకుతూ వేసారినాను కాని మువ్వ కనిపించలేదు!

నేనెంత మతిమాలినవాణ్ణయినా ఒక విషయంమాత్రం గుర్తుంది ఏమిటంటే-ఆ మువ్వను మొలలోదోపి, కాషాయాంబరాన్ని బాగా బిగించి కట్టాను అవశ్యం అది ఎక్కడ్నో స్నానం చేసిన దగ్గరనే జారిపోయి ఉంటుంది ' . అందుకని స్నానంచేసిన ప్రతీ నీటిపట్టునా మునిఁ వెతికాను కాని మువ్వ లభించలేదు వాస్తవంగా దాన్ని ఏ గండుమీనో మింగి వేసుంటుంది ఆఖరుకు బెస్తవాళ్ళను కూడా పిలిచి "ఏమయ్యా...యీ మధ్య మీ కేదైనా చేప కడుపులో ఒక మువ్వ గాని దొరికిందా ? చూడండి బాబుల్లారా! దొరికినట్లయితే ఆలస్యం చెయ్యకుండా తెచ్చి యిచ్చివేయండి ' మిమ్మల్ని మన సారా దీవిస్తాను" అన్నాను నా మాటలు

విని వాళ్ళు విరగబడి నవ్వి "ఏంవయ్యో సాదువుగోరూ! సేప కడుపులో మువ్వ లుంటాయా? అగ్గిబాణాలుంటాయిగాని-" అన్నారు వాళ్ళవైఖరి మహాఆగ్రహాన్ని కలిగించింది వెధవలనందర్నీ మొసళ్ళయి పోవల్సిందిగా శపించా లనుకున్నాను కాని-తమాయించుకొని, కోపాన్ని దిగ మింగి ఊరుకున్నాను

ఏమైనా-చివరకు మేనకకిచ్చిన వాగ్దానాన్ని నిలుపుకోలేక పోయాను మువ్వ అంటే అతిసామాన్యమైన వస్తువు! కాని-వాగ్దానమూ అంటే సామాన్యమైంది కాదు ఆవాగ్దానభంగంతో నేను మహా పాపిని అయాను! నాకు మనశ్శాంతి లేకుండా పోయింది! నాలో బ్రహ్మతేజం విలుప్తమై పోయింది! ... ఎంతోకాలం దొర్లిపోయింది నేటికీ ఆమువ్వకోసం వెదుకుతూనే ఉన్నాను కాని - అది ప్రాప్తించలేదు చివరకు-శాపం యివ్వ డానికికూడా శక్తిసామర్థ్యాలు లేని బల హీను ణ్ణయిపోయాను! విషంలేని నీటి పాములా తయారయాను! నా స్థితి గమ నించి శిష్యులంతా చల్లచల్లగా జారు కున్నారు ఆఖరుకు ఒక సామాన్య బైరాగికన్నా హీనంగా, ఇలా ఎదురు దెబ్బలుతింటూ, గమ్యస్థానంలేక తిరుగు తున్నాను-''

నేనా కథ ఆలించి ''శాంతించండి మునీశ్వరా! తమ రనవసరంగా యింత కాలమూ కష్టాలు భరించుకొచ్చారు. ఆ భరత చక్రవర్తి ఎప్పుడు స్వర్గధామం చేరుకున్నారో ఎవరికీ తెలియదు ఇప్పు డా మువ్వ దొరికినా ఏం ప్రయోజనం? తమ రా ప్రయత్నం విరమించుకొని తప స్సమాధిలో చేరుకొనండి! హరినామ సంకీర్తనతో గడపండి! .లేదా - లోక శిక్షణార్థం ఉత్తమ గ్రంథాలు రచించండి! అదీ కాదంటే - జటాజూటధారులైన మహామునులూ, ఋషులతో 'గ్లామర్ గర్ల్స్' అయిన అప్సరల ప్రణయ కలా పాలు అతి వాస్తవికంగా వర్ణించి పుస్త కాలు వ్రాయండి! వాటికోసం - ప్రచురణ కర్తలూ, పత్రికలవాళ్ళూ సుందోప సుందుల్లా యుద్ధా లారంభిస్తారు! అంతే గాని - ఆ మువ్వకోసం తాపత్రయపడి కాలాన్ని వ్యర్థం చేయకండి!" అన్నాను

"తాపత్రయ పడకుండా ఎలాగయ్యా ఉండేది? ఆ మువ్వయే మేనక యిచ్చిన శాపం అని యిప్పుడిప్పుడు తెలుసు కుంటున్నాను! ఆ శాప మహిమవల్లనే కదా నే నిలా నిర్వీర్యుణ్ణయిపోయాను! ఎప్పుడైనా, ఎక్కడయినా, ఏదయినా మువ్వ చప్పుడు చెవుల్లో పడ్డదంటే పిచ్చి వాణ్ణి అయిపోతుంటాను!. '' ఇంకా ఏమో చెప్పబోతూ దూర్వాసముని, హటా త్తుగా వెర్రి కేకలువేస్తూ, చేతులూకాళ్లూ కొట్టుకొంటూ గంతులు వేయనారంభిం చాడు మాపట్లూ ఆ ముని పాదాలదగ్గర పడిపోయి "చంపేశాడ్రోయ్ అన్నిట్నీ చంపేశాడు...'' అని గోలపెట్టాడు

అసలు సంగతి ఏమిటంటే మహాముని చెబుతూన్న ముచ్చకథ పల్టూభక్తిశ్రద్ధల్తో వింటూండడంలో తన పెంపుడు ఎలకల్ని మర్చిపోయాడు సమయం కనిపెట్టి అవి వాని జేబునుంచి మెల్లగా జారుకొని దూర్వాసమునీంద్రుల కాషాయపు లుంగీలోకి ఒకటి ప్రవేశించింది' మరో రెండు అతని మెడను ఆశ్రయించాయ్' మరొకటి ఎక్కడ మాయమైందో కనిపించ లేదు' మునిచేసిన తాండవనృత్యంతో ఆ మూడు ఎలకలూ కిందపడిపోయాయ్' ఎలానో తంటాలుపడి పల్టూ వాటిని ముని పాదాల తొక్కిడినుంచి తప్పించి రక్షించుకున్నాడు ముని ఆగ్రహంతో ''ఏంరా అబ్బీ' నువు మహా ఉద్దండ పిండంలా వున్నావే'' అన్నాడు పులిన్ బాబు తీవ్రంగా "షేక్డేర్ తపోధనా! నా పిల్లాణ్ణి శపించావంటే—'' అంటూ పిడికిలి బిగించాడు

దూర్వాస ముని సంబాళించుకొని "ఛీ ఛీ' ఎలకల్ని పెంచడం మహాపాపం' చివరకుఛండాలురుకూడా వీటినిపెంచరు" అన్నాడు

''వాః తమరేమో తమ శరీరం నిండా నల్లుల్ని పెట్టుకొని పెంచుతున్నారు అది పుణ్యమూన్నూ, నేను ఎలకల్ని పెంచడం పాపమూన్నా? భేష్'' అని తండ్రితో ''చూశారా నాన్నగారూ! యీ ముని



ఒంటిమీది నల్లులు కొన్ని మనపక్కమీదికీ మంచంలోకీ బట్టల్లోకీ చేరుకున్నాయ్. ఇంతకూ నా ఎలక ఒకటి కనబడ్డంలేదు ఎటు పోయిందో ఏమిటో ?" అన్నాడు

దుర్వాసముని తిరుగా కేకలువేస్తూ నాట్య మాడనారంభించాడు పల్టూ అతని వేపు నిదానించిచూసి ''అది గదిగో నా ఎలక ! ముని గడ్డంలో దూరిపోయింది'' అన్నాడు వెను వెంటనే ఆ ముని అనుజ్ఞ లేకుండా ఒక్క ఉదుటున వెళ్ళి చిక్కని గడ్డంలో చేతినిదూర్చి ఆ ఎలకను పట్టుకొని బయటకు లాగాడు దాన్ని జాగ్రతగా జేబులో పెట్టుకొని "ఆ గడ్డంలో చెయ్యిపెట్టినప్పుడు ఏదో మువ్వమోగిన చిన్నశబ్దం అయింది'' అన్నాడు

నేను ఎగిరి ఒక గంతువేసి నిల్చున్నాను—

"ఏమిత్రా పల్టూ ? ఏమంటున్నావ్ ? మువ్వ మోగిన శబ్దంవా ?'' అని మునివేపు చూసి ''ప్రభూ ! తమరొకసారి తమ గడ్డాన్ని కాస్త గట్టిగా దులిపిచూడండి '' అన్నాను వెంటనే ఆమహాముని గడ్డాన్ని మొదలంటా పట్టుకొని దులిపాడు ఆ చిక్కని వెంట్రుకల్ని ఛేదించుకొని "ఝున్ ఝున్'' మనే క్షీణస్వరం వినవచ్చింది !

పులిన్‌బాబు ముని దగ్గరకువెళ్ళి ఆ గడ్డంలోని కొన్ని వెంట్రుకల్ని అటూ యిటూ విడదీసి తడిమి చూశాడు కాని ఆ శబ్దించే వస్తువు కనబడలేదు తరువాత పెద్ద బంతిలా ఉన్న ముడిని విప్పప్రయత్నించాడు కాని ఆ ముడి ఓపట్టాన విడలేదు కాస్త బలం ప్రయోగించేసరికి ముని బాధతో ''అం అం ! మెల్లగా అరరే అలా పీకివెయ్యకు నొప్పిపెడుతున్నది " అన్నాడు ఐతే పులిన్‌బాబు వింటేనా ? నేనువెళ్ళి ఆ మహామునితలను గట్టిగాపట్టుకున్నాను పులిన్‌బాబు ఆ గడ్డాన్ని పీకి ఎలానో ఆ ముడివిప్పాడు అందులో, ఆ ముడిలో మువ్వ కనిపించింది ! వెంటనే పులిన్‌బాబు దాన్ని బయటకు లాగాడు ఆ మువ్వ బంగారంతో చేసిందో, వెండితో చేసిందే లేక మామూలు టిన్నుతో చేసిందో ఎవరమూ గ్రంహించలేక పోయాం బాగా మురికి పట్టి నల్లబడి పోయి ఉన్నది కాని మోగడం మాత్రం భేషుగ్గా ఉంది

పల్టూ మెల్లగా "ఎక్స్‌రేతీసి ఉంటే ఇంతకష్టం రాకపోను, వెంటనే కనిపించిపోయేది '' అని గుసగుసలాడాడు వాడికా ఊహ స్వానుభవంవల్ల కలిగింది లెండి ! రెండేళ్ళ క్రితం ఒక పైసామింగివేశాడు అప్పుడు ఎక్స్‌రేతీసి కనుక్కున్నారు !

దూర్వాసముని దీర్ఘంగా నిట్టూర్చి నింపాదిగా "చివరకు యీ మువ్వ నాగడ్డం ముడిలోనే దొరికింది ! ఔనౌను ! ఇప్పుడు కాస్త — కాస్త గుర్తు కొస్తున్నది ఆముండ — మేనక — దేవలోకపు



"ఇప్పుడేం చేద్దాము తూలకుండా ఉండాలంటే నన్ను నీవు పట్టుకో, నిన్ను నేను పట్టుకుంటాను"

వేశ్య యీ మువ్వ అందిస్తూ ' అతి జాగ్రత్తగా తీసుకుపోవాలి ' అని చెప్పింది దానికి నేను "భయపడనవసరం లేదు జాగ్రత్తగా భద్రపరుస్తాను'' అని యీ ముడిలో పెట్టాను కాని ఆ సంగతి పూర్తిగా మర్చిపోయాను ఇంతకాలమూ నానా అవస్థలూ పడ్డాను చివరకు నా తేజాన్నీ, పౌరుషాన్నీ, శక్తినీ — అన్నిటినీ పోగొట్టుకున్నాను ' అంతా కర్మ ఎవరు తప్పిస్తారు ?'' అని పట్టూవేవు తిరిగి వాని తల నిమురుతూ ''బాబూ ' చిన్నవాడివైనా మహా చురుకైనవాడవు' అఖండమైన తెలివితేట లున్నాయ్ ' ఇదిగో నా ఆశీర్వాదం' నువు తప్పక రాజువు అవుతా ''

మాట పూర్తి కానివ్వకుండా నే నడ్డు పడి "మహాప్రభూ తమ ఆశీర్వాదం ఫలించడానికీ రోజుల్లో ఏమీ ఆస్కారం లేదు రాజులూ చక్రవర్తులూ అయే కాలం అంతమైపోయింది ' ఆ మంత్రి పదవి దొరికేలా కనీసం ఒక ఐదేళ్ళకైనా సుస్థిర మంత్రిత్వం లభించేలా ఆశీర్వదించండి అదే మహా భాగ్యం'' అన్నాను

' సరే ' అలానే ' మంత్రి పదవి లభించేలానే ఆశీర్వదిస్తాను ఐతే రాజులేనిది రాజ్య కార్య కలాపాలెలా సాగుతున్నాయ్ ?''

' ఈ రోజుల్లో సాగుతున్నయ్‌లెండి ' ఆధునిక విజ్ఞానం ఏమంటున్నదంటే కర్త లేకపోయినా సరే క్రియలు మాత్రం చాలా సాఫీగా నడిచిపోతవి అని — '

' భేష్ భేష్ ' చాలా బావుంది ' సరే ' ఇక నేను నా కర్తవ్యాన్ని నిభాయించుకోవడానికి వెళ్తాను ఈ మువ్వ ఎవరిదో

వారి కందించి, నిశ్చింతగా బ్రహ్మలోకం పోతాను''

"ఐతే యీ మువ్వను ఎవరి కంది స్తారు మహామునీ ?'' అన్నాను

"ఏం? భరతచక్రవర్తి ఉత్తరాధికారు లెవరూ లేరా యిప్పుడు ?''

"లేరు మహాత్మా లేరు ' ఎవరూ లేరు ' భరత వంశం అంటే — యుధిష్ఠ రుడూ, పరీక్షిత్తూ, జనమేజయుడూ ఇంకా వాళ్ళ తరాలవారు అంతా కాల గర్భంలో కలిసిపోయారు ' పైగా-నంద, మౌర్య, సుంగ, గుప్త ఆంధ్ర మొద లైన రాజులూ, వాళ్ళ అనంతరం — పరానులూ, ఆంగ్లేయులూ అంతా నాశన మయారు ' ఆఁ ఆఁ ఆంగ్లేయులు నాశనంకాలేదు ' తమ ఛత్రాధిపత్యాన్ని ఒదులుకున్నారు ' ఆ నాటి భరతునిరాజ్యం అంటే భారతవర్షం ఈ నాడు రెండుగా చీలిపోయింది ' మొదటిది — పెద్దభాగం, భారతీయ గణతంత్ర రాజ్యమైంది ' రెండోది — చిన్నభాగం, ఇస్లాం వారి పాకిస్థాన్ అయింది ''

"ఐతే-వీటికి ఎవరైనా రాజు, చక్రి వర్తి అన్నవారున్నారా?''

''లేరు ! ఎవరూ లేరు ' రెండురాజ్యా ౦కూ ఇద్దరు రాష్ట్రపతులున్నారు ఒకరు ఢిల్లీలో ఉంటారు ' రెండోవారు కరాచీలో ఉంటారు ' న్యాయసూత్రాల ప్రకారం వీళ్ళిద్దరే భరతచక్రవర్తి ఉత్త రాధికారు లనుకోవాలి ' ఈ మువ్వమీద వీళ్ళకే హక్కు అనుభవా లుండాలి ' కాని-ఈ యిద్దరిలో దీన్ని ఎవరికిస్తారు ? ఏ ఒకరికిచ్చినా మిగిలినవారు అంతర్జా తీయ న్యాయస్థానంలో తగాదా పెడ తారు ' లేదా అంటే పిడికిలి బిగించి ఉగ్రస్వరంతో 'లడ్‌కే లేంగే భరత్ కా ఝునుఝునా' — అంటే దెబ్బలాడి భర తుని మువ్వ లాక్కుంటాం-అని కేకలు వేస్తారు ''

అది విని దూర్వాసమునీంద్రులు కాసేపు ధ్యానమగ్నులైపోయారు ' తర వాత ఆ మువ్వను 'రప్' మని రెండు ముక్కలుచేసి ''ఇదిగో ' ఈ కంకర రాళ్ళతో ఉన్న గుండ్రనిభాగం ఒకరి కిచ్చివేస్తాను ఇది 'ఝున్-ఝున్' మని వాగుతుంది! ఇక ఈ పైభాగం-కాడలా ఉన్నదే-దీన్ని రెండోవారి కిచ్చివేస్తాను ' దీన్ని వూదితే 'పీఁ-పీఁ' మని మోగు తుంది '' అని చెంబులో వేసుకొని "ఆఁ తోవఖర్చులకు ఓ పదిరూపాయీ లివ్వు ' పోతాను '' అన్నాడు

పులిన్‌బాబు పర్సునుంచి పదిరూపా యీల కాగితంతీసి మహాముని కందిం చాడు








1. అచ్చరకూ ఋషికీ ఉదయించిన కుమరిత ప్రమద్వర,
   ఋష్యాశ్రమసీమల నడయాడే పున్నమి వెన్నెల;
2. రురుడు సుందర యువకుడు — ముని తనయుడు,
   ప్రేమించును ప్రమద్వర నాతడు ప్రాణముగా;




3. చెలుల గలసి వనమున దాగుడుమూతల నాడుచుండగా,
అకాలమృత్యువు విషోరగమై పొడిచెను ప్రమదను;

4. మునితనయుని అశ్రుధారల వేడికి,
కాలధర్ముని కటిక గుండెలు కరిగెను;




5. బ్రతుకును ప్రమద్వర !
ఆయువులో సగమిమ్మనె ధర్ముడు;

6. సగపాలిచ్చెను ప్రాణము ప్రమదకు
నిదుర మేల్కొన్నటుల లేచెను ప్రాణప్రియ;



7. వయసు తరిగి, రూపు మారి,
మోమెటుల జూపగలడు ప్రియురాలికి రురుడు ?

8. అదేమి మహిమో ? ప్రమద్వర కన్నుల కాతడు నవయవ్వనుడే !!
అమ్మృతమునే పన్నీరుగ చిలికించిరి వేల్పులు వారలపై హర్షముతో.

సదాశివ

# ఉర్దూ కవుల ప్రేయసి



నవరసాల్లో శ్రేష్ఠమైంది శృంగారం ఆ రసాన్ని ఉపాసించి సిద్ధిపొందినవారు ఫారిశీ కవులు వారి సూఫీ తత్త్వమూ 'ఇష్కె-హఖీఖీ" అనబడు భగవత్సంబంధమైన ప్రేమ శృంగారరసం శ్రోతస్సులు — మౌలానా రూమీ హాఫిజ్ షీరాజీ, సాదీ, ఉమర్ ఖయ్యామ్ శృంగార రససిద్ధులైన ఫారశీక మహాకవులు ఉర్దూ కవులందరూ వారి అనుయాయులు-వారి వారసులు

అయితే ఈ కవుల శృంగారం కేవలం విప్రలంబమే-మోహ శృంగారం కాదు- వారు ప్రేయసి అంగాంగవర్ణన చేయరు సంయోగాన్ని అభిలషిస్తారేకాని పొందరు

దాన్ని యధాతథంగా వర్ణించరుకూడాను వారు భగవంతుణ్ణీ ప్రేయసీ రూపంగానే ఆరాధిస్తారు-వారి ప్రేయసి సౌందర్యానికి పరమావధి-ఆ సౌందర్యమే సత్తు-అదియే పరమాత్మకూడాను

వారు ప్రేయసిని వర్ణింపరనికాదు కాని ప్రతి అవయవాన్నీ వర్ణింపరు- "సరాపా" అనబడే వారి ప్రేయసి శరీరవర్ణన ఇట్లుంటుంది ఆమె ముఖము చంద్ర సఖము కనులు చషకములు- నర్గిసు పుష్పములవలె విస్ఫారినవి చూపులు వాడి తూపులు - బొమలు ఎక్కు-పెట్టిన ఇండ్లు-పెదవులు గులాబి రేకులు-నోరు సూది బెజ్జమువలె చిన్నది- (అందుకే ఆమె మాటలాడదు)-శిరోజ ములు అతి కుటిలాలు-ఖియామత్ వలె అంతము లేనివి అందు చిక్కు-కొన్న హృదయం ఖియామత్ వరకూ విడి వడదు-మెడ కూజా వంటిది మధ్యము "భావాభావ మధ్యము"-శరీరం సర్వీ చెట్టువలె సమున్నతమూ పూలతీగవలె కోమలమూను-

అయినా ఆమె కఠిన హృదయ, ప్రేమించే వారి పట్ల లవలేశమూ దయా దాక్షిణ్యాలులేని బండ-('సనమ్'' అనగా ప్రియ-అనగా శిలావిగ్రహము) ఆమెతన చేతిలోని చురకత్తితో లోకు లను నరికివేయ గలదు-ఏసు ప్రభువు వలె స్పర్శమాత్రాన బ్రతికింపనూగలదు- ఆమెను ప్రేమించు వారనేకులు—అందరూ మాత్సర్య గ్రస్థులు-ఆ మాత్ర ర్యమూ, అభిమానమూ వదులుకున్న వారికే ఆమె సన్నిధానం లభ్యం-తనకు నచ్చినవారికి ఆమె తనచేత మధువు త్రాగించ గలదు-అప్పుడామె "సాఖీ' చషకములవంటి ఆమె కనులనుచూచియే తన్మయులౌతున్న వారికి ఆమె యిచ్చిన మధువు ఈ లోకస్మృతిలేకుండ చేస్తుంది- ఇహాన్ని పరాన్ని మఱచి తమ్మ తాము మఱచి ఆమెనే చూస్తూ అన్నిటినీ విడచి ఆవశులై వివశులై పోతారు వారు అదియే వారి ముక్తి-అదియేవారి పరమ వాంఛ- జీవితాశయమూను

ఇంకా కొందరేమో ఆమెనుస్మరిస్తూ ఉన్మత్తులై అడవులవెంట తిరుగుతారు మజ్నూ అట్లాంటివాడే ఎవరికైనా ఆమె అప్రాప్య అలభ్య అందని ఆమె అందాన్ని వర్ణిస్తూ పొందజాలని ఆమె సంయోగాన్ని అభిలషిస్తూ విరహ వేద నతో దురపిల్లుటే వారి జీవితము అదియే వారి కవితా వస్తువు

ప్రభాత సమయాన ఉద్యానవన విహారం చేస్తున్న ప్రేయసిని చూసి గులాబిపూల బుగ్గలు సిగ్గుచే ఎర్రపడ్డా యంటా డొక కవి

ఆమె వదనానికి సాటి వస్తామని లీలగా గర్వించినందువల్ల ప్రభాతం- పుష్పాల బుగ్గల్ని మెలిబెట్టింది అందు కని ఎర్రపడ్డా యంటా డింకొకడు



ఆమె ముఖానికి సముఖాన వున్న దీపాన్ని చూచి రెండూ ప్రకాశవంతాలే కనుక అసలు దీపమేదో తెలియక తుమ్మెద విభ్రాంతమై తిరుగుతూన్నది అంటా డొక భావుకుడు

మందమందంగా అలము కొంటూన్న చిరునవ్వు తరగల వలన ఆమె ముఖం నీరెండలో విరుగబూసిన పూలతోటవలె మెరిసిపోతున్న దంటాడు ఇంకొకడు

వెలిగిపోతున్న ముఖంపై కైపుచే ఎఱుపెక్కిన ఆమె కనులు, వెన్నెల రాత్రిలో వికసించిన చెంగలువలవలె ఉన్నా యంటా డొక ఆలంకారికుడు_

ఆమె కన్నుల్లో మధు కలశాలూ, చూపులలో చషకాలూ ఉన్నాయంటాడు ఇంకొకడు_

ఆసవం త్రాగబోయి పానపాత్రను చూచి ఆమె మదిరాక్షసుల్ని స్మరించి ఆ కైపులో త్రాగకుండానే ఒరిగిపోతా డొక రసజ్ఞుడు

ఆమె హావభావ విలాసాలకు చొక్కి-సోలిపోతారు అందరూను ఆమె చూపు ఎటు త్రిప్పితే అటే తిరుగుతాయి అన్ని లోకాలు-తల నరకుటకై ఆమె చురకత్తి యెత్తితే ఆ సుకుమార హస్త సుందర విన్యాసానికి ముగ్ధుడై పారవశ్యమున నిమీలితనేత్రు డవుతాడు ఆసన్నమరణుడు, ఆమెను ప్రేమించిన అపరాధి

ఇలా వుంటుంది ఉర్దూ కవుల ఊహా ప్రేయసి వర్ణన - ఆమె సౌందర్యానికీ సౌకుమార్యానికీ అనురూపాలైన అలంకారాల్నీ మృదు పద సముదాయాన్నీ ఎన్నుకుంటారు వారు వ్యర్థ పదాలు రాకుండా అన్వయ కాఠిన్యం లేకుండా చెప్పదలచింది వాక్యం కాకుండా ధ్వని ప్రధానంగా చెప్తారు వారు ఇటు భోగ లాలసులకూ అటు తత్త్వ జిజ్ఞాసువులకూ పారవశ్యాన్నీ బ్రహ్మానందాన్నీ కలిగించే వారి శృంగార కావ్యాలు రస పిపాసువులందరకూ సమాదరణీయాలు వారి ప్రేయసి అందరకూ ఆరాధనీయ ★

సంశయానికి తావు లేదు
కృతనిశ్చయం కావాలి నేడు
దేశ రక్షణ సన్నాహములో
స్థిర నిశ్చయముతో పాల్గొనండి

ఎంత సెప్పుదు బావ !
నా వింత కబురు
ఎంత తెలుపుదు బావ !
మనసంత దిగులు



ఎంత సెప్పుదమన్న
నోరాడకుంటుంది
వింత లెగుసుకవచ్చి
మన సుబికిపోతుంది
సెప్పి సోలిన కండ్లు
సగ మొరిగి చూస్తాయి ॥ఎంత॥

తలపు నిలుపుల్లో
విరగకే పెరిగింది
చూపు మలపుల్లో
చెదరకే నిలచింది
బొట్టు బొట్టున ఆశ
కడలియై నిండింది ॥ఎంత॥

ఎంత సెప్పిన నీకు
బోధపడకుంటాది
సెప్పకుందామంటె
నిలుపోపకున్నాది
సెప్పి సెప్పక మనసు
కడుతిప్పలౌతాది ॥ఎంత॥

"ఔ"నంటె పూస్తాయి
ముఖమంత తంగెళ్ళు
కాదంటె వాలికింది
కలియబారిన బాము
ఔను కాదని నేను
తప్పించుకొంటుంటె
నిలవేసి బిగదీసి
అడగవస్తావేమి ? ॥ఎంత॥ ★



# భక్తిమదం

## దాసరి సుబ్రహ్మణ్యం

క్రళ్ళు మూసుకుని, మైకంలోవున్న వాడిలా ఊగుతూ పెరికలమ్మ గుడికేసి వచ్చిన గణాచారి నాంచారయ్య, గుడి ముందున్న అల్లంఖాన్ రావిచెట్టు అరుగుకు మోకాలు కొట్టుకుని బోర్లాపడి పోయాడు అప్పుడు తగిలిన దెబ్బతో గాని అతడికి పూర్తిగా మైకం వదిలి స్పృహరాలేదు కిందపడ్డవాడల్లా మోకాలు పట్టుకుని బాధగాలేచి నిలబడుతూ అతడు గుడిలోవున్న పెరికలమ్మ గ్రామదేవత విగ్రహంకేసి ఓక్షణకాలం కళ్ళార్పకుండాచూసి, పిచ్చిపట్టినవాడిలా ఒక్కఎగురున గుడిముందుకెళ్ళి సాష్టాంగపడిపోతూ, "తల్లీ, అమ్మా, పెరికలమ్మా! నీభక్తుడికి ఎన్నిపరీక్షలు పెడుతున్నావ్! ఎంతెంత నీచుల్ని, గ్రామంలో బతకనిస్తున్నావ్! నీ గణాచారి భక్తుడు యిక గ్రామంలో తలఎత్తుకు తిరగటం ఎలా తల్లీ? వాడు . ఆ కామేశం పొట్టచేతబట్టుకుని బడిపంతులుగాబతకటానికి గ్రామం వచ్చినవాడు నిన్నూ, నన్నూ ఆఖరుకు నీ ముద్దుల తమ్ముడు పోతురాజునూ ఎన్నెన్ని తిట్లు తిట్టాడు అమ్మా, నువ్వు వినలేదా . వినలేదా? ఏవిఁటీ వాడికి ప్రాయశ్చిత్తం ఏవిఁటీ " అంటూ తలను గుడి మెట్టుకేసి గట్టిగా కొట్టుకుని సొమ్మసిల్లి పోయాడు

కామేశం అనబడే కామేశ్వర్రావు ఆరునెల్లక్రితం గ్రామంలోని ఎలిమెంటరీ స్కూలుకు టీచరుగావస్తూనే, గ్రామంలో ఎన్నడూలేని అలజడి కలిగించాడు

గ్రామదేవత పెరికలమ్మ కొలుపులకు చందా యివ్వనిరాకరించాడు, కామేశ్వర్రావు కలరా మసూచివస్తే పట్నం నుంచి ఎవర్నో తీసుకువచ్చి, ఇష్టపడిన అయిదుగురు కుర్రాళ్ళకు సూది మందులు వేయించాడు ఆ వ్యాధులకు పెరికలమ్మ కోపం కారణంకాదని ప్రచారంచేశాడు గ్రామదేవతగుడిముందున్న అల్లంఖాన్ రావిచెట్టును గురించి గ్రామంలో అందరూ చెప్పుకునేది వట్టి కట్టుకథ కిందకొట్టి పారేశాడు గణాచారి నాంచారయ్యకు గ్రామదేవత పూనటం అంతా

వట్టి కల్పన అనేవాడు గణం పూనిన ప్పుడు అతడు వేసేకేకలూ, ఆ తరువాత మూర్ఛపోవటం అంతా అతడిలోవున్న భక్తిమదంచేసే పని తప్ప, అందులో గ్రామదేవతకు పాలేమీ లేదన్నాడు

కామేశ్వరరావు ఇలాంటిదుష్ప్రచారం అయిదారు నెల్లకాలంచేసినా, గణాచారి నాంచారయ్యకు అతణ్ణి హతమార్చే ఉపాయం ఏమీదొరకలేదు కాని, హఠాత్తుగా గ్రామదేవత పెరికలమ్మ కరుణ వల్లో లెక, ఆమె ముద్దుల తమ్ముడు పోతురాజు అనుగ్రహంవల్లో, పొలాలు కాపలాకాసుకు బతికే చుండు భీముడివల్ల అతడికి కామేశ్వరరావును సాధించటానికి అవసరం అయిన గొప్ప రహస్యం తెలిసిపోయింది

కిందటి రాత్రి కామేశ్వరరావూ, మున సబుగారి ఏకైక పుత్రిక, బాలవితంతువు లక్ష్మీపెరికలమ్మ, అల్లం ఖాన్ రావి వెనుకచేరి మాట్లాడుకోవటం ఆ మార్గాన వస్తున్న చుండు భీముడి కంటపడింది

ఈ చుండు భీముడూ, గణాచారి నాంచారయ్య ఆజన్మ మిత్రులు ఇద్దరూ బ్రహ్మచారులే పోతే భీముడు పెళ్ళి మాత్రం చేసుకోని బ్రహ్మచారి, గణాచారి నాంచారయ్య ప్రతి ఆడదానినీ పెరికలమ్మ దేవతగా చూసే అస్ఖలిత బ్రహ్మచారి

చుండు భీముడు కనిపెట్టిన రహస్యం ఆదేరాత్రి తెల్లవారుఝామున కోళ్ళు కూసేవేళనాంచారయ్యకుతెలిసిపోయింది

" ఇది యితరులు నమ్మటం మాట



అట్టావుంచి, నేనే నమ్మలేకుండా వున్నారా, భీముడూ! మునసబు కూతురు మరెవరెవరోకాదు, సాక్షాత్తూ పెరికలమ్మవారి వరాన పుట్టిన పిల్ల ఆసంగతి నాకు బాగాతెలుసు, '' అన్నాడు నాంచారయ్య

చుండు భీముడికి ముందు నవ్వొగింది కాదు, తరవాత కోపంకూడా వచ్చింది " అయితే, నేనుచూసింది పోతురాజూ మరెవరన్నా పిల్లా అంటావా, నాంచారయ్యా? '' అని అడిగాడు వాడు

''కళ్ళు పోతాయిరా భీముడూ నూరుగురు గ్రామదేవతలకు పోతురాజొక్కడే తమ్ముడు, హనుమంతుడిలా ఆజన్మ బ్రహ్మచారి నీ నెత్తణుస్తాడు నాలుకస్వాధీనంలో పెట్టుకో,'' అంటూ నాంచారయ్య భీముణ్ణి కసిరాడు

''మరయితే నేనిక నిన్ను నమ్మించటం ఎట్టా? నాదే పొరపాటేమో లే బొంత చుక్కడి కాపుసారా త్రాగిన మైకంలో ఏ పిశాచాలనో చూసాను " అనేశాడు భీముడు

ఈసారి గణాచారి నాంచారయ్య రౌద్రాకారం దాల్చాడు " బొంత చుక్కడు కాసిన కాపుసారా ఎలా తాగానంటావ్? వాడు నాలుగు నెల్లగా జైల్లో వున్నాడుకదా? పిశాచాలు అమ్మవారి గుడికేసి రావటానికి ఎన్నిగుండెలుండాలి?గుడిముందు కాపలావున్న పోతురాజు విగ్రహం, వట్టి రాతి విగ్రహం అనుకున్నావా? "

''నీకోదణ్ణం, నాంచారయ్యా నా దారిననన్నుపోనీ బుద్ధితక్కువై స్నేహితుడవని యీసంగతి నీకు చెప్పొచ్చాను గ్రామదేవతని పట్టుకుని నానామాటలూ అనే కామేశం పంతుల్ని, గ్రామదేవతే ఎప్పుడో నెత్తిఅణుస్తుందన్నావు గనుక, ఆడుచేసే పాడుపనులు నీకు చెప్పాను సరే, పోతా, '' అంటూ చుండుభీముడు బాణాకర్ర చేతికి తీసుకుని, భుజాన పెట్టుకుని బయలుదేరాడు

గణాచారి నాంచారయ్య బుర్రలో తాటాకు టపాకాయొకటి పేలింది వాడి నెత్తి అణిచేందుకే పెరికలమ్మ, తన వరకుమారిద్వారా, ఆ కామేశాన్ని తన గుడికేసి లాక్కుంటున్నదేమో అన్న అనుమానం అతడికి కలిగింది కాని గ్రామదేవత చేస్తున్న యీ పనివల్ల మునసబు మానమర్యాదలు అల్లరిపాలై పోతవే అన్న భయం అతణ్ణి పట్టుకున్నది అయినా, మనం ఎవరం? దేవత తనను దూషించేవాళ్ళను ఎక్కడ ఏవిధంగా నెత్తణచాలో మనం చెప్పేపాటి వాళ్ళమా? అని మనస్సును సరిపెట్టుకున్నాడు, నాంచారయ్య

'' ఒక్కమాట, ఆగరా భీముడూ! '' అంటూ నాంచారయ్య వేసిన కేకకు, ఆగమేగాలమీద బయలుదేరిన భీముడు వెనుదిరిగి, విసుక్కుంటూ నాంచారయ్య

దగ్గిరకొచ్చి, భుజాన్నుంచి బాణాకర్ర దించకుండానే నిలబడ్డాడు

"మన గ్రామదేవత పెరికలమ్మ సత్తెంలో నీకేమన్నా అపనమ్మకం ఏరా భీముడూ?'' అని అడిగాడు నాంచారయ్య

"ఆసంగతి ఆ దేవత గణాచారివి నీకు తెలియాల,' అన్నాడు భీముడు మొండికెత్తిన ముఖంపెట్టి

నాంచారయ్య నిండుగా నవ్వేశాడు తరవాత భీముణ్ణి సమీపించి, వాడి భుజంమీదినుంచి బాణాకర్ర లాక్కుని కిందపడవేస్తూ, "అమ్మవారి గుడి ముందు పెరిగిన పెద్దరావిచెట్టు ఏంటో, దానికతా అదీనీకు తెలుసుగదా? కామేశంగాణ్ణి పెరికలమ్మ ఏ చీకటిరాత్రో గావుపట్టు పట్టేస్తుంది నీవు ఆరావి చెట్టుదగ్గిర చూసింది సత్తెం అని నాకు తెలీక, ఏదో మాట్లాడానని అనుకోకు గ్రామదేవతమీద నీ నమ్మకం ఎంతో కనుక్కునేందుకలా మాట్లాడాను వచ్చి నచిక్కేటంటే, లక్ష్మీ పెరికలమ్మను కాపాడటంఎలా? మునసబుగుట్టు ఊరి కెక్కకుండా చెయ్యడంఎలా? అదీ సంగతి,'' అన్నాడు నాంచారయ్య

''అదంతా గణాచారివి నువ్వుచూసు కోవాల్సింది '' అన్నాడు భీముడు

ఈసారి నాంచారయ్య గొంతెత్తి, మెడ మెలికలు తిప్పుతూ నవ్వేశాడు చండుభీముడు ఆశ్చర్యంగా అతడికేసి చూస్తూ "ఏంటి గణాచారీ! నన్నేం ఎర్రోడికింద కట్టావా ఏం?" అన్నాడు

"మనమంతా ఎర్రోళ్ళమేరా భీముడూ, పెరికలమ్మ దేవత ఒక్కత్తే తెలివిగలది అల్లంఖాన్ గుర్రం దిక్కుండానే గుడితలుపులు కొట్టి, 'ఏవేఁ ఏవేఁ పెరికినీ, చుట్టకాల్చుకో వాలి నుప్పివ్వు.' అంటే దేవత ఏం చేసింది? 'ఇదుగో, అల్లం సాయిబూ నిప్పు, అందుకో.' అంటూ తలుపులు తెరిచి, తన నిజస్వరూపం చూపెట్టింది ఆదెబ్బతో సాయిబు ఒక గావుకేకపెట్టి, గుర్రంమీంచి కిందపడి భొళుక్ భొళుక్ మంటూ నెత్తురుకక్కి చచ్చూరు కున్నాడు ఆచోటనేగదా, రావిమొక్క మొలిచి అంత మహావృక్షమైంది," అన్నాడు నాంచారయ్య

''లోకమంతా ఎరిగున్న యీసంగతి నాకెందుకు చెపుతున్నావ్ నాంచారయ్యా?'' అని అడిగాడు భీముడు అనుమానంగా

''ఆదేకనుక్కోరా భీముడూ నీ బుర్ర వుపయోగించి చూడు – ఉహుఁ మర్మంతెలియలా? అయితే నేనే విడమర్చి చెపుతా విను కామేశంగాడికీ అలాంటిచావే రాబోతున్నది అదీ సంగతి " అన్నాడు నాంచారయ్య

''దేవతే ఆపని చేస్తుందంటావ్, అంతేనా?'' అన్నాడు భీముడు

" దేవత చెయ్యక మనంచేస్తామా? మనవేఁమన్నా గొంతులుకోసేవాళ్ళమా? ఏవిఁటామాటలు, భీముడూ? మతేమన్నా పోయిందా" అంటూ నాంచారయ్య కళ్ళెఱ్ఱచేశాడు

" సరే, అదీచూద్దాం, నాంచారయ్యా జరగబొయ్యే మేలో కీడో గ్రామదేవత కన్నా తెలియాలి, లేకపోతే ఆరివల్లి గణాచారికన్నా తెలియాలి ' అన్నాడు భీముడు, గొంతులో ఎక్కడలేని భయం పలికిస్తూ

'" అలా అన్నావ్ బాగుంది ఇక వెళ్ళిరా భీముడూ " అన్నాడు నాంచారయ్య

భీముడు వీధిమలుపు తిరగ్గానే నాంచారయ్య ఆదరా బాదరా మునసబు యింటి కెళ్ళి ఆయన్ని మంచంమీదవాణ్ణి మంచం మీదే లేపి, వీధిలోకి తీసుకువచ్చి, రచ్చ బండమీద కూచోబెట్టి " మునసబూ ఊరుకు చేటుకాలం వచ్చేట్టున్నది, " అనేశాడు

" ఏం మళ్ళీ పెద్దమ్మవారు లాంటిది ఏమన్నా గ్రామం ప్రవేశిస్తున్నదా నాంచారయ్యా? ' అని అడిగాను మునసబు ఆదుర్దాగా

" ఓఁ దానికెంతక్కువ ఆర్నెల్ల నాడే గ్రామంలో పెద్దమ్మవారూ చిన్నమ్మవారూ మహమ్మారీ అన్నీ కలిసి, జట్టుగా ప్రవేశించినై గ్రామదేవత గణాచారినైన నన్ను ఆక్రమించకుండా కామేశం పంతులు అందరి దగ్గిరా ఎలా నవ్వులపాలు చేస్తున్నాడో నీకు తెలుసుగదా? నేను గణం పూనటం, గ్రామదేవత నాకు కనిపించటం అంతా కపటనాటకం అని చెబుతున్నాడు నేనేదో భక్తి మదంతో కళ్ళు పొరలు కప్పి తిరుగుతున్నానట - తెలుసా? " అన్నాడు నాంచారయ్య

" కామేశ్వర్రావును మనం ఏంచేయగలం? అతణ్ణి గ్రామంలోనుంచి వెళ్ళ కొట్టటం మనచేతులోవున్న పనికాదు " అన్నాడు మునసబు

' అలా చేద్దామని నేననటంలేదు ఆపనే గ్రామదేవత పెరికలమ్మతల్లే చూసుకుంటున్నది అలా యిష్టంలేకపోతే తనభక్తులు ఆ కార్యం పూర్తిచేసేట్టు ప్రోత్సహిస్తుంది అదీ దగ్గర పడింది రాత్రి కలలో కనిపించి సర్వం చెప్పేసింది పోతే చిన్న ఒక్క చిక్కు వచ్చి పడింది, " అంటూ నాంచారయ్య గుటకలు వేశాడు

" ఏంటది నాంచారయ్యా? " అన్నాడు మునసబు అనుమానంగా

" ఊళ్ళో అందరికీ ఆఖరికి అంటూ సొంటూలేని ముండలకూడా తెలిసిపోయింది ఆ కామేశం, మన గ్రామదేవత పెరికలమ్మ వరపుత్రి లక్ష్మిపెరికలమ్మ "

మునసబు ముఖంలో కనిపించిన బాధ సంకోచంచూసి నాంచారయ్య



"రాంగ్ సైడ్ పోతున్నది సార్ !"

మాట మధ్యలోనే ఆగిపోయాడు మున సబు ఓ క్షణకాలం తలవంచుకు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, వినీ వినబడని స్వరంతో, "ఎవరేం చెప్పుకుంటున్నారో నావరకూ వచ్చింది నాంచారయ్యా తల్లిలేనిపిల్ల, ఒక్కగానొక్క కూతురు ఆ కామేశం అయినా అంత చెడ్డవాడు కాడేమో వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారేమో అని నా అనుమానం ఏదైనా, యిది నా గొంతుక్కు ఉరి ఒకవైపున కన్న కూతురు రెండోవైపున వంశగౌరవం, అపకీర్తి నాకు మతిపోతున్నది నాంచారయ్యా '' అన్నాడు మునసబు మూలుగుతున్నట్టు

నాంచారయ్య చిరునవ్వు నవ్వుతూ, "ఆపిల్ల, దేవికి మొక్కుకున్న తరవాతనేగదా, నీకుపుట్టింది? అంటే ఎప్పుడూ పెరికలమ్మవారి అభయం ఆపిల్లకుంటుందన్న మాటేగా? ఏదోముఖ్యమైన అవసరంలేందే, అమ్మాయిని కావాలని అమ్మవారు విధవరాలిని చేస్తుందని నువ్వనుకుంటున్నావా? ఆ అవసరం ఏమిటోకూడా అమ్మతల్లి నాకు యీ మధ్యనేచెప్పింది నా తరువాత అమ్మాయి గ్రామానికి గణాచారి కాబోతున్నది ఎంత అదృష్టం" అన్నాడు నాంచారయ్య

మునసబు పెదాలు కదిపాడు గాని మాట పెగలకి తికమకపడిపోయాడు నాంచారయ్య తల అడ్డంగా తిప్పుతూ ప్చ్ ప్చ్ అని చప్పరించేసి, "అన్నీ మనమంచికే మునసబూ నామాటనమ్ము నువ్వు చేయవలసిందల్లా ఒక చిన్నపని అది గ్రామానికీ నీకూ, నాకూ, లక్ష్మి

పెరికిలమ్మకూ — అందరికీ మేలు చేస్తుంది. '' అన్నాడు నాంచారయ్య

"ఏమిటా చిన్న పని ?'' అన్నాడు మునసబు ముఖం చిట్లించి

'' ఒక్క వందరూపాయలు చేత బెట్టి, చుండు భీముణ్ణి గ్రామం వదిలి పొమ్మను మరాన్నెల్లవరకూ, వాడు యీ ప్రాంతాల ఎక్కడా ముఖం చూప కూడదు అమ్మాయి యివాళరాత్రి ఇల్లు కదలకుండా కట్టుదిట్టంచెయ్యి అమ్మాయి చీర ఒకటీ, రవికె ఒకటీ నాకు యిప్పించు తరవాత నువ్వు నిశ్చితంగా కూచో, " అన్నాడు నాంచారయ్య

మునసబు కీ మాటలు చాలా ఆశ్చర్యం కలిగించినై నాంచారయ్య కళ్ళ ల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ, '' ఏవిఁటి ఇదంతా, నాంచారయ్యా?''అని ప్రశ్నించా డాయన

'' ఆ నాస్తికుణ్ణి అంటుకుని, పెరికలమ్మతల్లి, తన చేతుల్నిగాని, తమ్ముడు పోతురాజు చేతుల్నిగాని అపవిత్రం చేయదలచుకోలేదు మనం ఆమె నుంచి ఎన్ని సహాయాలు పొందాం? అవసరం కలిగినప్పుడు ఆవిడకు సహాయం చేయ వలసిన బాధ్యత మనమీదవుంది అర్ధమైందా? కాకపోయినా మునిగిపో యిందేమీలేదు నేను చెప్పినట్టుచెయ్యి నిశ్చితంగా కూచో, '' అన్నాడు నాంచారయ్య

రెండు మూడు నిమిషాలు గడిచినా, మునసబునుంచి జవాబు లేకపోవడంతో, గణాచారి నాంచారయ్య రచ్చబండమీంచి లేస్తూ '' సరే, వస్తాను చెప్పిదంతా గుర్తుందిగదా? '' అంటూ ఇంటికి బయలుదేరాడు దారిలో వీధిమలుపున కామేశ్వర్రావు, నలుగురు కుర్రాళ్ళతో కాలవకి స్నానానికి వెళుతూ, నాంచారయ్యకు ఎదురయ్యాడు నాంచారయ్య పక్కకు తప్పుకోవాలని చూస్తే, దారికి అడ్డంవచ్చి నిలవేసి, "ఏం, గణాచారీ, ఏవిఁటి విశేషాలు? నీ పెరికలమ్మ దేవత ఎన్నడూ స్నానం చేసినట్టు కనబడదే? నాతో పంపుతావా ఏం? కాలవలో జలకాలాడించి, అంత మునిల్చి కాకపోతే కాస్త రాచక్రీడ రుచిచూపిస్తాను,'' అన్నాడు

గణాచారి నాంచారయ్యకు అరికాలి మంట నెత్తికెక్కింది బూతుల పంచాగం విప్పాడు కామేశ్వర్రావు కాస్సేపు చిరునవ్వుతో ఆ బూతుల్ని భరించి, తన తోటివాళ్ళకేసి తిరిగి, " నే చెప్పలేద టోయ్, గణాచారికి భక్తిమందం ఎక్కి కళ్ళు పొరలుగమ్మినై అని, " అంటూ నాంచారయ్య భుజం పట్టుకుని ప్రక్కకు తోసి చరచరా వెళ్ళిపోయాడు నాంచారయ్య పెద్దవీధివెంట అరుస్తూ, శాపనార్ధాలు పెడుతూ సరాసరి పెరికలమ్మవారి గుడికివచ్చి, తలను గుడి

మెట్టుకేసి కొట్టుకుని సొమ్మసిల్లి పోయాడు.

మర్నాడు భళ్లున తెలవారుతూనే కామేశ్వర్రావు శవం పెరికలమ్మ గుడి ముందు గ్రామస్థులకు కనిపించింది గుడితలుపులు బార్లా తెరచివున్నవి గుడిముందు కామేశ్వర్రావు బోర్లాపడి వున్నాడు వీపులోనుంచి గుండెలోకి దూసుకుపోయిన పెద్దబరిసె ఒకటి, ఇంకా శరీరాన్ని అంటిపెట్టుకునే వుంది గుడి బయటవున్న పోతురాజు విగ్రహం దగ్గిర్నుంచి, గుడిలోవున్న పెరికలమ్మ విగ్రహం వరకూ నెత్తురు ఏకధారగా పడివున్నది పోతురాజు చేతులూ, పెదాలూ నెత్తురుతో ఎర్రబారివున్నవి

పట్నంనుంచి పోలీసులు దిగారు గ్రామంలో రచ్చబండదగ్గర గణాచారి నాంచారయ్యను గ్రామదేవత పెరికలమ్మ ఆవేశించి, తను అల్లంఖాన్‌ను ఎలా చంపి, వాడిరక్తంతో రావిచెట్టును మొలిపించిందో చెప్పి, కామేశ్వర్రావు రక్తంతో తడిసిన ఒక వేపవిత్తు అక్కడ మరో మహావృక్షం కాబోతున్నదని, ఆ చెట్టు మంద వాకిట్లో కట్టుకున్న వాళ్లె వరికీ, ఎలాంటి ఆపదలూ కలగవని అభయం యిస్తున్నది

చుండు భీముడు గ్రామ పొలిమేరల్లో ఎక్కడాలేడు ఇంటినుంచి పెరికలమ్మ గుడిదగ్గిరకు బయలుదేరిన మునసబు వీధివాకిలి దగ్గిరకు వేయబోయి, దొడ్లో బావిదగ్గిర ఏదో పెద్ద చప్పుడు అవటంతో వెనుదిరిగి, అక్కడికి వెళ్లాడు బావి అంచున అతడికి ఒకే ఒక తిరగలి కల్లు కనిపించింది బావిలోనుంచి తప తపమని శబ్దం వినిపించింది మునసబు బావిలోకి తొంగిచూద్దా మనుకున్నాడు, గుండె చాలలేదు ఉన్నచోటునే రాయిలా అయిపోయి, "అమ్మా, లక్ష్మీ" అని ఒక్క గావుకేక పెట్టాడు

పాపం లక్ష్మి పెరికలమ్మకు తంద్రంటే వల్లమాలిన ప్రేమ బహుశా తండ్రిచేసిన ఆర్తనాదం ఆవిడకు వినబడే వుంటుంది లేకపోతే బావి అడుగున ప్రాణభయంతో కంపించిపోతూ, ఊపిరాడక తన్నుకుంటూ, 'అయ్యా' అని మూలిగి మెడకు కట్టుకున్న తిరగలి కల్లును పైకి ఎత్తేందుకు ఆవిడ ప్రయత్నించివుండదు ★

# మీరు పొదుపుచేసిన సొమ్మే
# మన దేశావసరాలకి అవసరం

# ఊహాతీతులు

డి. హనుమంతరావు.

క్రొంద రేపనిచేసినా అంతరార్థం అద్దంలో చూపెట్టినట్టు చాలా స్పష్టంగా తెలిసిపోతుంది కొందరి విషయంలో అలాకాదు మెదడు నెంత యిబ్బంది పెట్టినా పని జరగదు స్త్రీ హృదయమనేది యీ రెండో తరగతికి చెందుతుందని కొంతమంది పెద్దమనుషుల అభిప్రాయం

ఓ నీరెండల సాయంకాలం ఆ కవరు అందుకున్నాక రావుకి తాత్కాలికంగానైనా ఆ అభిప్రాయంతో ఏకీభవించక తప్పలేదు

"రావుగారికి

వచ్చే ఆదివారం సాయంకాలం చెరువు గట్టుమీదికి ఒకసారి రండి ఆరుగంటలకి టీస్టాల్ ప్రాంతంలో మీ కోసం యెదురుచూస్తుంటాను

మంజుల "

అక్షరాలు చూడ్డానికి ముచ్చటగా ఉన్నాయిగాని రావుకంతా మాయగా ఉంది పదిహేను నయాపైసలు ఖర్చుబెట్టి అంత చిన్న ఉత్తరం రాయడం చాలా అరుదు ఆ రెండులైన్లూ పాతిక ముప్పైసార్లు చదివాడు నెహ్రూ నగర్‌లో బుధవారం ముద్రపడింది ఆ రోజు లక్ష్మివారం

లక్ష్మివారానికి ఆదివారానికిమధ్య వేరు చేస్తూ నిలిచిన అఘాతంలాంటి మూడు రోజులూ క్షణమొక యుగంలా గడిచాయి

చివరి కెలాగయితేనేం ఆదివారమూ వచ్చింది సాయంకాలమూ వచ్చింది

ఆరుగంటలవేళ

నెమ్మదిగా అడుగులువేస్తూ, టీ స్టాల్ చేరాడు అప్పటికింకా మంజుల రాలేదు రెండు బస్‌లు మారాలేమో, అనుకున్నటైంకి రావడం తేలికగాదు. పావుగంటపోయాక, ఎనిమిదో నెంబరు బస్ రెండో అంతస్థులోంచి మంజుల మెల్లిగా దిగింది

మంజుల చాలా అందమైన అమ్మాయి లందర్లాగానే ఉంటుంది మామూలుగానిది ఏమన్నా ఉంటే - ఆ చిన్న మొగంమీద గుండ్రంగా నుదుటంతా నిండేట్టు దిద్దిన బొట్టు ఒకటే పచ్చని ఒళ్ళు, లేత నీలం సిల్కుచీర, మొగాన యీ యెర్రని బొట్టు ఒత్తుగా నల్లని జుట్టు, - కదిలే పంచరంగుల చిత్రంలా, అందరిచూపుల్ని

ఆకట్టేస్తుంది మనసు లోపలి చీకటి గుహల్ని వెతుకుతున్నట్టుండే ఆ చూపులు సాధారణంగా ఎవర్నీ చూడవు- యెంతసేపూ గాలిలోకో, నేలమీదికో తప్పించి చూస్తే అవతలివాడికి గొంతు తడబడి మాటలు పొరబడతాయి

రావుని చూడగానే ఆమె చూపుల్ని నేలమించి దూరాన నీళ్ళమీదికి తిప్పింది మొగంలో నవ్వు కాంతి లీలగా మెరిసింది

మామూలుమాటలేవో అయాక రోడ్డు దాటి పేవ్‌మెంటుమీద సిమెంటు సోఫాలో కూలబడ్డా రిద్దరూ

"ఆయనకి మీరంటే యెంతో గురి!' ఆమె అంది

''గురియేమిటి లెండి' మీ తర్వాత నేనంటే కొద్దిగా అభిమానం అంతే!"

''అలా అనకండి మీ మాట కెంతో విలువిస్తారు నేనంటే యీ మధ్య అసలు బొత్తిగా పొసగడంలేదు!" ఆమె కళ్ళు తడబడ్తూ అటూయిటూ కదిలాయి

"నాతో చాలాసార్లు మీ గురించి చాలా యిదిగా చెప్పాడు'"

''అవన్నీ పాతమాటలు యిప్పుడు నాతో మాట్లాడ్డమే బాధ అన్నట్టు కన బడతారు'"

ప్రణయకలహాల్లో మూడో మనిషి జోరబడ్డం అనేది, కొన్ని ప్రత్యేక పరి స్థితుల్లో తప్పించి తెలివనిపించుకోదు రావు కేం మాట్లాడాలో తట్టలేదు

''మొన్న ఒక ఉత్తరం కూడా రాశారు కొంతకాలం, మళ్ళీ చెప్పే దాకా కలుసుకోవద్దని యెందుకో నా కర్థంగాదు''

అసలు, మీరేం అనుకోనంటే ఓ మాట చెప్తాను - యీ ఆర్టిస్టులనేవాళ్ళు యెప్పుడూ యింతే అదోలా ఉంటారు ఎప్పు డేం చేస్తారో వాళ్ళకే తెలియదు పిచ్చి ఆవేశ మెక్కువ '

"నేనూ ఒక ఆర్టిస్టునన్నమాట మర్చి పోతున్నట్టున్నారు'" మంజుల నవ్వింది

"అందుకే, ముందుగా చెప్పాను, మీ రేం అనుకోగూడదని''

"యిందులో అనుకోడాని కేముంది రెండిగాని ఆయన సంగతే' పోనీ, నా తప్పేమన్నా ఉంటే చెప్పవచ్చుగా!''

''అసలు పట్టించుకోనట్టు మాట్లాడ కూరుకోండి వారంరోజుల్లో వాడే దిగి వస్తాడు, నన్నడిగితే యిలాంటి వాళ్ళ కదే మందు '

మంజుల నీళ్ల మధ్య రాళ్ళకేసి చూస్తూ కాసేపు మాట్లాడలెదు

"యెడబాటంటే యెదలో ముల్లు - అన్నా రెవరో యెడబాటు విరహాగ్నిని రగిల్చి ఎలాంటివాళ్ళనైనా అతికి పారే స్తుంది యిటువంటి పరిస్థితుల్లో దానికి మించిందిలేదు'''

''మొత్తానికి ప్రేమ కథకు లనిపించు కున్నారు'" మంజులత మాషాగా నవ్వింది

"నేను చెప్పింది నిజంగాదంటూరా?"

''అదిగాదు, పట్టించుకోనట్టు ఊరుకో గలిగితే గొడవే లేదు ఊరుకోలేను గాబట్టే, మీదగ్గరకి రావడం''

"నన్నేంచెయ్యమంటారు చెప్పండి!"

''మీ రొకసారి, అసలు గొడవేమిటో తెలుసుకోండి మీ దగ్గిర ఆయనేమీ దాచరు వీలయితే ''

''వీలయితే?"

"వీలయితే ఆయన మనసు మార్చ డానికి ప్రయత్నించండి మీ మాట కాదనరు ''

"వాడికన్న మీరే యెక్కువ విలువ యిస్తున్నట్టుంది'"

మంజుల మాట్లాడలేదు యింకేం చెప్పలేనన్నట్టు జాలిగా చూసింది ఎవరైనా ఆపదలోఉండి కాపాడమన్నప్పుడు వీలైన సహాయం చెయ్యడం మంచి వాళ్ళలక్షణం ఒక అందమైన అమ్మాయి, అందులోనూ, మంజుల అడిగినప్పుడు కాదనడం రావుకి చేతగాదు

"తప్పకుండా అడుగుతాను మీ మన సింత బాధపెట్టాడంటే నాకు చాలా కష్టంగా ఉంది అదేమిటో తేల్చుకుంటా నుండండి "

"దయచేసి అంత కోపంగా ఆయన దగ్గరేం అనకండి అసలే చాలాసున్నితం యింక అస్తమానం యిదే ఆలోచించి మనసు పాడుచేసుకుంటారు "

రావుకి నవ్వొచ్చింది యిద్దరూ ఒక మూసలో బొమ్మలే కాస్త అటుదిటైతే సహించలేరు

"మనం మళ్ళీ యెప్పుడు కలుసు కుందాం?"

"మీ యిష్టం, మీ రాయనతో మాట్లా డ్డానికి యెప్పుడు వీలవుతుంది?"

"వీలవడాని కేముంది? యిప్పుడింకా ఏడు కాలేదు యింటిదగ్గరే ఉంటాడు పోయిరానా?"

''వద్దులెండి యిలాంటివేళ చికాగ్గా ఉంటారు ప్రొద్దున్న వెళ్ళడం మంచిది "

"వాడిమొహం' వాడికీ, నాకూ చికా కేమిటి' లోకువగా ఉన్నవాళ్ళమీద ఎగిరి పడ్డం-అంతే'"

"అలా అనకండి " మంజుల మొగం అదోలా ఉంది రావు ధోరణి నచ్చి నట్టులేదు

"సరే, అయితే, రేపు సాయంకాలం యిక్కడే కలుసుకుందాం యీ లోపల నేను వాడితో మాట్లాడతాను "

"మిమ్మల్ని మధ్యలో యిబ్బంది పెట్టాను, ఏమనుకోకండి నే నున్న పరి స్థితిలో తప్పిందిగాదు "

"యిందులో యిబ్బంది కేముంది లెండి అది సరేగాని, రేపు ఎగ్జిబిషన్‌కి మీరేం పంపడంలేదా?"

"ఏం పంపను చెప్పండి పాతవి నాకే బాగున్నట్టు అనిపించడంలేదు

కొత్తగా ఏమన్నా గీయాలంటే మనసు కుదరడంలేదు ”

రావు నవ్వాడు ఆమె కళ్ళలోకి చూసి "యింతమాత్రానికే అలా అయిపోతే యెలా చెప్పండి!''

మంజుల సిగ్గుపడి తల దించుకుంది

*　　　*　　　*

ఆమర్నా డుదయం యెనిమిది గంటలకి రామ్మోహన్ గదిలో,

"ఏమిట్రా నీ బాధ?" గోడమూలకేసి చూస్తున్న రామ్మోహన్ నడిగాడు రావు

"బాధ యేముంది, ఏం లేదు ''

''మరి అలా ఒక్కడివీ యిరవై నాలుగ్గంటలూ గదిలో పాతుకుపోతావేం?''

రామ్మోహన్ మాట్లాడలేదు

"మంజులనికూడా రావొద్దన్నావట!"

"మంజుల చెప్పిందా?''

"ఆమె చెప్పకపోతే తెలియదేమిటి?"

''తెలియక నేం లే, అంతా నువ్వే ఊహించుకుంటావు!''

"నిజమేనా?''

"మంజుల నొక్కతెనే రావొద్దన్నది''

''ఆమేం పాపం చేసింది ''

'ఇంకో ఊర్వశి కనిపించిందా?''

''అందరూ నీ కథల్లో అబ్బాయిల్లాంటి వాళ్లే అనుకోకు అదేం గాదు!"

''మరి?''

"ఏమిటి మరి'?''

"ఆమెని కనబడ వద్దనడ మెందుకు?"

"బలే వాడివి!" గట్టిగా నవ్వాడు రామ్మోహన్ ''

రావు కర్థం గాలేదు

''నే నొకటి తలపెట్టాను దానికి మంజుల అడ్డమనిపించింది కొంతకాలం యిక్కడికి రావద్దన్నది అందుకే అంత కన్నా యింకేం లేదు"

''మళ్ళీ యేమన్నా గీస్తున్నావా?'

''ఎగ్జిబిషన్ కొకటి గీద్దామని ఉంది ఇందులో ఒకదాన్ని పారిస్ పంపిస్తారు ఆ అంతర్జాతీయ ప్రదర్శనలో పాల్గొంటే చాలు, బహుమతి రానక్కర్లేదు అందుకని కొంచెం జాగ్రత్తగా గీయా లనుకుంటున్నాను ఇది ఆమెతో చెప్పడానికి నే నంటే కొద్దిగా వేళాకోళం, నవ్వుతుంది '' రామ్మోహన్ కొద్దికొద్దిగా కలాలోకంలోకి వెళ్ళిపోతున్నాడు మాట్లాడుతూ యీ లోకానికి దూరంగా యెక్కడికో వెళ్ళిపోవడం రామ్మోహన్ ప్రత్యేకత

"ఏం గీద్దా మనుకుంటున్నావు? లాండ్ స్కేపా? పోర్ట్రైటా?"

''రెండూ కాదు, రెండూ అవును ''

''నీ భాష బాగుందిగాని కొంచెం అర్థమయ్యేట్టు చెప్పు "

"నేను గీసేది యీ రెండు తరగతులకీ చెందదు, కాని యీ రెంటి లక్ష్యాన్నీ సాధిస్తుంది ''

రావు యింక వినడమేగాని మాట్లాడ్డం తనపని గాదన్నట్టు కూర్చొన్నాడు

''ఒక అద్భుతమూర్తి పోర్ట్రెట్ అది కాని ఆమె రూపం అందులో కనబడదు అందులో ఒక లాండ్ స్కేప్ లాంటిది గీయబడుంటుంది దాన్ని చూడగానే, చూసినవాడి సంస్కారాన్నిబట్టి ఆమె బొమ్మ మెదడ్లో మెదులుతుంది '' రామ్మోహన్ ఆగాడు - రావు కర్థమౌతోందో లేదో అన్నట్లు కళ్ళలోకి తేరిపార జూస్తూ

''ఇంకా వివరంగా చెబుతాను విను నీ కందులో కనబడేది ఒకగది గోడలు శిథిలాల్లా ఉంటాయి ఎదురుగా ఒక కిటికీ ఊచల కవతల అందంగా ప్రకృతి దృశ్యం—లోయలు వాగు యెత్తైన చెట్లు గదిలో కిటికీ కెదురుగా కుర్చీ ఆ కుర్చీ మీద మెరుస్తూ బాగా ఖరీదైన దనిపించే చీర ఒకటి అప్పుడే విడిచినట్టు అడ్డదిడ్డంగా మడతలు పడుంటుంది కొసలు నేలమీద జీరాడుతుంటాయి అంతే అంతకన్నా యింకేంకనబడదు అందులో

నీ కేం తట్తోంది? రామ్మోహన్ కళ్ళలో కాంతి రెట్టింపయింది కాసేపాగి మొదలెట్టాడు

"ఆ చీరని చూడగానే, అంతచక్కని చీర కట్టడానికి తగిన ఆమె యెవరో ఒక అందాల రాకుమారి నీలో రూపు దిద్దుకుంటుంది ఆమె ఉండే పరిస్థితులు బాగా లేవు కాని ఆ చీర నలా విసిరి వదిలేయడంలో ఒక రీవి దర్జా కనబడతాయి అది ఆమె పడకగది కిటికీ బయట ఆ సుందర దృశ్యం రకరకాల వేళల్లో రకరకాల రూపాలుదిద్దుకొని ఆమె కళ్ళెదుట నిలుస్తుంది అసలలా చూడాలనే ఆమె పడక అక్కడ యేర్పాటు చేసుకుంది ఆ కొండల మధ్య సూర్యుడు యెర్రగా ఉదయించి ఆ వాగుని రక్తపు టేరు చేస్తాడు పున్నమి చందమామ ఆ సెల అలలకి వెండి పూత యిస్తుంది ఆ దృశ్యాలు ఆమెని ఉన్నత భావాంచలాల తేలించి దూరాన ఏవో ఆనందపుటంచుల్ని చేర్చి మురిపిస్తుంటే, తన్ను తాను మరచిన తన్మయత్వంలో ఆమె గంటల ఒంబడి ఆ చీకటిగదిలో నగ్నంగా నిలబడి సౌందర్యారాధనలో సోలిపోతుంది ఆమె యెవరు? యెలా ఉంటుంది? ఊహించుకో గలవా '' రామ్మోహన్ ఆగాడు

''ఆ బొమ్మకి జీవం ఆ చీర ఆ చిరలో వెలుగు, కాంతి నింపితేనే ఆ చిత్రానికి ప్రాణం వస్తుంది అందుకు నీ హృదయంలో ఆమె సాక్షాత్కరించాలి ఆమెని ప్రతీ క్షణం నీ ఆలోచనల్లో చూడగలగాలి ఆమెతో మాట్లాడాలి ఆమె నర్థం చేసుకోవాలి "

ఆ ప్రవాహంలో మధ్య ఒకసారి రావు నిట్టూర్చాడు

''అర్థమైందనుకుంటాను ఆమెని నా ఊహల్లో నిలుపుకోడానికే మంజులని కొంతకాలం దూరంగా ఉండమన్నది

మంజుల నెదురుగాచూస్తూయింకెవరిమీదా దృష్టి నిలపలేను ... అందుకే, కొంచెం బాధపడ్డా దూరంగా ఉంచడం మంచిదని పించింది. యిదేమిటో తేలాక ఆమెకి వివరంగా చెప్పి బతిమాలుకోవచ్చు. ఏమంటావు ?''

రావు మాట్లాడలేదు కాసేపు. చివరికి అడిగాడు.

"అంతా బాగానే ఉందిగాని, యిదామెకి స్పష్టంగాచెప్పితే సరిపోయేదిగా !"

"చెప్తే అర్థం చేసుకుంటుందా ? వాద నకి దిగుతుంది.''

"ఆమెకూడా ఆర్టిస్టేగా : అర్థంకా కే మౌతుంది ?''

''అర్థంచేసుకోలేదని గాదు ; యిదే యింకొకరెవరన్నా అయితే వాళ్ళమీద గౌరవంకొద్దీ అర్థంచేసుకోవచ్చు. నేనవ గానే నవ్వి పారేస్తుంది..ఎందుకొచ్చింది? మహా అయితే, ఒకనెల పడుతుందేమో, అంతే !"

రావు, తర్వాత ఏదో పిచ్చాపాటీ మాట్లాడి వచ్చేశాడు.

* * *

మర్నాడు సాయంకాలం నమ్మకంగా అంతా విడమర్చి చెప్పాడు రావు. కాని మంజుల కర్థమయినట్టు తోచలేదు, పైగా బాధ యెక్కువయినట్టుంది.

"వాడి ధోరణిచూ స్తే యింకేం చెప్పినా వినేట్టు కనబడలేదు.''



"ఆయన అంతేలెండి, పట్టుదల మనిషి."

"నేనొకటి చెబుతాను; వింటారా?"

"ఏమిటి?"

"మీరూ గీయండి. వాడికెంతమాత్రం తీసిపోరని ఋజువుచేసుకోండి. అప్పుడు గాని అతగాడికి మీ గురించి సరిగా ఆలోచించడం చేతగాదు!"

మంజుల మాట్లాడలేదు. మంజుల మనసులో తుఫాను రేగుతోందని, ఆ సద్దణిగాక మిగిలిన ప్రశాంతిలో ఆమె యిదివరకటి మనిషిగాలేదని రావుకి తెలుసు.

"యిప్పుడతని ఉద్దేశ్యం అతని ఊహాలోకాల యెత్తుల్ని మీ రందుకోలేరని. అంతకన్నా యెక్కువగా మీరు మీ ప్రజ్ఞ ప్రదర్శించిననాడుగాని అతని భావాలు మారవు."

"ఏం చెయ్యమంటారు, చెప్పండి."

"అతనికన్నా ఉత్తమ భావాల్ని రంగుల్లో మలచండి. ప్రదర్శించండి... మీకూ నేర్పూ, నైపుణ్యం ఉన్నాయి. నాకుతెలుసు, వాటిని బయటకి తీసుకురండి. పట్టుదల ఉంటే సాధించ లేనిది లేదు."

"నాకంతా ఏమిటో అనుమానంగా భయంగా ఉంది."

"మీకే అనుమానమూ, భయమూ అక్కర్లేదు. మీకు చేతనైనంత సహాయం చెయ్యడానికి నేనున్నాను. పూర్తి విశ్వాసంతో ప్రయత్నించండి."

ఆమెకలా భరోసా యిస్తుంటే రావుకి చాలా తృప్తిగా, ఆనందంగా ఉంది.

ఆక్షణంలోనే కాదు; ఆతర్వాత యించుమించు నెలా –

రామ్మోహన్ గది నాలుగు గోడలకి అంకితమయి యేంచేశాడో, యేమయ్యాడో యిద్దరూ పట్టించుకోలేదు; బాగా సన్నిహితులయ్యారు.

ఆ నెలలో మంజుల నాలుగు గీసింది. ఆ నాలుగింటికి రావుని పేర్లు పెట్టమంది.

కథలకి, చిత్రాలకి పేర్లు పెట్టడంలో రావుకి అసమానమైన ప్రజ్ఞవుంది. ఆ ప్రజ్ఞ యీ నాటిది గాదు – కాలేజీలో అమ్మాయిలకి, మేష్టర్లకి పేర్లు పెట్టిన నాటిది!

ఒకదాంటో కనబడేది కొండవాలు, దానిమీద అక్కడక్కడ మోడు చెట్లు. ఆ మోడుచెట్లని ఆకుల్లేవుగాని; పూలని విపరీతంగా తొడిగాయి – "ఆశాపీడితు" లన్నాడు రావు దాన్ని.

"వంకర గీతలు" అని పేరు పెట్టిం దాంట్లో కనబడేది కూలి చాలక మాడే కార్మికుల్లాంటి వాళ్ళు ఎందరోకలిసి ఓ పెద్ద మోకుని లాగడం.

కదల్లేని కారుని యెద్దులులాగే దృశ్యం పేరు "మూగబాధ."

అసలేదీ, ఏమైందీ తెలియకుండా

అలుక్కు పోయినట్టు రంగులు పులిమిన దానికి "విలయం" అని పేరు పెట్టాడు

బొమ్మలు గీయడం పూర్తయాక రావు మంజులని మూర్తిగారికి పరిచయం చేశాడు మూర్తిగారు చిత్రకళలో ప్రావీణ్యం కలవాడే కాకుండా బాగా ప్రసిద్ధికెక్కినవాడు కళగురించి ఆయనకి తెలిసినంతగా యింకెవరికీ తెలియదని చాలామందికి నమ్మకం

మూర్తిగారు కూతురుకి రావుకన్నా మంచి అబ్బాయి దొరకదని కొంత కాలంగా అనుకుంటున్నారు

ఒక సెలవురోజున రావు మంజులని, చిత్రాలని ఆయనికి చూపెట్టాడు

ఆయన ఆ చిత్రాలని మెచ్చుకొని ఊరుకోలేదు, మంజులకే తట్టని, తెలియని ఎన్నో మెరుగుల్ని ఆ రంగుల కలయికలోంచి, భావల్లోంచి యెత్తి చూపాడు ఆ తర్వాత ఆయనే తీసికెళ్ళి అబ్బాస్, బషీర్, శామ్యూల్ యింకా ఊర్లో యితర కళాకోవిదులందరికీ చూపించి వాటిలోని విశిష్టతని విపులీకరించాడు వాళ్ళందరూ మంజుల కళానైపుణ్యాన్ని, నేర్పుని మెచ్చుకున్నారు

ఆ రోజుల్లో యెన్నిసార్లో మంజుల రావుకి కృతజ్ఞత లందజేసుకుంది, యింక యెన్నటికీ అతని ఋణం తీర్చుకోలేనంది అతని సహకారం తోడ్పాటు లేకపోతే, ఆమెలో అంతటి ప్రావీణ్యం ఉన్నట్టు ఆమెకే తెలియదేమో ।



రావు కా నెల చాలా ఉల్లాసంగాఉంది మంజుల తిరవిచ్చిన గులాబిలా ఉంటుంది అంతకు ముందు ఆమె రామ్మోహన్ వంక చూసినప్పుడల్లా గుండెలో ముళ్ళు గుచ్చుతున్నట్టుండేది ఇప్పుడింక మంజుల అతన్నించి దూరంగా జరిగినట్టే—తన వైపు: రావు తృప్తికి పరిమితిలేదు

* * *

ప్రదర్శన మొదలయింది

ఎన్నో ఊర్లనుంచి ఎందరో కళాకారులు ప్రదర్శనలో పాల్గొన్నారు

రామ్మోహన్ చిత్రం—'రసమయి'—ప్రదర్శన కొచ్చింది దాని భావం ఒకరు పక్కన నిలబడి చెబితేనేగాని యెవరికీ అర్థమయినట్టు లేదు అంతగా కష్టపడి చెబితే, చప్పరించిన వారు కొందరు, పెదవి విరిచిన వారు కొందరు

మొత్తాని కా ప్రదర్శనలో ఉత్తమ బహుమతి 'విలయం' అన్నదానికి వచ్చింది గీసినది, ప్రఖ్యాత చిత్రకారిణి కుమారి మంజుల మంత్రిగా రెవరో, కుమారి మంజులని పది నిమిషాలు పొగిడి బంగారు పతకం అందజేశారు ఆమె చిత్రం పారిస్ అంతర్జాతీయ ప్రదర్శనలో పాల్గొంటుందని ప్రకటించబడింది

రావు ఉత్సాహానికి పట్టపగ్గాల్లేవు తొందరగా మంజులని సమీపించాడు

మంజుల మొగంలో రక్తం చింది, కందినట్టుంది ఆ మొగంలో నవ్వులేదు రావు కర్థం గాలేదు

"ఇది మీరు తీసుకోండి" బంగారు పతకాన్ని రావు చేతిలో పెట్టి పిలిచినా వినకుండా గబగబా వెళ్ళిపోయింది మంజుల

అంతే ఆ తర్వాత ఆమెని పలుసు కోడం పడలేదు

"ఈ ఆర్టిస్టు లనేవాళ్ళు యెప్పుడూ యింతే ఎప్పు డేం చేస్తారో వాళ్ళకే తెలియదు" అంటాడు రావు యిప్పటికీ ★

సర్వసన్నద్ధులమై వుండాలంటే
శక్తివంచన లేకుండా కృషిచేయాలి.

# రాత్రి 12 గంటలకి



నిద్రపట్టని రాత్రిపై నడిచి నడిచి
రెప్పల్ని నిరీక్షణతో కత్తిరిస్తూ
కోర్కెల్ని పల్లేరుకాయల్లా చల్లి
నిశిలాంటి పెదాలమీద నిప్పుల్తో
సరసమాడుతున్నవాడు

ఆ గంట
ఎవరికీ జంటదొరకని గంట
ఎవరికెవరూకాని దారంట
నిద్రలేమి సూదుల తుప్పల వెంట
కళ్ళమీద, ఊళ్ళో తలుపులమీద
నిఘావుంచి
కన్నీళ్ళపై కత్తుల పహరావేసి
ఆలోచనల తోడేళ్ళని కసిదీరా
దూరంగా తోలేసి
ఒంటినిండా సర్పపరిష్వంగం
అనుభవిస్తున్నవాడు
మేలుకునే వుండి
పలువరిస్తున్నాడు —

---

కేశవరావ్




'కౌసల్య తనయ, శ్రీరామ, కౌస్తుభాంగా తూర్పున భానుడుదయించె తోయజాక్షా, దేవ సంబంధ కార్యాలను దీర్చుకోగ వేడుకొందుము, మేలుకో శ్రీ వెంకటేశా.'

ఎంతటి మధుర రచన! కవి జన్మ తరించిపోయింది!

''లేవయ్య శ్రీహరి, గోవింద లెమ్ము నిదురా, కళ్యాణ మొనరించ వేగ కమలనయనా, ప్రొద్దెక్క

నున్న దటుచూడ భుజగశయనా, వేగలేవయ్యా మముబ్రోవ వెంకటేశా!''

శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం చెవుల సోకుతూనే మెలకువ వచ్చింది కమలాకరరావుకు. 'అప్పుడే కుముదినీదేవి లేచినట్లుంది?' అనుకొంటూ అలాగే కళ్ళుతెరవకుండా బద్ధకంగా పడుకున్నాడు

"మధుకైటభారి శ్రీహరి ప్రక్కనుండి
ఎల్లలోకముల గన్న మాతల్లి లక్ష్మి, ఆశ్రిత
మానవుల సదా ఆదరించ అలివేలు మంగమ్మ
యిక మేలుకొమ్మా."



నాగస్వరానికి మైమరచి వింటూన్న నాగుబాములాగా పడుకున్న కమలాకరం యేమో జ్ఞాపకం రాగా ఒక్కసారి త్రుళ్ళి పడి లేచాడు. చిరునవ్వు చిందులాడే ముఖం కోపంతో అరుణిమ దాల్చింది. నైట్ డ్రెస్‌తోనే గబగబా బయటకు నడిచాడు.

"బ్రహ్మాది దేవతలందరు భక్తిమీర సురగురూత్తమునివెంట తరలినేడూ, నీ దివ్యరూపంబుగానగ నిలచినారు, శీఘ్రముగ లేవయ్య శ్రీనివాసా...''

పూజా మందిరంలో యిరువైపుల శ్రీ లక్ష్మీ పద్మావతులతో శ్రీనివాసుడు ఆవునేతి దీపాలమధ్య దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. చంపక, పారిజాతాలతో ఆ భగవద్విగ్రహాల పాద పూజ చేస్తూ కుముదిని తదేకధ్యానంతో పరవశమై పాడుతోంది మేలుకొలుపు.

'కమలాలు వికసించు కాలమాయే, నానా సుగంధ కుసుమాలు నవ్వెనవిగో, పక్షుల గుంపుల తీయనిపాట వినగ వేగ లేవయ్య నిదుర వెంకటేశా !'

గానం ముగించుతూనే కుముదిని నీరాజనం వెలిగించి, జేగంట వాయించింది. భక్తిశ్రద్ధలతో పూజాకుంకుమ నొసట ధరించి, దైవపాదాలపై పవిత్రతనందిన రెండు పుష్పాలు తీసి వేణిలో తురుము కొంది అవనతనేత్రియై నమస్కరించి, అక్షతలు చేతబట్టి ప్రదక్షిణ చెయ్యడానికుపక్రమించింది. ప్రథమ ప్రదక్షిణ చేస్తూనే వులిక్కిపడి యేదో అపరాధం చేసినట్టు రెండడుగులు వెనక్కు వేసి త్రాన్పడిపోయింది కుముదిని. నేలచూపులుచూస్తూ నిల్చున్న కుముదినిని అలా రెప్ప వాల్చకుండా రెండు నిముషాలు చూచాడు కమలాకరం. బిగ్గరగా నవ్వుతూ చప్పట్లు చరిచి, "హాట్సాఫ్ కుముదం. చాలా బాగుంది గానం" అంటూ వచ్చినంత వేగంగానూ వెనుదిరిగి వెళ్ళిపోయాడు. భయసంకోచాలతో నేత్రాలను విపరీతంగా కదలించడంతప్ప నోరువిప్పి మాట్లాడలేకపోయింది కుముదిని. అడుగు ముందుకు కదల్చలేకపోయింది. అలా స్థాణువై ఎంతసేపు నిల్చుందో తనకే తెలియలేదు.

''పూజ అయిందామ్మా ?" వెంకటచలం దొడ్లోంచి లోపలికివస్తూ గడప అవతల నిల్చున్నాడు. గాలిపటమై ఎగురుతూన్న కుముదినీదేవి మనస్సు మామగారి ప్రశ్నకు త్వరగా దిగివచ్చి శరీరంలో లీనమైంది. ''అయ్యిందండి'', మెల్లగా సమాధానమిచ్చి హారతి పళ్ళెరం ఎత్తి ఆయన కభిముఖంగా పట్టుకుంది. వెంకటచలం భక్తిగా కర్పూరహారతి కళ్ళకద్దుకున్నాడు. కుముదిని యిచ్చిన ప్రసాదం ఆప్యాయంగాఅందుకుంటూ, ''ముఖమలా చిన్నబోయిందేవమ్మా ? వాడేమన్నా అన్నాడేమిటి ?" అన్నాడు కోడలిముఖం పరిశీలనగా చూస్తూ.

"లేదండి." ప్రయత్న పూర్వకంగా పెదవులపైకి చిరునవ్వు తెచ్చుకుంది.

"హూ(!" నిట్టూర్చాడు వెంకటచలం." "అంటే మాత్రం నువ్వుచెప్తావా? అయినా వాడి కదేంపాడుగుణమో?" అనుకొంటూ మెల్లగా వెళ్ళిపోయాడు.

కుముదిని వెళ్ళేసరికి గదిలో కాలు గాలిన పిల్లిలాగా పచార్లు చేస్తున్నాడు కమలాకరం. తెచ్చిన కాఫీ ఫలహారాలు బల్లమీద వుంచుతూ "తీసుకోండి." అంది మెల్లగా. పచారుఆపుజేసి తీక్షణంగా చూచాడు కమలాకరం. కుముదిని తల వాల్చింది. అలా కొన్ని క్షణాలు బరువుగా దొర్లిపోయాయి.

"కాఫీ చల్లారి పోతోంది." అంది కుముదిని మెల్లగా.

"కాఫీ చల్లారి పోతోంది!" హేళనగా, నిర్లక్ష్యంగా రెట్టించాడు. "నా వుత్సాహమే చల్లారిపోతోంది నిన్ను చూచిన కొలదీ."

కుముదిని మాట్లాడకుండా టేబుల్ క్లాత్, పేపర్ వెయిట్లూ సర్దసాగింది.

"అయితే నా కయిష్టమైన పనులు చెయ్యడమే నీకిష్టమా?" తీక్షణంగా ప్రశ్నించాడు. "అమ్మవారిలాగా ఆ పట్టు చీరలేమిటి? ముసలమ్మలాగా ఆ పూజలెందుకు? ఇవ్వాళ అటో యిటో తేల్చెయ్య దల్చుకున్నాను." బలంకొలదీ ఎదుటి టీపాయ్‌ని కాలితో తన్నాడు. అది నాలుగు దొర్లులు దొర్లి, కప్పూ సాసరూ తునాతునకలై పోయాయి. కాఫీ ఫలహారాలు నేల పరమయ్యాయి.

"మీరు నిద్ర లేవకముందే నా కార్యక్రమం పూర్తి చేసుకుంటున్నానుకదా? అయినా యింతరాద్ధాంతం దేనికీ? ఇప్పుడు మీ కేంలోటు జరిగిందనీ?" తగ్గుస్వరంలో ప్రశ్నించింది కుముదిని.

"లోటు కాదు కుముదం, బాధ! నాకీ పద్ధతు లిష్టంలేదనిచెప్తే నువ్వెందుకు విన్పించుకోవు?" సూటిగా భార్యముఖం లోకి చూచాడు.

"............"

"చేసే పనులు మానవు. అడిగితే ఈ మూగనోము. అలాకూర్చో. నీతోమాట్లాడాలి." కుర్చీ కుముదినికి దగ్గరగా జరిపాడు. కుముదిని ముఖం యిబ్బందిగా పెట్టింది. "తెలియనట్టు ప్రొద్దున్నే పనివేళ యిలా మంకుపట్టు పడితే ఎలా?"

"నాకంటే, నామాటకంటె ఎక్కువా నీకాపనులు? ఇంకా యింట్లో మనుషులున్నారులే పనులు చెయ్యడానికి. ఈ విషయం యిప్పుడే తేలాలి," జబ్బపట్టుకుని బలవంతంగా కుర్చీలో కూలేశాడు.

"ఆ ప్రాణంలేని బొమ్మలలో ఏముందని ఆరాధిస్తావ్? ఎలాగుంటాడు దేవుడు? ఎప్పుడైనా కన్పించాడా? నీ కోరి కేదైనా తీర్చాడా?" అక్షరంఅక్షరంలోనూ ద్యోతకమౌతున్న ఆ హేళనాహంకారాలను వింటూ యిక సహించలేక పోయింది కుముదిని. "ఒకటేమిటి? అనేక కోరికలు

తీర్చాడు. ఇంత సంతోషంగా బ్రతుకుతున్నామంటే ఆ దైవకృపకాక మరేమిటి? తేనె ఎలా గుంటుంది? తియ్యగా రుచిగా వుంటుంది. ఆ తీపీ, రుచీ ఎలా గున్నాయనిచెప్తే అర్థమౌతాయి? అటువంటివి అనుభవ పూర్వకంగా తెలియాలే కాని చెప్తే అర్థమవవు. మన కర్థంకానివి అసంబద్ధాలూ, అసంగతాలూ కావు.''

''అబ్బో, చాలదూరం పోయావు! అయితే నువ్వే మహాభక్తురాలవు; నేను అర్థంకాని మూర్ఖుడిసీ నన్నమాట?''

"అనవసరంగా వాగ్వాదం పెంచి ఒకటికి పది అర్థాలు తీస్తున్నారు. ఊహ వచ్చిన నాటినుంచీ నేను పూజించి ఆరాధించే దైవాన్ని ఈనాడు కేవలం మీకు నమ్మకంలేదు గనుక తృణీకరించాలా? నిరంకుశచక్రవర్తు లుండేవారని చిన్నప్పుడు చరిత్రలో చదువుకున్నాం. ఇక వాళ్ళకూ, ఈ ఆధునిక యుగంలో వున్న మనకూ తేడా ఏమిటి?''

''ఆహాహా, ఏం వుపన్యాసం? చదువుకున్న భార్య ననిపించావ్!''

"అనిపించకే అలా మాట్లాడి అధికారం చెలాయించగలుతున్నారు.''' అంటూ లేచిపోయి బయటకు నడిచింది పొగలు గ్రక్కుతూన్న భర్త దృక్కుల నుండి తప్పించుకుంటూ.

వంటింట్లోకివెళ్ళి తిరిగి కాఫీ కలుపుతూంటే ''ఇంతకు ముందు తీసుకెళ్ళిన దేమైంది?'' అనడిగింది అత్తగారు.

ఒక్కక్షణం ఆలోచించి ''చెయ్యిజారి పోయింది.'' అంది కుముదిని.

''ఏం అంత వదులు చేతులా?''

సమాధానం చెప్పకుండానే వెళ్ళిపోయింది కుముదిని.

కిటికీగుండా బయటి తోటనుచూస్తూ నిల్చున్నాడు కమలాకరం. పచ్చ చామంతుల పసుపునలదుకొని, ఎర్రగులాబీల తిలకం దిద్దుకుని, రంగురంగుల నీలి గోరింట రవిక, ఆకుపచ్చని చీర ధరించి నిల్చిన ధరణీకాంత ఉదయ భాస్కరుని కిచ్చే పరిమళ స్వాగతానికి శుక పిక శారి కాదుల కలకల స్వనాలు అనుబంధ వాయిద్యా లయ్యాయి. అప్పుడే ఎవరు మేలుకొలిపారో రంగు రంగుల సీతాకోక చిలుకలు పువ్వు పువ్వునూ పలుకరిస్తున్నాయి. వర్షాగమనం సూచిస్తూ అసంఖ్యాకమైన తూనీగలు ఆకాశంలో వలయాలు చుట్టుతున్నాయి వృక్షాలు వయ్యారంగా నాట్యంచేస్తూ మలయ మారుతాన్ని సృష్టిస్తున్నాయి. ఉషస్సు ప్రాతఃకాలంగా మారుతోంది. ఆ ముగ్ధ ప్రకృతి సౌందర్యాన్ని తిలకించిన కుముదిని హృదయం ఉల్లాసంతో పరవళ్ళు త్రొక్కింది.

కమలాకరానికి దగ్గరగావస్తూ "దేవుడు లేకపోతే ఈ చరాచర జీవరాసులన్నిటినీ యింత నియమబద్ధంగా నడిపించుతూన్న దెవరంటారు?" అంది కుముదిని!

వెనక్కు తిరిగాడు కమలాకరం. "ఏడీ? ఆ నడిపించుతూన్న వాడెక్క-

నిల్చుంది. సావిత్రి ఒక్కసారి కోడల్ని నఖశిఖపర్యంతమూ పరీక్షగా చూచి "అబ్బాయి అలా కోపంగా వున్నాడేం?" అనడిగింది. కుముదిని మౌనంగా తల వాల్చి నిల్చుంది.

"రెండుసార్లు తీసుకెళ్ళికూడ మొగుడి చేత కాఫీ త్రాగించలేకపోయావు?"

అప్పటికీ మాట్లాడలేదు కుముదినీదేవి.

"ఇంతకూ ఏం జరిగిందంటే మాట్లాడ వేమిటి? వాడి మట్టుకు వాడు రుసరుస లాడ్తూ వెళ్ళిపోయాడు. నిన్నడిగితే మూగనోము. వాడికి కన్నతల్లిని, నీకు అత్తగారిని, ఆ మాత్రం వినదగిన అర్హత లేదూ నాకు?"

సజల నేత్రాలు పైకెత్తింది కుముదిని. "వినదగిన అర్హతావుంది; సబబు చెప్ప దగిన సమర్థతా వుంది. కాని అలా చెయ్యరు. అంతేగా?'' నిష్ఠురమాడింది కుముదిని.

"వూఁ." బరువుగా మూలిగింది సావిత్రి. ''అయితే పాతపాటే నన్న మాట! పోనీ వాడికిష్టంలేని పనులెందుకూ చెయ్యటం? మానెయ్యరాదూ?"

"అత్తయ్యా!" నిర్ఘాంత పోయింది కుముదిని. దైవపూజ మానమని పెద్దలు మీరు చెప్పవచ్చా?''

"పెద్దరికాలు, చిన్నరికాలు జ్ఞాపక మున్న యిల్లైతే పరిస్థితు లింతవరకు ఎందుకొచ్చేవి? నా మాట త్రోసేసి నిన్ను పెళ్ళి చేసుకున్ననాడే నాసమర్థత నమసి పోయింది."

శూలాలకుమల్లే తగిలిన ఆ మాటలకు యిక అక్కడ నిలువలేక పోయింది కుముదిని. తలిదండ్రులమాట వినకుండా కుముదిని పట్టుబట్టి కొడుకు పెళ్ళిచేసు కున్నాడని సావిత్రికి కోపం. 'ఏమ్మే పాసైన దొరసానిగారు!' ఇదీ ఆ అత్త గారి పరిభాషలో కోడలి నామధేయం. ఆమె అయిష్టతనూ, కోపాన్నీ అలా అనేక రూపాలలో వ్యక్తీకరిస్తుంటుంది.

మధ్యాహ్నం కమలాకరం భోజనానికి రాలేదు. కారణం కుముదిని గ్రహించింది. 'ఆకలిగా లే'దంటూ ఆమెకూడా భోజనం మానేసింది. దానితో సావిత్రమ్మ సాధిం పులు చెలరేగాయి. ఇంట్లో చిన్నా పెద్దా అందరికీ విషయం తెలిసిపోయింది. వెంకటచలం భోజనంచేసి లేస్తూ ''కాస్త నా గదిలోకి మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా." అన్నాడు కోడలి నుద్దేశించి.

మంచినీళ్ళిచ్చి వస్తూన్న కోగలి నాపు జేశాడు వెంకటచలం. ''చూడమ్మాయ్. నేను పెద్దవాడిని; యిలా చెప్పవలసిన ఖర్మ వచ్చింది. ఏమీ అనుకోకు. ఒక మాట చెప్తాను."

''మీ మాట మీద నాకు చాలా గౌరవం. చెప్పండి." నమ్రతగా జవాబిచ్చింది కుముదిని.

''అందుకే చెప్పటానికింత బాధపడ్తు న్నాను.'' కొంచం సేపాగి మళ్ళీ ప్రారం

ఖించాడు. "మనగమ్యం మనకుతెల్సు. ఆ గమ్యం చేరటానికి ఒక బాటపై నడుస్తూంటే మధ్యలో యే క్రూరజంతువో, దుష్టజనులో అడ్డువస్తే తప్పనిసరిగా ఆ బాటపై మన ప్రయాణాన్ని తాత్కాలికంగా మానుకోవాలి. కాని అది తాత్కాలికం మాత్రమే. స్వల్పకాలంలోనే ఆ ఆటంకాలు తీరిపోతాయి. మనగమ్యాన్ని చేరుకోగల్గుతాము. లేదా మరో బాట వుండకపోదు."

భావగర్భితమైన ఆ మాటలోని సూచనను అర్థం జేసుకో ప్రయత్నిస్తూ తలెత్తి చూచింది కుముదిని.

తిరిగి వెంకటచలం ప్రారంభించాడు. "నామాట నీకు సరిగా అర్థం కానట్లుంది. పసివాళ్ళు మూడు రకాలు. ఒకరకంవాళ్లు అమాయకంగా యితరుల్ని అనుసరిస్తారు; నల్గురితో కలసిపోగలరు; వారివల్ల బాధ లేదు. ఇక జడ పదార్థరకాన్ని ఏ విధంగానూ మార్చలేము. వాళ్ళ వుపయోగమూ లేదు - హానీలేదు. ఏదో మూగగా, నీరసంగా బ్రతికేస్తారు. ఇక మూడోరకం వున్నారే తెలిసీ తెలియని మూర్ఖులు. మిడి మిడి జ్ఞానాలతో మిడిసిపడ్తూ వాళ్లూ బాధపడ్తారు, ఇతరుల్నీ బాధపెడ్తాడు. వాళ్ళనే మనం ప్రయత్నపూర్వకంగా మార్చవలసి వుంటుంది. వయస్సుకు పెద్దవాళ్లైనా భావపరిపక్వత, సంఘటనలను సమన్వయ పరచుకు సరిపెట్టుకుపోయే సమర్థతా లేనివాళ్ళుకూడా ఆ పసిమూర్ఖులలోనే జమ. అటువంటివాడికి వాడి విలువ వాడికే తెలియదు. ఇక యితరుల విలువేం తెలుస్తుంది? మరొకరి ఆధిక్యాన్నెట్లా భరించగలడు? తెలియని ఆ విలువను బలవంతంగా తెలియపరచ ప్రయత్నించడం అవివేకం. అందువల్ల మరింత మొండికెత్తిపోతాడు. తాత్కాలికంగా కష్టమే అయినా మనమూ వాడి దారినే నడచి, అనునయంగా - దృష్టాంతరాలతో బోధించాలి. అది ఒక్కసారిగా సాధ్యంకాదు. కొంతకాల పరిపక్వత అవసరం. అనుభవాలు నేర్పినంతగా తర్కవాదాలు మంచిని బోధించలేవు."

గ్రహించినట్లు తల పంకించింది కుముదిని. 'కడకు ఈ సలహా యిచ్చారా మామగారూ?' అన్నట్లున్నాయిజలపూరిత నేత్రాలనుండి వెలువడ్తూన్న చూపులు.

"అంతకంటె మార్గంలేదమ్మా! మంచి అలవాట్లు బోధించడంపోయి మానుకొమ్మని సలహాయివ్వవలసి వచ్చింది. ఇదొకవింత అనుభవం." బాధగా తల దించుకున్నాడు వెంకటచలం,

తన గదిలోకి వచ్చేసి తీవ్రంగా తర్కించుకుంది తనలో తను కుముదిని. 'భర్తచే విసిగించుకొని, అత్తగారిచేత అనిపించుకొని, మామగారి బోధలు వినడంకంటె - యిందరి దృష్టిలో పెంకెగా కన్పించడంకంటె-నాలో నేను బాధ పడితేనే మంచిదేమో! బాధ అయినా తప్పదుమరి!' కడకు మామ



"చూశావా నాన్నా ! నీ ముందునుంచి పోవాలిగదా అని అమ్మ అక్కయ్య చీరె కట్టుకుపోతూ వుంది "

గారి సూచనే ఆచరణయోగ్యంగా కన్పిం చింది. తనలో 'తన పూజలలో యేదో దోషముంది. అందుకే భగవంతుడలా దూరం చేస్తున్నాడు తనను. అందుకే యిటువంటి నాస్తిక వాదిని భర్తగా సమ కూర్చాడు. కాపురానికొచ్చిన నాటినుండీ యించుమించుగా ప్రతిరోజూ జరుగుతోందీ రభస. అదే యివ్వాళ కాస్త పెద్ద మోతా దులో పడింది. అసలు వివాహం నాటి నుండీ కమలాకరం ప్రవర్తన అలాగే వుంది, విడ్డూరంగా. 'తలంబ్రాలు పోయ డానికి చంటిపిల్లలమా ?' అంటూ మండి పడ్డాడు పెళ్ళిపీటలమీదే ; మానేశారు. 'బొమ్మల పెళ్ళి కా'దంటూ వూరేగింపుకు అభ్యంతరం చెప్పాడు ; అమ్మ విలవిల లాడింది. పెళ్లి జరిగిన మరునాటి ఉద యం నూతన దంపతులను దేవాల యానికి తీసుకువెళ్ళి మ్రొక్కించడానికి కుముదిని తండ్రిచేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమయ్యాయి. 'ఆ రాతి విగ్రహాలకు మ్రొక్కడేమిటి ? అనవసరం' అన్నాడు కమలాకరం. బంధువర్గమంతా ఆశ్చర్య పోయి, ఈ నాస్తికుడినిగూర్చి పలు రకాల చెప్పుకొంటూంటే విద్యా వంతుడూ - సౌందర్యవంతుడూ అయిన భర్తచుట్టూ మనసున నిర్మించుకొన్న ఊహానందభవనపు పునాదులు కదలి పోయినట్లైంది కుముదినికి. ఇకనుండీ తన జీవనలత పెనవేసుకు పోవలసిన ఆ వ్యక్తి నాస్తికుడూ, నిర్మోహమాటస్థుడూ అని

తెలిసి నిలువునా గజగజ లాడిపోయింది కుముదిని తనూలత.

కాని అతడి సాహచర్యం ఆమె భావించినట్లుగా గ్రీష్మతాపంవలెలేదు. అతడి నవ్వులో వెల్లివిరిసే ఆహ్లాదతా, చూపులలో తొణికిసలాడే మార్దవం, మాటలలోని మరులుగొలిపే మధురత్వం కుముదినిని తాత్కాలికంగా ప్రపంచాన్ని మరపింప జేశాయి కాని ప్రభాతకాలపు హిమబిందువు ఆయుఃపరిమాణంవలె, అనతికాలంలోనే ఆమె ఆనందంకూడ అల్పమైనదని తెలిపోయింది. అత్త వారింట అడుగెట్టగానే ఆమె దినచర్య కమాలాకరాని కపగతమైంది. ఆరంభంలో అనుసయంతో, తర్వాత నిష్ఠురంగా, ఆపైన బలవంతంగా, భార్యలోని ఆస్తిక తత్వాన్ని నిర్మూలింప జూచాడు కమలాకరం. తన తర్కవాదనలతో, బలీయమైన దృష్టాంతరాలతో భర్తనాస్తికత్వాన్ని రూపుమాప ప్రయత్నించింది కుముదిని. ఫలితంగా వాదోపవాదాలధికమై అనురాగం అదృశ్యమైంది. చినికి చినికి కడకు ఈ రోజు గాలివానగా మారింది ఎంత ఆలోచించినా భర్తయొక్క ఈ మూర్ఖత్వానికి కారణ మూహించలేక పోయింది కుముదిని పోనీ అత్తగార్ని అడుగుదామంటే ఆమెకు ఆదిలోనే చుక్కెదురు కోడలంటే తన విద్యావినయ సౌందర్యాలతో, అంతకంటె అధికకట్నమిస్తామన్న సంబంధం మానుకొనేట్టు చేసి కమలాకరాన్ని కట్టేసిన కుముదినిపై సావిత్రికి కోపం. మామగారి ఎదుట కుముదిని మాట్లాడదు. అందువల్ల ఆమె మనస్సులో సందేహం సందేహంగానే వుండిపోయింది

## 2

జ్యేష్ఠమాసపు ఎండకు శరీరం చిటచిట లాడ్తూంది. వానలు తక్కువగా వుండటంవల్ల తాపం అధికమైంది సుకుమార ప్రసూనాలూ, లేచిగుళ్ళూ ఆతాపానికి సోలిపోయాయి అనేక ఆలోచనలతో సతమతమౌతూ శాంతిని కోల్పోయిన కుముదినీదేవి మనస్సుకూడ అలాగేసోలి పోయింది

జ్ఞానమొచ్చిన నాటినుండి ఆచరిస్తూన్న ఈ పూజలు మానడమంటే ఏదో అనిర్వచనీయమైన ఆవేదన కల్గుతోంది హృదయంలో. ఎన్ని పను లున్నా, చదువు తొందరలున్నా. పరీక్షలున్నాసరే ఈ ఉదయ పూజా కృత్యాలను మాత్రం ఎన్నడూ మానుకోలేదు. ఏదో అనిర్వచనీయ నైర్మల్యతనూ, తృప్తినీ, ఆనందాన్నీ ప్రసాదించే ఈ కార్యక్రమం — యేడవయేటనుండీ ఈనాటివరకూ అవిచ్ఛిన్నంగా సాగిపోతూన్న ఈ నిర్దిష్ట పూజా విధానానికి ఈ రోజునుండీ కలుగబోతూన్న అంతరాయం తలచుకొన్నకొలదీ కుముదిని హృదయం విలవిలలాడింది.

పుట్టింటినుండి భక్తిగా ప్రేమగా తెచ్చు కున్న రజిత దైవపీఠాన్నీ, విగ్రహాలనూ పవిత్రస్థానం నుండి తొలగించి, ట్రంకు పెట్టెలో భద్రం చేస్తోంటే చేతులు ఒణి కాయి దుఃఖం పెల్లుబికింది అవిరళ భాష్పధారలతో ముఖం మలినమైంది "రేపటినుండీ నీకు పూజలు జరుగవు నైవేద్యం వుండదు ఈ అపరాధాన్ని మన్నించు ఎటువంటి శిక్ష వెయ్యకు ప్రభూ ! ఆచరణలను అరికట్టగలరు కాని అంతరంగాన్ని ఆదేశించగలరా? నా ప్రత్య ణువులోను జీర్ణించుకుపోయిన నీ పై భక్తినీ, నా ప్రతిరక్త బిందువూ జపించే నీ నామాన్నీ, నా హృదయ పీఠంపై నెల కొన్న నీ రూపాన్నీ తొలగించగలరా ?'' ఆక్రోశించే హృదయంతో పెట్టెపై తల వాల్చింది కుముదిని భోజనంలేక నీర సంగావున్న మేను, ఆలోచనలతో వేడె క్కిన మెదడూ తాత్కాలికంగా విశ్రాంతి తీసుకున్నాయి

''కుముదా" ఆఫీసునుంచి వచ్చిన కమలాకరం పిలుపుకు నేలపై కూర్చొని పెట్టెపై తలవాల్చి కలతనిద్రలో పడిన కుముదిని వులిక్కిపడి లేచింది

''వేళగాని వేళ ఆ నిద్రేమిటి ? అరే, ముఖం అలా వుందేం ? ఏడ్చావా ? ఎందుకు?'' అతడి ప్రశ్నా పరంపర అలా సాగిపోతూనేవుంది కుముదిని సమాధాన మివ్వకుండా త్వరత్వరగా వెళ్ళి పోయింది అయిదు నిముషాలలో కాఫీ కప్పుతో తిరిగివచ్చిన కుముదిని ముఖంలో ఛాయామాత్రంగా కూడా విషాదంలేదు కమలాకరం మౌనంగా కాఫీ అందు కున్నాడు, ఆ రోజు పోస్టు, న్యూస్ పేపర్లుతెచ్చి భర్తదగ్గరుంచి, తనూక్రింద తివాచీమీద కూర్చుని సన్నజాజులపళ్ళెం దగ్గరకుతీసి మాల కట్టసాగింది ఆమె చేస్తున్నపనిని పరీక్షగా చూచాడు కమలా కరం ఏవో భావాలను మనస్సులో అణచి పెట్టడానికి, భావాల మార్పుకోసం ఆపని సృష్టించుకున్నట్లుంది కాని – అందుమీద మనసుంచి చేస్తున్నట్లులేదు, ఆ మాల కట్టే తీరు

పది నిముషాలు అలాగే మౌనంగా గడిచి పోయాయి

"కొంచెం చదివి విన్పించగలవా ?'' అన్నాడు కమలాకరం సోఫాలో వెనక్కువాల్తూ, ఆమెను శ్రీగంటను చూస్తూ మధ్యాహ్నం భోజనానికి కూడా రాని అతనికోపం ఏం మాట్లాడితే ఎటు తిరుగుతుందో ననే భయ సంకోచాలతో మౌనంగావున్న కుముదిని ఆ శాంత స్వరానికి ఆశ్చర్యపోతూ కళ్ళెత్తి చూచింది తననే ఓరగా చూస్తున్నాడు కమలాకరం పూలమాల పళ్ళెంలోవుంచి టీపాయ్‌మీదపెట్టి, వెళ్ళి కమలాకరం ప్రక్కనే సోఫాలో కూర్చుని ముందు ఆ రోజు వచ్చిన లెటర్సు చదవడం పూర్తి చేసింది న్యూస్‌పేపరు చేతికి తీసుకుం టూండగా ''ఏమండీ అంత ముభావంగా

వున్నారు ?'' అన్నాడు కమలాకరం కొంచెం చిరునవ్వుతో

''నేనా ? లేదే !'' మెల్లని స్వరంతో అన్నది కుముదిని

"మరి ? మధ్యాహ్నం భోజనానికి రాలే దేమని అడిగావా ?''

ఒక్క క్షణం ఆగి మెల్లగా అంది కుముదిని ''ప్రొద్దున్న కాఫీ, టిఫిన్ నేనిస్తే పనికిరానప్పుడు మధ్యాహ్న భోజనానికి ఎందుకు రాలేదని అడిగే అర్హత నాకు లేదనుకున్నాను నాగురించే రాలేదని వూహించాను ఇప్పుడిక తప్పని సరిగా యిల్లుజేరారు ''

నిర్లిప్తంగా వున్న ఆధోరణికి పక పకానవ్వేశాడు కమలాకరం ''అందు క్కాదు కుముదా, ఆఫీసులో ఒక ఫ్రెండ్ బర్త్‌డే పార్టీయిచ్చాడు మస్తుగా '' మాట్లాడలేదు కుముదిని తిరిగి కమలా కరమే అన్నాడు ''ప్రొద్దున్న నాకునిజంగా చాలాకోపం వచ్చింది కుముదా అలా నా కిష్టంలేని పనులెప్పుడూ చెయ్యకు చూస్తూనే వుకదూ ?''

కుముదిని జవాబివ్వకుండా త్వర త్వరగా అక్కడినుంచి లేచి వెళ్ళి పోయింది

స్నానంచేసి లోపలికి వస్తూన్న కొడుకు నుద్దేశించి ఒక్క కేక పెట్టింది సావిత్రి "త్వరగా భోజనానికి రా నాయనా నీవు మధ్యాహ్నం రాలేదని ఆవిడ వుపవాసాలు చేస్తోంది నిందు యింట్లో ఈ అభోజనాలు నేను సహించ లేను "

"అయితేనువ్వుమధ్యాహ్నం భోజనం చెయ్యలేదా ?'' అనడిగాడు గదిలోకివచ్చి కుముదినిని పరీక్షగా చూస్తూ,

"ఇప్పుడు చేస్తాను ముందు మీరు నడవండి " అంది కుముదిని మెల్లగా కమలాకరం హృదయం ద్రవించి పోయింది "నాకు కోపం వచ్చేటట్టు ప్రవర్తించడ మెందుకు ? ఆపైన యిలా బాధపడటమెందుకు ? నన్నర్థం చేసుకో కుముదా! ఆ మూఢ విగ్రహారాధన అంటే నాకు ఒళ్ళు మండిపోతోంది "

''మరి మీ అమ్మగారు చేస్తూంటే మాట్లాడరేం ?"

"అది వేరు, అమ్మ లాలన పాలనలలో పెరిగిన నాకు అమ్మను శాసించగల అధి కారంలేదు కాని నువ్వు నా అర్ధాంగివి భార్య తనమాట మీరడం నేనే కాదు, బహుశః ఏ మగవాడూ సహించలేడు ''

అంతవరకూ మమతా, మార్దవం తొణికిస లాడిన కన్నులూ, కంఠమూ తిరిగి కర్కశత్వాన్ని నింపుకోవడం చూచిన కుముదిని అదిరిపడింది "ఒద్దు, హక్కులు, అధికారాలు అనే పదాలు మన మధ్యకు రానివ్వకండి మీకు నేను కష్టం కలిగించను " అంటూ అక్కడినుంచి తప్పుకొంది

మర్నాడు ప్రాతఃకాలం కుముదిని అనుభవించిన మనోవేదన వర్ణనాతీతం,



"భగ్న ప్రేమికు డనుకుంటా !"

జ్ఞానం కలిగిననాటి నుండీ అవిరామంగా చేస్తూన్న ఆ దైవపూజను నేడు మానుకోవడంతో శరీరంలో యేదో భాగాన్ని దూరం చేసుకున్నట్లే అన్పించింది ఆ రోజంతా చెప్పలేని దిగులుతో హృదయంలో రంపపుకోతగానే వుంది. సాయంకాలం ఆఫీసునుంచి త్వరగా వచ్చేశాడు కమలాకరం

"అలా ఎక్కడైనా వెళ్దాం పద" అన్నాడు భార్యతో. మారు మాట్లాడకుండా పది నిముషాల్లో తయారై వచ్చి జోడు తొడుక్కుంటున్న కుముదినిని చూస్తూ "సినిమాకెళ్దామా, షికారా ?" అనడిగాడు

"మీ యిష్టం,"

"ఊఁ హు నీ యిష్టం నా యిష్ట ప్రకారం నువ్వు నీ పూజలు కట్టిపెట్టావు గనుక యిక అన్ని విషయాలలో నీ యిష్టాను వర్తిని" అన్నాడు కమలాకరం చిరుదరహాసంతో

కుముదిని తొణకలేదు "సంతోషం కాని మీ యిష్టమే నా యిష్టం. పదండి" అంది గంభీరంగా

నాల్గు రోజుల అనంతరం ఒక రాత్రి వెంకటచలం, కమలాకరం భోజనం చేస్తున్నారు కుముదినీ, సావిత్రీ వడ్డన చేస్తున్నారు

వెంకటచలం హఠాత్తుగా తలెత్తి "ఇవ్వాళ అమ్మాయి మామగారు వుత్తరం వ్రాశారు త్రయోదశినాడు అమ్మాయిని

తీసుకెళ్ళమవి నాకు చాలా పనులున్నాయి వెళ్తావట్రా కమలా, పద్మను తీసుకురావ టానికి ?" అనడిగాడు

"సెలవు దొరకదేమో నాన్నా పోనీ శనివారం రాత్రికి వెళ్ళి ఆదివారం తీసు కొస్తాన "

"అమావాస్యనాడు అత్తింటి కోడల్ని పుట్టింటికి తీసుకొస్తావా ? ఛ యింత అజ్ఞానుడవేమిరా ?''

"నాన్సెన్స్ ! అమావాస్యేమిటి పౌర్ణ మేమిటి? ఛాదస్తం అసలు నేను వెళ్ళనే వెళ్ళను అయినా ఎందుకేమి టిప్పుడంత అర్జంటుగా దాన్ని తీసుకు రావడం ?"

తల్లి అందుకుంది "అంత తెలియ కుండా వున్నావన్నమాట ! అమావాస్య వెళ్ళగానే ఆషాఢం మొదలు, క్రొత్త కోడళ్ళు, అల్లుళ్ళు ఆషాఢంలో అత్తింట వుండకూడదు నీకు తగిన అత్తారే నీకూ దొరికారు ఇంక నాల్గురోజులైనా లేదు అమావాస్య వుత్తరమూ లేదు, మనిషీ లేదు'' మాటిమాటికీ కోడల్ని సూటీపోటి మాటలనడమే సావిత్రి కానందం కుముదిని చిన్నబుచ్చుకుంది కమలాకరం ఆశ్చర్యంగా చూచాడు 'మరీ పూజలు, దేవుళ్లు అనే పట్టింపుగల కుముదిని పుట్టింట్లో యిటువంటి నమ్మకాలు మాత్రం వుండకుండా వుంటాయా ? ఎందుకు రాలేదో ?' అనుకున్నాడు వెంకటచలం మాత్రం బాధపడ్డాడు కోడలి విచారవదనం చూచి ''ఇంకా నాల్గు రోజులుంది వస్తారు లెద్దూ వెధవ తొందరా నువ్వూనూ" అని భార్యను సన్నసన్నగా మందలించాడు

## 3

కమలాకరం ఆఫీసునుండి మధ్యాహ్నం వచ్చేసరికి హాల్లో కుముదిని తండ్రి అనంతయ్యా, వెంకటచలమూ మాట్లాడుకుంటూ కన్పించారు

''అల్లుడుగారు కులాసా ? వుత్తరానికి జవాబే యిచ్చారు కాదు ?" అని పలుక రించాడు అనంతయ్య

"ఉత్తరమాండీ ?" ఆశ్చర్యకరంగా అడుగుతూ దగ్గర కూర్చున్నాడు కమలాకరం

''అమ్మాయిని ఎప్పుడు పంపిస్తారో వ్రాస్తే వస్తానని వ్రాశాను మీ జవాబు కోసం వారం రోజులు చూచి యిక వచ్చేశాను ''

''అరే! అందలేదండీ మీకు జవాబివ్వ కుండా వుంటానా ?'' అంటూ లేచి లోపలికి వెళ్ళాడు

కిటికీ దగ్గర పరధ్యానంగా నిల్చున్న కుముదిని వెనుతిరిగి చూచింది

"మీ నాన్నగారు లెటరు వ్రాశానంటా రేమిటి ?'' అనడిగాడు కమలాకరం

''నాన్నగారు మీకు ఆషాఢపట్టీ తెచ్చారు చూశారా ?'' అని ప్రసంగం మార్చింది కుముదిని ఉత్సాహంగా చూచాడు కమలాకరం 'ట్వీడ్‌సూటింగ్

క్లాత్, ముత్యపు వుంగరం, ఏడువందలు నగదూ ' భర్త ముఖకవళికలు జాగ్రత్తగా పరిశీలిస్తున్న కుముదిని అతడి వదనంలో దరహాస చంద్రికలు మాయమవ్వకుండా నిలిచే వుండటం చూచి లోలోపల తృప్తిగా నిట్టూర్చింది

"అంతా బాగానే వుంది కాని—ఏమిటీ ఆషాఢపట్టీ, శ్రావణ తగవూను, పాత పద్ధతులు కాకపోతే, పెళ్ళి నా దయ్యాయిగా కట్నాలు, కానుకలూను? మళ్ళీ ఈ జిడ్డంతా వదిలించుకోవటం దేనికీ."

"నాన్నగారిదగ్గర మాత్రం అలా గనకండి చిన్నబుచ్చుకుంటారు ఎంతో సరదాగా తెచ్చారు అవి మన పద్ధతులు "

"అదేం సరదా? నే నందరల్లుళ్ళవంటి వాడిని కాదని ఆయనకు తెలియదేమో! వుంగరమూ, బట్టలూ తీసుకుంటాను మర్యాదకు ఆ డబ్బు యిచ్చెయ్యి అల్లుడి హోదాతో అత్తవారిల్లు గుల్లచెయ్యడ మంటే అసహ్యం నాకు "

నవ్వింది కుముదిని "తెల్సు లెండి, మీరు చాలా మంచివారట' కాని ఈ సారికి తీసుకోండ నాన్నగారితో చెప్తాను మీకిష్టం లెదనీ యికనుంచి అలా చెయ్యొద్దనీ" జవాబు కోసం చూడకుండా భోజనాలు ఏర్పాటు చేసే మిషతో వెళ్ళి పోయింది

వియ్యంకుళ్ళిద్దరూ, కమలాకరమూ ఒక్కసారే భోజనానికి కూర్చున్నారు సావిత్రి వడ్డన చెయ్యసాగింది చాలా ఆదరంగా మాట్లాడ్తూ ఆ తెచ్చి పెట్టు కున్న కలుపుకోలు తనం చూచి కుముదిని ఆశ్చర్యపోయింది కొడుక్కు పండగ లాంఛనం దండిగా ముట్టిందనే సంతోషమో లేక వియ్యంకుడి దగ్గర నటనో తేల్చుకోలేకపోయింది

"రేపు త్రయోదశి, ఉదయం ఏడు గంటలకు ప్రయాణానికి బాగుంది శ్రావణ మాసం నోములు కూడా అయ్యాక పంపి స్తాను " అన్నాడు అనంతయ్య జనాంతి కంగా

"అలాగే తీసుకెళ్ళండి నిన్ననే అన్నాను, ఎంచేతో వియ్యంకుడుగారు వుత్తరం వ్రాయలేదని మా అమ్మాయిని కూడా రేపే తీసుకొస్తాం అత్తారింటి దగ్గర్నుంచి " అంది సావిత్రి కలివిడిగా కుముదినీ, కమలాకరం ముఖముఖాలు చూచుకున్నారు

కమలాకరం సాయంత్రం వచ్చేసరికి కుముదిని గదిలో కుముదినీ, అనంతయ్యా కూర్చుని మాట్లాడుకుంటున్నారు "అయితే చిన్నక్కయ్య గురించి వుత్తరంలో వ్రాయలేదేం నాన్నా? శ్రావణ మాసాని కొస్తుందా?" అనడి గింది కుముదిని అనంతయ్యే కాక, అప్పుడే లోపల అడుగెట్టిన కమలాకరం కూడ ఆశ్చర్యపోయాడు

"ఉత్తరం అందలేదన్నావు కదమ్మా

మరి ?'' అన్నాడు కూతుర్ని పరీక్షగా చూస్తూ అనంతయ్య

తొొట్రుపడింది కుముదిని కమలాకరం ముఖంకూడ సమాధానం కోసం చూస్తున్నట్లు కన్పించగానే కలవర పాటుతో "కాఫీతెస్తాను," అంటూ వెళ్ళి పోయింది మామా అల్లుళ్ళిద్దరూ ముఖ ముఖాలు చూచుకున్నారు ఆమె ఏదో దాస్తోందని గ్రహించారు కాని ఎవ్వరూ మాట్లాడలేదు

మళ్ళీ ఒంటరిగా వున్నప్పుడడిగాడు అనంతయ్య కూతుర్ని "అందింది నాన్నా, కాని ఒక విషయముంది ఇప్పుడు చెప్పలేను " అంది ముక్తసరిగా కుముదిని

రాత్రి కమలాకరం అడిగాడు మొదట కుముదిని చెప్పలేదు తర్వాత తప్పని సరిగా చెప్పింది "ఆ లెటరు మీచేతిలో పడితే 'యిటువంటివి నమ్మను, పంపను' అని వ్రాస్తారని నాకు తెలుసు మిమ్మల్ని గురించి అందరూ అన్నివిధాలా అను కోవడం నాకిష్టంలేదు, అందుకే దాచేశాను "

కమలాకరం కృతజ్ఞతా పూర్వకంగా నవ్వాడు "నామీద అంత గౌరవముంచి నందుకు సంతోషిస్తున్నాను కుముదా అయితే నీకు కోపం లేదన్నమాట నామీద ''

"కోపం దేనికిలెండి నాన్నగారితో వెళ్తే అక్కడ తప్పనిసరిగా నోములూ, పూజలూ చెయ్యాలి, లేకుంటే కారణంచెప్పి మిమ్మల్ని అనిపించాలి మీలోమార్పు వచ్చేవరకు మీకిష్టంలేని పని చేయకూడదని నిశ్చయించు కున్నాను "

కమలాకరం మాట్లాడలేదు, కాని అతడి నేత్రాలలోనే కుముదినిపై అను రాగం తొణికిసలాడింది తిరిగి కుముదిని అన్నది "ఆషాఢంలో అత్తవారింట క్రొత్తల్లుళ్ళు వుండకూడదని నమ్మిక నా అభిప్రాయ మెలావున్నా అత్తగారు వుగ్రులై పోతారు నేనిక్కడుంటే ఇంట్లో నామూలంగా నరకం బయల్దేరు తుంది "

"వూఁ మరైతే ఏం చేద్దామంటావ్ ?"

"ఉన్న పరిస్థితి వివరంగా మీకు చెప్పాను నిర్ణయించవలసింది మీరు,"

కొద్దిసేపాలోచించి అన్నాడు కమలా కరం "ఆఫీసుకు సెలవుపెట్టి మనం ఎటైనా వెళ్దామా ?''

"నాకూ అదే తోచింది నాన్నగా రిచ్చిన ఏడువందలూ వుండనే వున్నాయి గదా ''

అనంతయ్యకు అసలు విషయం అవ గాహన కాకపోయినా ఏదో విశేష ముందని మాత్రం గ్రహించ గలిగాడు "వాళ్ళు తిరుగుతా మంటున్నారు కదా ' నీదగ్గర వుంచుకో ఈడబ్బు" అని కూతు రుకి ప్రత్యేకంగా నాలుగు వందలిచ్చి వెళ్ళిపోయాడు



"ఏమి జ్యోతిషం నీది! మాఘమాసంలో నాకూ లలితకూ పెళ్ళి అవుతుం దన్నావు! అది కార్తీకమాసంలోనే రామ్మూర్తితో లేచిపోయింది!"

"నాన్న యిచ్చినడబ్బు మూలిగి పోతుందనుకున్నావా? ఇప్పుడెందుకీ ప్రయాణం, డబ్బు తగలేసుకోవటానికి కాకపోతే? లక్షణంగా పుట్టింటికి వెళ్ళ కూడదూ?" చాటున సావిత్రి మండి పడింది కోడలుమీద

"వెళ్ళి ఏం చెయ్యను? ఆయన కిష్టంలేనిపని చెయ్యొద్దని మీరే అన్నారుగా?"

"అక్కడ నువ్వేం చేస్తున్నావో వాడు చూడొచ్చాడా?''

"అటువంటి దొంగ బ్రతుకు నా కిష్టంలేదు"

చోద్యంగా బుగ్గలు నొక్కుకుంది సావిత్రి, "ఓదేవుడూ, భయమూలేకుండా మంచి వంకే దొరకింది ఈ పాడు చదు వొచ్చి యిన్ని షోకులొచ్చాయి"

"అనవసరంగా సరస్వతిని దూషించి నోరు పాడుచేసుకోకండి అయినా దేవుడు మానవ మాత్రులంత నిర్దయుడూ మూర్ఖుడూ కాదు" తనలో తనే ఆశ్చర్య పోయింది కుముదిని అత్తగారితో అంత కటువుగా మాట్లాడ గల్గినందుకు

పెట్టె సర్దుతున్న కుముదిని నడిగాడు కమలాకరం "ఎక్కడికెళ్దాం?'' తలెత్తిచూచి తిరిగి తన పనిలో నిమగ్న

మైంది • కుముదిని, "మీ యిష్టం" అంటూ నవ్వేడు కమలాకరం, "కోపం లేనట్టే వుంటున్నావుకాని నిజంగా నామీద నీకు కోపంగానే వుంది కుముదా ''

ప్రశ్నార్థకంగా చూచింది కుముదిని

''ఏమడిగినా నా యిష్టానికే వదిలేస్తున్నావు నీ కో అభిప్రాయ మంటూ లేదా ?"

''అభిప్రాయాన్ని మొండిగా ఆచరించడంకంటె ఆత్మగౌరవం నిలుపుకోవటం ప్రధాన మనుకుంటాను "

"అంటే ?''

"అహంభావివద్ద అంతరాన్ని ప్రదర్శించి అలుసయ్యేకంటె అభిమానంగా అణగద్రొక్కుకోవడం అన్నివిధాలా మంచిది" సూటిగా తగిలిన ఆ మాటలకు అభిమానంగా లేచి కూర్చున్నాడు కమలాకరం "అడుగడుగునా అహంభావీ, నిరంకుశుడూ అనుకొంటూ బలవంతంగా నీ అభిప్రాయాలు మార్చుకోనవుసరంలేదు కుముదా నాక్కావలసింది సంతోషంగా నన్నర్థంచేసుకొని సహకరించే సహచారిణి నీ వేష భాషలుచూచి పాతవాసనలేని సంస్కారవతి వనుకున్నాను కాని తెలిస్తే నువ్వెంత అందంగావున్నా ఎంత చదువుకొన్నా కక్కుర్తిపడకపోదును "

చాలా శాంతంగా జవాబిచ్చింది కుముదిని "ఏదో సమాధానం చెప్పాను కాని మీకింత కోపం వస్తుందనుకోలేదు క్షమించండి "

"సరే, ఏమిటి నీ అభిప్రాయం ? ఎక్కడికి వెళ్దామని ?"

నిశితంగాచూస్తూ అంది కుముదిని ''మీతో వివాహమైతే తిరుపతి వెళ్ళాలని మిమ్మల్ని చూచిననాడే మ్రొక్కుకున్నాను తీరుస్తారా ఆ కోరిక ?''

కమలాకరం ముఖం అరుణిమ దాల్చింది "నన్ను వంచించాలనీ, అవమానించాలనీ నీ కోరికా ? అవకాశాలను సద్వినియోగం చేసుకోని వాళ్ల కసలవకాశా లివ్వడమే అనవసరం యింట్లో కూర్చొని నీ మనస్సులో నువ్వు ఎవరినో పెళ్ళాడాలని కోరుకుంటే ఎక్కడో తిరుపతిలో వున్న విగ్రహానికి వినబడి నీ కోరిక తీర్చేసిందా ?"

వణికిపోయింది కుముదిని శరీరం జలదరించింది గుండెలు కొట్టుకున్నాయి కనులు విపరీతంగా చలించాయి తుఫాను గాలిలో లతలాగా తనూలత గడగడలాడింది ఇక అక్కడ నిల్చుంటే వాగ్వాదం పెరుగగలదనే భయంతో లేచి మరో పని మిషతో అక్కడినుంచి వెళ్ళిపోయింది

## 4

విజయవాడ, నాగార్జునసాగర్, మహాబలిపురం, మెడ్రాసు, తిరుచునాపల్లి, మైసూరు, బెంగుళూరు, హంపీ అన్నీ

తిరిగి చూచారు కమలాకరం, కుముదినీ ఇద్దరూ కూడ చాల వుల్లాసంగా గడి పారు కాని ఎంత కలిసిమెలిసి తిరిగినా, ఎంత సర్దాగా అరమరికలు లేకుండా ప్రవర్తించినా తమ మధ్య యేదో పూడని అగాధం వున్నట్టూ, అగోచరమైన అవనిక యేదో ఇరువురిమధ్యా వ్యాపించి నట్లూ ఇద్దరికీ అనిపించేది అదేమిటో మాత్రం అవగాహన కాలేదు పైకి వెల్ల డించడానికి ఎవరిమట్టుకు వారికే సంకోచం. తనకు తోచినట్టు చెయ్యడమే కాని ఏ విషయంలోనూ కుముదిని అభి ప్రాయం అడిగేవాడు కాదు కమలాకరం ఏమంటే ఏంకోప మొస్తుందో నన్నట్లు కుముదిని తూచి తూచి మాట్లాడేది

తిరిగి తిరిగి మళ్ళీ మద్రాసు జేరు కున్నారు "అయిపోయిందా నీ ఆషాఢం, యింకా వుందా ?'' అనడిగాడు కమలా కరం హోటలు రూములో మేను వాల్చుతూ

నవ్వు వచ్చింది కుముదినికి "నా ఆషాఢమేమిటి• నేనుగాని సృష్టించానా?''

"అంటే నీలాటి ఛాదస్తులు సృష్టించి నది " ఇద్దరూ నవ్వుకున్నారు

"ఎల్లుండి అమావాస్య గడవడంతో శ్రావణమాసం మొదలు ఈ రెండు రోజులూ మద్రాసు చూచి ఎల్లుండి సాయంత్రం మెయిలుకు వెళ్ళిపోదాం '' అంది కుముదిని "ఈ నెల రోజులు పద్మతో సరదాగా గడిచిపోతుంది "

అంది తిరిగి ఏదో ఆలోచిస్తూ, తనలో తను అనుకుంటున్నట్టు

"ఆఁ ఆఁ ' ప్రతి మంగళవారం నా ప్రాణాలు తీసేవాళ్లు, ఒకళ్ళ కొకళ్ళు తోడౌతారు కాబోలు !" అన్నాడు తీవ్రంగా కమలాకరం

"అంత మాటనిలకడలేనిదాన్ని కాదు'', విసురుగా వాలుకుర్చీలో పడు కుని ఏదో పుస్తకం పేజీలు తిరగెయ్య సాగింది కుముదిని కమలాకరం లోలోన నవ్వుకుంటూ లేచి తలుపుతీసుకు బయ టకు వెళ్ళి పావుగంటలో తిరిగి వచ్చాడు

"నేనెవరో నీకు తెలుసా, మనసా తెలుసా•"కొంటెగా పాడుతూ కుముదినిని చూచాడు కుముదిని పుస్తకం మీదినుండి దృష్టి మరల్చలేదు

''రేపు తెలుస్తుందిలే ఓ కుముదినీ దేవీ !'' తమాషాగా నవ్వుతూ హాయిగా పడుకుని నిద్రపోయాడు కమలాకరం

ఆ హుషారుకు కారణమేమిటో తెలియక ఆశ్చర్యపోయింది కుముదిని 'విజయ గర్వం కాబోలు' అని సరిపెట్టుకుంది

మర్నాడుదయం టాక్సీలో సామా నంతా పెట్టించేసి రూమ్‌రెంట్ యిచ్చే స్తూంటే ఆశ్చర్యంగా చూచింది కుముదిని భర్తవైపు ఇక కారు సాగిపోతూంటే మాత్రం అడగకుండా వుండలేక పోయింది "నువ్వు తిరుపతి వెళ్ళాలను కున్నావుగా ?'' అన్నాడు అతి సాధార ణంగా తన చెవులను తనే నమ్మలేక

పోయింది కుముదిని కొంత సేపటికి తమాయించుకుని "హాస్యమా ?" అంది. "కాదు" అంటూ యిటు తిరిగాడు కమలాకరం "నువ్వు మాట నిలకడలేని దానవు కాదుగా ? నేనూ అంతే నీ మనస్సులో కోరిక నీ చేత బలవంతంగా చెప్పించినప్పుడు తీర్చటం నా విధి కాని యికమీదట మాత్రం అటువంటి అవకాశాలు లేకుండా చేసుకున్నావు "

విని మౌనంగా వూరుకుంది కుముదిని కాని మనస్సులో పరవళ్ళు త్రొక్కుతూన్న సంతోషాన్ని మాత్రం కన్నులలో ప్రతిఫలింపజేయకుండా అరికట్టలేక పోయింది రాత్రి అతడు అతి చతురంగా చెప్పిన విషయం ఇదా ? అని ఆశ్చర్యపోయింది

టాక్సీ తిరుపతి కొండ ఎక్కుతూంటే, అనతి కాలంలోనే తన యిష్టదైవాన్ని దర్శించ బోతూన్న సంతోషంతో కుముదిని హృదయం మయూరంలా నాట్యం చెయ్యసాగింది ఆ వున్నత పర్వత శిఖర సౌందర్యాన్ని తిలకించటానికి నేత్ర ద్వయం చాలదనిపించింది

ఆలయానికి వెళ్తూ కుముదిని కన్నీళ్ళతో ప్రాధేయపడింది భర్తను "మీ పట్టుదల మాని ఎటూ తీసుకొచ్చారు నా కోసం అలా నా కోసమేరండి ఇంత వరకూ వచ్చి ఆ శ్రీనివాసుడిని దర్శించకుండా వెళ్ళడమా ? జంటగా దర్శించుకుంటామని మ్రొక్కుకున్నాను నేను "

వినుకున్నాడు కమలాకరం "నువ్వు మ్రొక్కుకోవడంలో నా బాధ్యత ఏమీ లేదు నా చేత అట్టే అనిపించక నీ పనులు తెముల్చుకో గుళ్ళో కూర్చున్న నల్లరాయిని కోరి దర్శించుకోవలసిన అవసరం లేదు నాకు కేవలం నీ కోరిక తీర్చడానికే యిప్పుడిక్కడికొచ్చింది ఆలయానికి రావడం నా వల్లకాదు " ముసుగు దన్ని పడుకున్నాడు 'అసలీ మనిషి చేత ఈ పుణ్యక్షేత్రంలో నోటి కొచ్చినట్టు వాగించ కూడదు' అని తలపోసి కుముదిని మరి బలవంతం చెయ్యలేదు భర్తను

పూర్ణాలంకృత శోభితుడైన శ్రీ వేంకటేశ్వరుని దర్శించుకొన్న కుముదిని మనస్సంతా సంతోష సంభ్రమాలతో నిండిపోయింది ఆపాదమస్తకమూ కళకళలాడిపోతూ వజ్రకవచంతో, వైకుంఠ హస్తంతో, ధవళకాంతులీనే గోవిందనామాలతో, వజ్రమయ శంఖు చక్రాలతో, నవరత్న ఖచిత కిరీటంతో దేదీప్యమానంగా వెలుగొందుతూన్న ఆ భువన మోహన కళ్యాణ రూపాన్ని చూడగానే జన్మ తరించిపోతుంది మనస్సు పరవశమౌతుంది హృదయ భారాలు తొలగిపోయి అనిర్వచనీయానంద సంతృప్తి ఆవరిస్తుంది 'ఆ పవిత్ర గంభీర ప్రశాంతమూర్తిని చూస్తూ ఎవరైనా దేవుడు లేడని అనగలరా ?'



''చచ్చారా! సుబ్బయ్యశెట్టి చచ్చికూడా బాకీ కోసం వెంటపడుతున్నాడు''

బహుదూరం వచ్చి భగవత్ దర్శనానికి దూరమైన భర్తలోని లోపానికి బాధపడ్తూ బస జేరుకుంది కుముదిని. ఆమె దుస్తులు మార్చి, సిద్ధంగా వున్న కేరియర్ తీసి భోజనం వడ్డిస్తూంటే అప్పుడు ముసుగు తీసి లేచి వచ్చాడు కమలాకరం భోజనానికి

''మధ్యాహ్నం రెండు గంటలవరకూ తిండి తినవద్దన్నాడు కదూ దేవుడు? అర్థంలేని వుపవాసాలు ఏం, కాస్త కాఫీ టిఫినూ తీసుకువెళ్తే ఆ దేవుడు కన్పించక పోయాడా? దైవ దర్శనానికి ఫలితం ఆకలి బాధన్నమాట'' హేళనగా అన్నాడు

''నాకోసమెందు కూర్చోవాలి? మీరు కానివ్వలేకపోయారా? ఆ ఆలయంలో అడుగెడితే ఆకలికాదు సరికదా, యిక యే ధ్యాసావుండదు ఆ దైవ దర్శనంతోనే కడుపునిండి పోతుంది.''

''ఓహో, ఏం భక్తి'' హేళన ధ్వనించిందతడి కంఠంలో

టాక్సీ కొండదిగుతూంటే చూపట్టే సుందర దృశ్యాలతో తనువు పులకరించింది కుముదినికి కొండవాళ్ళ ప్రక్క మెలికలు తిరిగిన బాటమీద అందంగా పరుగు లిడుతున్నకార్లూ, బస్సులూ, రాళ్ళ నడుమనుండి మధ్య మధ్య ఒయ్యారంగా జాలువారుతూన్న నీటిధారలూ, ఆ ఉన్నత ప్రదేశం నుండి చిత్రంగా చూపట్టే క్రింది బాటలూ, దిగువ తిరుపతి నగర దృశ్యమూ చూడాలేకాని వర్ణించ నలవికాదు

''నీ దేవుడి దగ్గరకు ఈ బాటను వేసినది మానవులేసుమా!'' అన్నాడు

కమలాకరం నవ్వుతూ కుముదిని కలవర పాటుతో అతడి దెసతిరిగి "అంత అహం భావం తగదు మీకు పుణ్య ముంటుంది మాట్లాడకండి కా స్సే పు ' అంటూనే వుంది -

టాక్సీ ఒక మలుపులో సూటిగాపోయి కొండను గ్రుద్దేసి ఆగిపోయింది కుముదిని గుండె దడ దడ లాడి పోయింది ఆ కుదుపుకు ఎదరసీటుకు గ్రుద్దుకున్న కమలాకరం నుదిటి పై వెంటనే రూపాయంత బొప్పి కట్టింది

"అడడా ! డాష్ ఇచ్చేసింది సార్ !''

గోలపెడ్తూ దిగాడు డ్రైవరు కొండ ఎక్కుతూన్న, దిగుతూన్న కార్లూ, బస్సులూ ఆపి డ్రైవర్లు దిగివచ్చారు నిముషంలో వందలాది జనం ప్రోగై పోయారు కాని ఆశ్చర్యం ! కారుకు ఒక్క లైటుకూడా పోలేదు చెక్కుచెదర కుండా నిల్చివుందికారు ! ఒక్క నొక్కు కూడా పడలేదు స్టార్టుచేసిచూస్తే యింజనుకూడా బాగానే వుంది

"మ్రొక్కు చెల్లించలేదేమో !''

"యేదో అపరాధం జరిగి వుండాలి "

"స్వామి బాగా కాశాడు అదృష్ట వంతులే " ఎవరికితోచినది వారనసాగారు చేరిన జనం

"సామీ, మీరు గమ్మునుండాల దేవుడు కొండమీద మీరు అట్ట మాట్లాడ కూడదు అటుగైతే నేను బండికట్టలేను ఆ లచ్మీతల్లివల్ల భగమంతుడు మనల్ని కాశాడు '' అంటూ గొడవ పెట్టాడు డ్రైవరు

అందరూ "ఏమి టేమి" టని అడిగారు డ్రైవరు వివరించాడు

"అంత నమ్మకంలేనివాళ్ళు కొండ కెందుకొచ్చారు ?''

"దేవుఁడు మహిమ జూపాడు !''

మళ్ళీ రిమార్కుల మొదలు !

"పోనీవోయ్.'' విసుగ్గా అరిచాడు కమలాకరం. యిహ భరించలేక డ్రైవరు మీద " నడపడంరాక వంకలుపెట్టు'' తీవ్రంగా అన్నాడు పాపం, డ్రైవరు మెత్తటివాడేమో, మారుమాట్లాడకుండా కారు పోనిచ్చాడు భయంతో, కలవర పాటుతో కుముదిని తల్లడిల్లి పోయింది భర్తను మాట్లాడిస్తే యేమంటాడోననే భయంతో మరో దిక్కుకు చూస్తూ కూర్చుంది కాని కమలాకరం అహం కార స్వభావం అతడి నోటిని వూరుకో నివ్వలేదు "చూశావా నీదేవుడిచ్చిన బహుమతి ?'' అన్నాడు నుదుటిపై బొప్పి కట్టినచోట సవరించుకుంటూ "నీదేవుడిని ఏం కోరుకొన్నావు ? కన్పించాడా ? విన్నాడా నీ మాటలు ?'' అన్నాడు తిరిగి హేళనగా

కుముదిని ఆవేశం ఎట్టలేక పోయింది "ఈ నాస్తికుడిపై ఆగ్రహించకు నువ్వే బాగుచెయ్యాలి తిరిగి జంటగావచ్చి దర్శనం చేసుకొంటామని ప్రార్థించాను "

కమలాకరం పెంకెతనం పేట్రేగి పోయింది "జంటగా కాదుసరికదా, ఇక ఒంటిగా రావడంకూడా అసంభవమే గుర్తుంచుకో ''

# 5

పద్మా, కుముదినీ ఒకరినొకరు చూచుకుని పరమానందపడిపోయారు పద్మ వివాహం కుముదిని వివాహం ఒక్కసారే జరిగాయి ఆ యిద్దరూ యింతకు ముందు కలసి వున్నది చాలాతక్కువే అయినా, యిద్దరూ సహృదయులవ్వడం వల్ల అతిసన్నిహితులైపోయారు ఇద్దరూ దూరదూరంగావున్నా ఆ సన్నిహితత్వం వుత్తరాలద్వారా మరింత గట్టిపడింది ఇప్పుడు యిద్దరూ తిరిగి కలియడంతో మమతలు పెల్లుబికాయి

"ఎప్పుడెప్పుడని ఎదురుచూస్తున్నాను వదినా ఈ నెల్లాళ్ళనుంచీ ఏమీ తోచడం లేదు ప్రయాణం కులాసాగా జరిగిందా ?" అని పలుకరించింది పద్మ మందహాస వందనంతో

''మీ కోసం నాకూ అలానే తహతహగా వుంది వదినా మీతో ఎన్నో చెప్పాలని ఎన్నాళ్ళనుండో ఎదురు చూస్తున్నాను '' అంది కుముదిని

"ఎన్నాళ్ళనుండీ ? మన పెళ్ళిళ్ళై మూడునెలలైందిప్పటికి అంతేగా ?' నవ్వింది పద్మ

''నిజమే కాని మూడేళ్ళైనట్లుంది మిమ్మల్ని చూచి," ఇద్దరూ నవ్వుకున్నారు

''ఇంకానయం, నువ్వు శ్రావణ మాసం నోములకు పుట్టింటికివెళ్ళి పోతావేమో, నాకు తోడువుండవనుకున్నాను సరదాగా యిద్దరం యిక్కడే నోసుకో వచ్చు అంది తిరిగి పద్మ

కుముదిని సమాధానం చెప్పేలోగా అటు వచ్చిన సావిత్రి కలుగజేసుకొంది

"ఆవిడకు పూజలెందుకూ, ఎమ్మే పాసైన దొరసానికీ ? నీకూ నాకూను ఆ ఛాదస్తాలన్నీ '" అంటూ వెళ్ళిపోయింది

కుముదినికి కళ్ళ నీళ్ళ పర్యంతమైంది పద్మ జాలిపడింది వదినను చూచి

''బాధపడకు వదినా అమ్మ ధోరణే అంత అయినా నువ్వు చాలా నిష్ఠగా పూజ చేస్తావుకదా ప్రతిరోజూ ?'' కొంత ఆశ్చర్యంగానే ప్రశ్నించింది పద్మ

కళ్ళు తుడుచుకుంది కుముదిని "మరి మీ అమ్మగారేమీ చెప్పలేదా ?''

"వూఁహు, ఏమైనా విశేషమా ?''

''విశేషమే" నిర్లిప్తంగా జవాబిచ్చింది కుముదిని "నా బ్రతుకే విశేషంగా వుంది మీ అన్నయ్య ఎంతో సహృదయులని విని వివాహం ముందు ఎన్ని వూహించానో! నేనూ బాగా చదువుకున్నాను మా జీవితం ఎలాగెలాగో వుంటుందని కలలు కన్నాను కాని ఆరంభంలోనే నిరాశ ఎదురైంది అసలీ యింటికోడలినై వచ్చినందుకే మీ అమ్మగారికి కోపం ఇక నా ప్రవర్తనను విమర్శించడమే మీ

అన్నగారికి ధ్యేయం ఇద్దరిమధ్యా అను క్షణం నలిగి పోతున్నాను వదినా ఇవి పైనుండి చూచేవారికి ప్రత్యేకంగా కన్పించవు అనుభవించే వాళ్ళకు మాత్రం ఏమిటో వూపిరి సలపనంత బాధగా వుంటుంది ''

''అయితే అన్నయ్య నిన్ను పూజలు మా నెయ్యమన్నాడన్న మాట ?'' ఆశ్చర్యంగా ప్రశ్నించింది పద్మ కుముదిని మాట్టాడలేదు

"అన్నయ్య యింత కఠినంగా ఎప్పుడు మారిపోయాడు ? తన కిష్టం లేనంత మాత్రాన నీ చేత మాన్పించట మేమిటి ?" అప్పటికీ కుముదిని మాట్లాడ లేక పోయింది

శ్రావణ మంగళవారం నోములకు కావలసినవన్నీ బజారునుండి తెప్పిం చేందుకు పట్టిక తయారు చేస్తోంది సావిత్రి.

"తెల్లవారు ఝామునే లేచి స్నానం చేసి పూజ చేసేసుకొందాం వదినా అలాగైతే అన్నయ్యకు తెలియదుగా ?'' అంది పద్మ రహస్యంగా కుముదినితో

''ఎందుకులెండి అంత చాటు బ్రతుకు, మీ అన్నయ్య కిష్టమైనప్పుడే చేస్తాను అంతవరకు నా హృదయంలోనే ప్రతి ష్టించి, మనో పుష్పంతోనే పూజిస్తాను ''

జాలిగా నవ్వింది పద్మ "చాలామంది పురుషు లలాగే వుంటారు వదినా అలాగే అనేక దాపరికాలుంటాయి పంతం పట్టడంకంటె చాటు మాటుగా మనమే నెట్టుకు పోవాలికాని, వాళ్ళు మారరు ''

అయిష్టంగా నవ్వి వూరుకొంది కుముదిని పద్మ మరి మాట్లాడలేదు

మంగళవారం వుదయమంతా కుముదిని తీవ్రమైన అశాంతితో బాధ పడింది రోజూ పూజలు చెయ్యనివారు కూడ యిటువంటి ప్రత్యేకమైన నోములు, పర్వదినాలు శ్రద్ధగా చేస్తారు, అనుదినం చిరుత ప్రాయంనుండీ దైవాన్ని పూజి స్తున్న తనకు మాత్రం చతుర్వర్ణాల స్త్రీలు సౌభాగ్యత్వం కోసంచేసే ఆ పూజ, నూతన పరిణీత లందరూ నోచే మంగళ ప్రదమైన ఆ నోము చేసుకొనే అదృష్టం లేక పోయింది

భార్య వదనంలోని అశాంతి రేఖలను కమలాకరం గుర్తించాడు కాని పట్టించుకో లేదు లోలోన గర్వించాడేమోకూడ

పూజ అయిన తర్వాత పద్మ పిలుపుకు బయలుదేరింది కుముదినిని కూడా రమ్మంటే రాలే నన్నది బలవంతం చెయ్యలేదు సాయంకాల మయ్యేసరికి ముత్తైదువుల రాకపోకలు ప్రారంభ మయ్యాయి

"నువ్వు నోచుకో లేదే మమ్మా ? అత్తగారు వద్దన్నదా ?''

"అయితే పుట్టింటి కెందుకు వెళ్ళ లేదు నోములకు ?''

కుముదినిపై కురిసిన ప్రశ్నాపరం పరకు చిరునవ్వే సమాధానమైంది కాని

ఆ యింగితజ్ఞానం అందరకూ వుండదు కోడల్ని చిన్నబుచ్చటమే ఆనందమైన సావిత్రికి ఇంటిగుట్టు బయట పెడుతున్నాననే జ్ఞానం లేకపోయింది దానితో యిల్లాళ్ళ సంభాషణ ధోరణి క్రొత్తబాట త్రొక్కింది

"భర్తక్షేమం కోరవలసినది భార్య మగవాడితో పంతాలేమి?"

"అయినా చదువుకున్న ఆడవాళ్ళకు పూజలు, పునస్కారాలూ చేసే ఓపిక ఎక్కడ? నమ్మకమూ వుండదు"

భరించలేక యిక అక్కడ నిలువలేక త్వర త్వరగా మేడమీదికి వెళ్ళిపోయింది కుముదిని

రంగు రంగుల విలువైన దుస్తులతో నిండుగా అలంకరించుకుని వీధులవెంట తిరుగుతూన్న పేరంటాండ్రతో పట్టణానికే కళవచ్చింది ఆ సూయవల్లనేమో మేఘావృతమైయున్న ఆకాశం మధ్య మధ్య ఒక్కుమ్మడిగా వర్షించి ఆగిపోతుంది. అయినా ఆ అసూయా జల్లులు పేరంటాలకేమాత్రమూ ఆటంకం కేలేకపోతున్నాయి

డాబామీద కూర్చుని ఆ సందడంతా తిలకిస్తూన్న కమలాకరం సవ్వడి విని వెనుదిరిగి చూశాడు "ఏమ"ని ప్రశ్నించబోయిన వాడల్లా ఆగిపోయాడు కుముదిని నేత్రాలు శ్రావణ మేఘాలతో పోటీ పడబోతున్నట్లున్నాయి కమలాకరం దృష్టి తనపై పడిందని తెల్సికొన్న కుముదిని వెళ్ళి డాబా పిట్టగోడ నానుకు నిల్చుంది. ఎందుకో కమలాకరం మనస్సు జాలితో కరగింది కుముదినిని చూస్తూంటే నా నమ్మకాలను ఆమెపై రుద్ది బాధించడం న్యాయమా?' ఆలోచించుకుంటూ కుముదిని దగ్గరకు నడవబోయి పద్మ రావడంతో ఆగిపోయాడు

తిన్నగా వదిన దగ్గరకెళ్ళి భుజంపై చెయ్యివేసింది పద్మ "మూర్ఖులు అనేకం అనుకుంటారు లెక్కజేసుకోకు వదినా"

కుముదిని మాట్లాడలేదు

"మనల్ని చాలమంది పిల్చారు పేరంటానికి వెళ్దాం రా వదినా"

"మీరు వెళ్ళండి, నేనెక్కడికీ రాలేను"

"అందరిళ్ళకూ వద్దులే నా స్నేహితులు నలుగురున్నారు వాళ్ళ యిళ్ళకే వెళ్దాం చాలా మంచివాళ్లు"

"నేను పిలువకుండా వాళ్ళ యిళ్ళకు మాత్రం ఏ ముఖంతో వెళ్ళను? నాకు నోములనవసరమైనప్పుడు వారి నోములతో నాకేంపని?"

"పేరంటం మంగళ చిహ్నం కదా వదినా?"

కుముదిని సమాధాన మీయలేదు

కమలాకరం కల్పించుకున్నాడు "నువ్వు వెళ్లు పద్మా బలవంతందేనికి? అయినా యేదో విధంగా మా నెత్తిన ఖర్చు రుద్దుదామని కాని మీరు పూజలవి చెయ్యనంత మాత్రాన మొగవాళ్ళు వచ్చి

పోరు '' ఆ ముందు క్షణం లోనే కుముదినిపై కలిగిన జాలి అంతా ఎగిరి పోయింది. కుముదినీ పద్మాకూడ వులిక్కి పడ్డారు. కొద్ది క్షణాలపాటు ఎవ్వరూ మాట్లాడలేక పోయారు. ''పెళ్ళైతే నీలో మార్పు వస్తుందనుకున్నాను. చూడగా, వదిన వచ్చాక మరీ కఠినుడవై పోయి నట్లు తోస్తున్నదన్నయ్యా." మెల్లగా వెళ్ళిపోయింది పద్మ.

అదృశ్యంగా తమ మధ్య పరచు కున్న తెరలు మరీ దృఢపడి పో తున్నట్లు లోలోపల భయం చెలరేగింది కుముదినికి. ఇంచుమించు కమలాకరం మనఃస్థితీ అదేవిధంగా వుంది.

"ఇంటింటికీ వెళ్ళి సెనగలు మోసుకొస్తే భర్తల ఆయుఃప్రమాణం ఎక్కువై పోతుందనుకుంటారు. మూర్ఖులు వాళ్ళనేం చూస్తావు కాని పద సినిమా కెళ్దాం "

''ఇప్పుడు సినిమాకా ? అత్తగారేమంటారు ?'' కలవరంగా ప్రశ్నించింది.

"ఊఁ. ప్రతిదానికీ అత్తగారు మామగారు ! కుర్రాళ్ళు గనుక వెళ్ళారనుకుంటారు ఏమనుకుంటారు?'' తీవ్రంగా అన్నాడు. మౌనంగా అనుసరించింది కుముదిని.



## 6

సాయంత్రం మూడు గంటలవేళ పద్మా, కుముదినీ చదరంగం ఆడుకుంటున్నారు. కొంతసేపు ఆ కబుర్లూ ఈ కబుర్లూ అయ్యాక "వదినా, మిమ్మల్నొక సంగతి అడుగుదా మనుకొంటున్నాను, చెప్పగలరా ?'' అంది కుముదిని ఆట ఆపుజేసి.



"అడుగు వదినా. దానికేం ?'' ఆశ్చర్యంగా చూచింది పద్మ.

"మీ అన్నయ్య మరీ యింత హిరణ్యాకశిపుడిలా దైవవిరోధి ఆయిపోవటానికి కారణమేమిటో తెల్సుకోవాలని వుంది".

నవ్వింది పద్మ. "వాడు పుట్టుకతోనే అంత. కారణాలేమీ లేవు." కుముదిని ముఖం చిన్నబోయింది. "నేనంత మూర్ఖురాల్ని కాదు వదినా. ఇటువంటి ఆస్తికతత్వం గల కుటుంబంలో పుట్టుకతోనే నాస్తికులు జన్మించరు. ఏవో గట్టి కారణాలు మీ అన్నయ్యనలా మార్చేశాయని నా వూహ. వూహేమిటి? గట్టి నమ్మకం కూడాను. అసలు నమ్మకంలేని వాళ్ళు మరొకర్ని కూడా నమ్మవద్దని అనరు. చూచీ చూడ నట్లూరుకుంటారు. పెద్ద కారణాలుండబట్టే మరీ అంత నిరంకుశంగా ప్రవర్తించ గల్గుతున్నారు.''

పద్మ మాట్లాడలేదు.

"పోనీండి. చెప్పవద్దు. నేనూ ఈ కుటుంబంలో ఒకతెనేకదా, తెల్సుకోవచ్చని అడిగాను. అర్హత వుందనుకున్నాను. కారణం తెలిస్తే ఆయనను మార్చగలనేమో అనుకున్నాను.'' నిష్ఠురమాడ్తూ లేచి వెళ్ళిపోబోతున్న కుముదినిని చెయ్యిపట్టుకు ఆపుజేసింది పద్మ. "చెప్తాను వదినా. కాని నీ

మనస్సులోనే వుంచుకోవాలి. అన్నయ్య దగ్గర ఎక్కడా మాట జారకూడదు. ముఖ్యంగా ఎవరిపైనా కోపం, అసూయ తెచ్చుకోకూడదు.''

''నేనటువంటిదానను కాను. కారణం తెలిస్తేసులువుగా మార్చగలనని ఆశ. అంతే.''

కొంచెం సేపు తటపటాయించి కడకు చెప్పింది పద్మ. "మొదట్లో అన్నయ్యకూడ మనలాగే వుండే వాడు. ప్రతిపనికీ ముందు దేవుడిని తలచుకొనే వాడు. ఎంతో భక్తి విశ్వాసాలతో ఆరాధించేవాడు. అటువంటి అన్నయ్య కడకిలా గైపోటావనికి కారణం లేకపో లేదు.'' కొంచెంసేపు ఆగి తిరిగి మొదలెట్టింది."వాడు బియ్యే చదువుతూండగా ఒక సంగతి జరిగింది. 'కమల' అనే అమ్మాయికి ఎవరో వుత్తరం వ్రాశారు. కాని అది అన్నయ్య పేరుతో వుంది. వెనుక ముందు లాలోచించకుండా ప్రిన్స్‌పాల్ అన్నయ్యను సస్పెండ్ చేశాడు. అందరూనమ్మినదే నాన్నగారూ నమ్మి అన్నయ్య నవమానించితే యిల్లు విడచివెళ్ళిపోయాడు, తర్వాత తెల్సినది ఆ వుత్తరం వ్రాసిన వాడు ఒక జమీందారు కొడుకని; కాని యేంప్రయోజనం? అన్నయ్యఅసలెక్కడైనా బ్రతికున్నాడో లేదో కూడతెలియదు. మాకు ఒకతమ్ముడుండేవాడు. వాడు అన్నయ్యపై బెంగతోనే చచ్చిపోయాడు. వెతకగావెతకగా రెండేళ్ళకి అస్సాం టీ తోటల్లో గుమస్తాగా పని చేస్తున్నాడని తెలిసి రెక్కలు కట్టుకు ఎగిరి వెళ్ళారు నాన్నగారు. ఎంత బ్రతిమిలాడినా రాలేదట: 'ఇక ఆ వూరు ముఖం చూడ' నన్నాడట. అందుకని కాపురం ఈ వూరు మార్చేసి, ఏడ్చి, బ్రతిమాలి కడకు అన్నయ్యను యింటికి తీసుకురాగలిగారు. కాని వాడిలో పేరుకుపోయిన భగవత్ ద్వేషాన్ని మాత్రం తొలిగించలేక పోయారు. 'దేవుడేవుంటే ఈ అన్యాయాన్ని అడ్డలేదే'మనే వాడు. 'నిష్కారణంగా నా చదువు పాడైతే నేరం చేసిన వాడు హాయిగా రైల్వే ఆఫీసరై కులుకుతున్నాడు. న్యాయాన్యాయ విచక్షణ జరిపే వాడంటూ పైనవుంటే, యిదేనా ధర్మం?'' అని వాపోయేవాడు. అన్నయ్యే కాదు – ఆ స్థితిలో వున్న ఎవరైనా అలాగే అనుకుంటారేమో ?

"అన్నయ్య పరారీలో వున్నప్పుడే మా మామయ్య కూతురు శకుంతల పెళ్ళి అయిపోయింది; చిన్నప్పటినుంచీ అన్నయ్యకే చేస్తామనుకొనే వారు శకుంతలని. 'నన్నింతగా ప్రేమించినది నా కోసం ఎదురు చూడకుండా, యేమయ్యానో తెల్సుకోకుండా హాయిగా మరొకడిని చేసుకొంది. ఛీ ఆడవాళ్ళే యింత' అని చీదరించుకున్నాడు మొదట. కాని రానురాను పశ్చాత్తాప పడ్డాడు. వున్నాడో లేదో తెలియని వాడికోసం

ఎన్నాళ్ళు చూస్తుంది? అయినా తలిదండ్రులూరుకుంటారా? పోనీ అదైనా సుఖంగా వుంది. అంతే చాలనుకొనే వాడు. కాని యేడాది తిరగకుండానే శకుంతల భర్త చనిపోయాడు. అది తీరని వేదనగా పరిణమించింది అన్నయ్యకు.

'బాబు ఆయుష్మంతుడు గనుక శకుంతలతో పెళ్ళి జరగలేదు. ఆ పెళ్ళికి ఆటంకం కలిగించడానికే కాలేజీలో అంత తతంగం జరిగింది. అది అవమానం కాదు; మనమంచికే.' అంటుంది అమ్మ. 'నాతో పెళ్ళిజరిగితే శకుంతల కంతకష్టం రాకపో'నని వాపోతాడు అన్నయ్య. 'శకుంతల జీవిత మలా నాశనమవ్వకూడదు. మళ్ళీ నేనే చేసుకుంటా'నని పట్టుబట్టాడు కొన్నాళ్ళు. ఎన్నోయేడ్పులు, మొత్తుకోళ్ళు అయ్యాక విధిలేక అమ్మ ఒప్పుకుంది. కాని శకుంతలే తిరస్కరించింది, 'ఆడదానికి రెండోపెళ్ళి అవమాన'మంటూ. ఇలా కష్టాలపై కష్టాలు తరుముకొచ్చి అన్నయ్యనంత విరక్తుడినిగా చేసేశాయి.'' చెప్పటం ముగించి పద్మ తలెత్తేసరికి కుముదిని నేత్రాలు ధారాపాతంగా వర్షిస్తున్నాయి.''అన్నికష్టాలు, అవమానాలు భరించటం మాటలుకాదు వదినా. మీ అన్నయ్య నాస్తికత్వానికే కోపగించుకున్నాను కాని, దాని వెనుక యింత కఠినగాథ వుందని వూహించనైనా లేక పోయాను." కళ్ళుతుడుచుకుంది కుముదిని.

''ఏదో విధంగా అన్నయ్య తిరిగి మారతాడనే నా నమ్మకం. నువ్వు తొందరపడకూడదు వదినా. ఇది నీ ఓర్పుకు పరీక్ష. ఆ ఒక్క విషయంలో మినహా అన్నయ్య ఎంతో సద్గుణవంతుడు.''

"నిజమే.''

''అసలు పెళ్ళేవద్దని భీష్మించుకున్నవాడు, నిన్ను చూడగానే అంగీకరించాడు. అందుకే నీపై అంత యిష్టంలేకపోయినా అన్నయ్య పెళ్ళిచేసుకుంటే చాలని ఒప్పుకుంది అమ్మ. నిన్నంతగా యిష్టపడి చేసుకున్నవాడు ఎప్పుడో ఒకప్పుడు నీ మార్గంలోకి రాకపోడు.''

కమలాకరం హడావుడిగా ప్రవేశించడంతో సంభాషణ ఆగిపోయింది. ''కుముదా! ఢిల్లీ ఉద్యోగానికి ఇంటర్వ్యూ వచ్చింది. త్వరగా పెట్టెసర్దు రేపుదయం ఏడుగంటలకు బయల్దేర్తాను. పద్మా, నువ్వు బెడ్డింగు సర్దవే. నేనలా బజారుకెళ్ళొస్తాను." వచ్చినంత హడావుడిగానూ నిష్క్రమించాడు.

కుముదిని హృదయం ఆనందంతో నాట్యంచేసింది. ''దైవకృపవల్ల ఈ వుద్యోగమైతే ఎవరి ప్రమేయంలేకుండా ఢిల్లీలో యిద్దరం స్వతంత్రంగా వుండొచ్చు. ఇలా ఎవరేమనుకుంటారో అని అడుగడుగునా అణగి పడివుండనక్కర్లేదు. ఆ స్వేచ్ఛా వాతావరణంలో భర్తను మార్చుకొనే అవకాశాలు కూడా వుంటాయి". అని వుత్సాహంగా, ఆశా

జనకంగా తలపోస్తూ భగవంతుడిని మనస్సులోనే ప్రార్థించుకుంది - కమలాకరం చేయబోతున్న ఈ ప్రయాణాన్ని ప్రయోజనకరం చెయ్యమని.

కోటి ఆశలతో కోర్కెలతో భర్త ప్రయాణాని క్కావలసిన వన్నీ రాత్రి ప్రొద్దుపోయేవరకు సర్దుతూ, అవే ఆలోచనలతో పడుకున్న కుముదిని అర్ధరాత్రి వేళ కెవ్వున అరుస్తూ లేచి కూర్చుంది. ''ఏమి'' టంటూ కమలాకరం ఖంగారుగా దగ్గరకు వెళ్ళాడు. గజగజ వణకిపోవటమే కాని మాట్లాడలేకపోయింది కుముదిని. కొంతసేపటికి తేరుకున్నాక ''నోటితో అది చెప్పలేను. యేదో పీడకల. మీరుమాత్రం ఈ ప్రయాణం చెయ్యొద్దు. వుద్యోగం సంగతి దేవుడెరుగు.'' అంది కమలాకరాన్ని గట్టిగా పట్టుకుని.

విస్తుపోతూ చూచాడు కమలాకరం. ''నీకింకా పూర్తిగా మెలకువొచ్చినట్లు లేదు. పడుకో, మాట్లాడక.''

''కాదు. తెలిసే మాట్లాడుతున్నాను. నామాట త్రోసెయ్యకండి.'' కన్నీళ్లు బొట బొటా కారిపోతున్నాయి, కుముదిని నేత్రాలనుండి.

''వుష్. పడుకోమంటూంటే, అర్ధరాత్రి లేచి ఏమిటీ గొడవ?'' విసుక్కుంటూ అటు తిరిగి పడుకున్నాడు.

కుముదిని మరి మాట్లాడలేదు. కాని ఆ రాత్రంతా యిక ఆమెకు నిద్రపట్టలేదు. భయంకరమైన ఆలోచనలనుండి తప్పించుకోవటానికి యేదో పత్రిక తిరగేస్తూ జాగారం చేసింది.

ఉదయమే లేచి ప్రయాణానికి తయారౌతున్న భర్తను కొంచెంసేపు చూచి, మాట్లాడే ధైర్యంలేక అత్తగారి దగ్గరకు పరుగెట్టింది. కాఫీ కలుపుతూన్న సావిత్రి ''ఏమ?'' న్నట్లు తలెత్తి చూచింది. ''ఈ ప్రయాణం వద్దని చెప్పండి. నాకేమిటో రాత్రి భయంకరమైన కల వచ్చింది. చూట్టూ శవాలమధ్యన ఆయన రక్తంతో తడిసివున్న బట్టలతో భయంకరంగా నవ్వుతున్నట్లు, ఎవరో ఏడుస్తున్నట్లు-అబ్బా చెప్పలేను. వెళ్ళండి అత్తయ్యా, చెప్పండి.'' అంది. ఎప్పుడూ గంభీరంగా, ధైర్యంగా నిండుదనం తొణికిసలాడ్తూవుండే కోడలు అలా వెక్కెక్కిపడి ఏడుస్తూంటే సావిత్రి ఖంగారుపడిపోయింది. అందులోనూ కుముదిని వర్ణించిన స్వప్న దృశ్యం వినడంతో ఆమెకూ మనస్సులో కలవరం బయల్దేరింది. ''పద్మా, అన్నయ్య నిలా పిలువు.'' అని ఫర్మాయించింది.

కమలాకరం వచ్చాడు. వస్తూనే ఒక్కసారి కుముదినినీ సావిత్రినీ పరీక్షగా చూచి ''ఏం? ఈవిడగా రేమైనా రాయబారం చెయ్యమన్నదా నిన్ను? చాల్లే, తీరికూర్చుని మీరు కనే కలలన్నీ నమ్ముకుంటే యిక పను లయినట్లే,'' అన్నాడు కోపంగా.



''ఎంత అందంగా ఉంది చీరె!''

'' ఇంకా మాట వినకుండానే అలా మండిపడతావేం ఖర్మ? నాకూ ఏమిటో అపశకునాలు తోస్తున్నాయి. లేచీ లేవ డంతోనే పిల్లి ఎదురైం దీవేళ. కుము దాని కేదో కలవచ్చిందట. ఒకటే ఏడు స్తోంది. నామాట విని ఈ ప్రయాణం మానెయ్యి నాయనా. ఇదివర కెప్పుడైనా యిలా అడ్డుపెట్టామా చెప్పు? ''

ఉగ్రుడై పోయాడు కమలాకరం. ''నేనెంతో వుత్సాహంగా వెళ్తుంటే ఏమిటీ ఆటంకాలు? నీ గ్రుడ్డినమ్మకాలూ, పిచ్చిదేవుళ్ళ మహిమలూ నాదగ్గఱకాదు, నేను వెళ్లేతీర్తాను. అవకాశా లొచ్చేదే బహుతక్కువ. వాటినిలా నాశనం చేసు కొనే మూర్ఖుడిని కాదు నేను.'' అంటూనే అక్కడినుండి చకచకా వెళ్లిపోయాడు.

"ఏంచేస్తా మరి, చెప్పినమాట వినని వాడితో? అన్నిటికీ ఆ ఏడుకొండలవాడే వున్నాడు. వెళ్లి యేం కావాలో చూడు." అంటూ కోడల్ని ఓదార్చింది సావిత్రి.

భగవంతుడిపై భారంవేసి హృద యం శాంతపరచుకుంది కుముదిని. కాఫీ తీసుకువెళ్లి భర్తకందించి మౌ నంగా అక్కడే నిల్చుంది. కాని లోపల మహాభారత సంగ్రామం జరుగుతోంది, భావాలకు. "తిరుపతి ప్రయాణంలోనే నీ మహిమంతా చూపావు. కాని పిల్లలు పొరపడితే మాత్రం, తండ్రివి-ఆగ్రహిం చడం తగునా స్వామీ? నీకంతగా ఆప రాని ఆగ్రహమే కలిగితే నన్ను తీసుకుపో, నిత్యం నీ చరణారవింద పూజ సల్పుతాను. మరుజన్మలోనైనా

మనస్సునిచ్చే భర్తననుగ్రహిద్దువుగాని, కాని నామాంగల్యాన్ని నశింపజేసి నా జీవితాన్ని నరకం మాత్రం చెయ్యవద్దు. ఏడుకొండల వాడా, వేంకటరమణా, ఇదే నా కోరిక ఇంకెప్పుడూ నిన్నేమీ కోరను." నిర్మల హృదయంతో దైవ ప్రార్థన చేసుకొన్నాక బాధాహృదయం తేలిక పడింది, అప్పు డామె ముఖంలో యే భావమూ వ్యక్తం కావడంలేదు. ఆ ప్రశాంత వదనం చూడగా కమలాకరం మదిలో కోపం అంతరించి ప్రేమాభిమానాలు నిండిపోసాగాయి. "పెళ్లవద్దన్నందుకే కోపగించు కొన్నాను కాని రాత్రింబవళ్లు ఆమె ధ్యాసంతా నా యోగక్షేమాల పైననే కదా!" అనుకొన్న అతడి హృదయం గర్వంతో వాత్సల్యంతో పరవళ్లు త్రొక్కింది.

"నా కింతలోనే ఏమీ అయిపోదులే కుముదినీ. భయపడకు. దేవుళ్లు, దైయ్యాలు సంగతెలా వున్నా అనునిత్యం నీ ప్రసన్న హృదయం వేయి కండ్లతో నా చుట్టూ పరిభ్రమిస్తూంటే నీ పరిధిదాటి నేనెక్కడికి పోతాను? నీ ప్రేమే నాకు వెయ్యి ఏనుగుల బలం'' అన్నాడు ప్రసన్న వదనంతో, మార్దవ కంఠంతో

కుముదినీదేవి కళ్లు ఆనందంతో విచిత్రంగా మెరిశాయి. పెళ్లైన తర్వాత ఈ మూడు నెలలలోనూ అటువంటి ప్రేమాస్పదమైన మాటలు ఎన్నడూ భర్త నోటినుండి వెలువడలేదు. సందేహం లేదు. అతడిలో మార్పు వస్తోందనడాని కిది ప్రథమ చిహ్నం. మనస్సులోనే అంజలి ఘటించింది కృపామూర్తి అయిన సర్వేశ్వరుడికి.

పెళ్ళైముందు ''ఢిల్లీనుంచి యేం తెమ్మంటారు?" అనడిగాడు కమలాకరం చెల్లెల్నీ భార్యనూ.

''నాకు మంచి ముత్యాల దుద్దులు తెచ్చిపెట్టన్నయ్యా. ఏదైనా ఒకసిల్కు చీర.'' నవ్వుతూ సర్దాగా చెప్పింది పద్మ.

"అలాగే. మరి తమరికో శ్రీమతీజీ?" హాస్యంగా భార్యవైపు తిరిగాడు.

నవ్వింది కుముదిని. "క్షేమంగా లాభంగా తిరిగిరండి.''

"ఆల్‌రైట్. అది సరే. ఫలాన వస్తువని చెప్పు. తీసుకొస్తాను"

''మీ యిష్టం. మీకేం తోస్తే అది'' రాత్రి పీడకల మనస్సులో మెదుల్తూండగా పరధ్యానంగా జవాబిచ్చింది కుముదిని.

నవ్వుతూన్న కమలాకరం ముఖంలో అప్రసన్న మేఘాలు ఆవరించాయి. "నీ యిష్టం-నీ యిష్టం అనకపోతే నీవు తెచ్చిన వక్కర్లేదని చెప్పరాదూ? ఛీ.'' చికాకు పడ్తూ వెళ్ళిపోయాడు ఆ చికాకులో యింకెవరితోనూ ఏమీ మాట్లాడలేదు. రిక్షా ఎక్కుతూంటే తండ్రి అడిగాడు. "మళ్ళీ ఎప్పుడొస్తావు రా?''

"శనివారం మెయిలెక్కుతాను మళ్ళీ.'' ముక్తసరిగా చెప్పి వెళ్ళిపోయాడు.

తప్పనిసరిగా నవ్వు ముఖంతో సాగ నంపిందే కాని అతడు వెళ్ళి నదగ్గర్నుంచీ కుముదిని హృదయం ఆరాటంతో బాధపడ సాగింది. ఎంత సరిపెట్టుకోజూచినా ద్వైదీభావాలు ఆమె హృదయాన్ని మధించివేస్తున్నాయి. ఇటీవల తన విషయంలో అత్తగారికి ఏర్పడిన సద్భావం కాని, ఆడపడచు సహృదయత కాని ఆమెకు శాంతిని చేకూర్చలేక పోయాయి. అలాగే అయిదు రోజులు గడచిపోయాయి. "క్షేమంగా జేరాననీ, యింటర్వ్యూబాగా జరిగిందనీ, ఆ రోజూ, మర్నాడూ నగరమంతాచూచి బయల్దేరుతాననీ తండ్రిపేర వుత్తరం వ్రాశాడు కమలాకరం. ''అయితే ఈ పాటికి ట్రెయి నెక్కి వుంటారు" అనుకొంది కుముదిని. "నాపై కోపం తగ్గలేదు కాబోలు! పోనీ క్షేమంగా వుంటే అంతే చాలు'' అని సరిపెట్టుకొంది భర్త తనకు లెటరు వ్రాయక పోవటం గూర్చి.

శనివారం రాత్రి పడుకొన్నదే కాని ఒక్క క్షణం కూడా నిద్రపోలేదు. ఏదో కలవరపాటు వూపివేయగా ఎందుకో తెలియని దుఃఖం పెల్లుబికింది. రాత్రంతా యిష్టదైవమైన ఆ కళ్యాణ వేంకటేశ్వరుని జపిస్తూనే వుంది.

ఆదివారం ఉదయం నిద్రలేస్తూనే ఏమిటో అశాంతిగా అల్లకల్లోలంగా వుంది కుముదినీ దేవి మనస్సు. 'భర్త చెప్పినట్లు యే నమ్మకమూ లేకపోతేనే మనశ్శాంతి ఎక్కువగా వుంటుందేమో! లేకుంటే ఏదో కల రావడమేమిటి — తాను దానిని మూర్ఖంగా భర్త జీవితాని కన్వయించుకు బాధపడడమేమిటి? నిజంగా మూర్ఖత్వమే! ఎంత చదువు చదివినా పాత సాంప్రదాయాలలో పెరిగినందువల్ల యీలా గున్నాను.' తన అర్థంలేని ఆందోళనకు తానే లోలోన నవ్వుకొంటూ ముఖం కడుక్కు స్నానంచేసింది. అయినా ఎంత సరిపెట్టుకుందామన్నా అంతరంగాన చెలరేగుతున్న ఆ అవ్యక్త ఆవేదన అణగారలేదు. తల దువ్వుకుని జడ వేసుకుంటూ వంటింట్లో కెళ్ళింది అత్తగారి కేమైనా సాయంచేద్దామనే వుద్దేశ్యంతో.

సావిత్రి పూజా మందిరం దగ్గర వుంది, అప్పుడే పూజ ముగించి హారతి యిస్తోంది. కుముదిని వెళ్ళి కొద్ది దూరంలో కూర్చుని నిశ్చలంగా ఆ భగవద్విగ్రహాలను అవలోకించింది. నీరాజనం కళ్ళకద్దుకు లేవబోతూంటే సావిత్రి రెండు పూజా పుష్పాలు తీసిచ్చింది. ఇంట్లో అందరితోను అణకువగా ప్రేమగా వుంటూన్న కోడలిపై ఆమె అకారణ కోపం అంతకంతకు తగ్గుతోంది. సావిత్రి యిచ్చిన పూజా కుసుమాలు భక్తితో అందుకుని వేణిలో అమర్చుకుంటూ మరొక్కసారి భగవంతునికి మ్రొక్కి లేచింది కుముదిని.

రేడియో దగ్గఱకూర్చుని భక్తిరంజని

వింటూన్న- పద్మదగ్గరవెళ్ళి కూర్చుంది. రేడియోవినడం మర్చిపోయి కబుర్లతో పడిన యిద్దరూ హఠాత్తుగాపిడుగుపడ్డట్టు విన్పించినవార్తతో బిగుసుకు పోయారు. భక్తిరంజనిపూర్తైవార్తలెప్పుడు మొదలయ్యాయోమరి! 'కడచిన రాత్రి పంజాబ్ మెయిల్, కలకత్తాకు డెబ్బై మైళ్ళదూరంలో ఘోర ప్రమాదానికి గురైంది. నాశనమైన బోగీలలో ఒక ఫస్ట్‌క్లాస్, రెండు సెకండు క్లాస్ కంపార్టు మెంట్లుకూడా వున్నాయి. విశేషజననష్టం ......'' చెవులు గళ్ళుపడ్డాయి కుముది నికి, యింకేమీ విన్పించలేదు, ఎదుటి వస్తువులన్నీ కళ్ళకు గిర గిర తిరిగిపోతూ అయోమయమైపోయాయి. లోకమంతా అంధకారంగా కన్పించింది. కనులు చీకట్లుక్రమ్మి నేలకొరిగింది.

మర్నాడు సాయంత్రం నీరసంగా కనులుతెరువబోయిన కుముదినీదేవి చెవు లకు ముందు కమలాకరం కంఠమే విన్పించింది! కనులుతెరవగానే కమలాక రం మూర్తే దర్శనమిచ్చింది—అనేకంటే కమలాకరంపిలుపుకే కుముదినికి స్పృహ వచ్చిందంటే న్యాయంగా వుంటుంది. ఏ లోకాలలోనో ఎగురుతూన్న ఆత్మ కమలాకరం కంఠస్వరం విని దిగివచ్చి శరీరాన్ని జేరిం దనడం సబబుగా వుం టుంది.

అంతా అయోమయంగావుంది! భర్త, ఆడపడచు, అత్తమామలు, తల్లిదండ్రులు అందరూ తనచుట్టూజేరివున్నారు. ఆత్రం వ్యక్తపరుస్తూ. అందరి ముఖాలు ఏడ్చి ఏడ్చి మలినమైనట్లే వున్నాయి. మెల్లగా గుర్తుకు రాసాగింది కుముదినికి— హౌరామెయిల్......శనివారం రాత్రి.. ప్రమాదం......

"మీరువచ్చారా?మీరు??" పరిసరాలు కూడ గమనించకుండా భర్త రెండు చేతులూ పట్టుకు కన్నీరు కురిపించ సాగింది.

'వచ్చాను కుముదా, వచ్చాను!చెప్పాను కదా- నామూర్తికి నీ హృదయంలో పవిత్రఆరాధన జరిగినంతకాలం నేనేమీ అయిపోను.' అతడికి కూడ కన్నీళ్ళు ఆగడంలేదు.

పరిస్థితి శాంతపడ్డాక మెల్లగా అన్నీ తెలిసివచ్చాయి కుముదినికి. అర్ధరాత్రి వేళ హోరున కురిసేవానలో జరిగింది ఆ ప్రమాదం. షంటింగ్‌కు నిల్చివున్న గూడ్సును మెయిల్ ఢీకొన్న ఫలితంగా జరిగింది. ఆ ప్రమాదం. ఎదర పెట్టె లన్నీ తుక్కు- తుక్కై-పోయాయి. చాలా జననష్టంజరిగింది. సరిగాఆవెనుకచెక్కు- చెదరక నిల్చివున్న పెట్టెలలో మొదటి దానిలోవున్నాడు కమలాకరం. పెద్ద వూపుతో ఆగిపోయింది తమ బోగీ. విపరీతమైనశబ్దం—హాహాకారాలు—అబ్బా- వర్ణించలేకపోయాడు కమలాకరం. వింటూన్నకుముదిని వణకిపోతూ చెవులు మూసుకుంది. నిశ్శబ్దంగా రెండు అశ్రు

బిందువులు వదిలింది ప్రమాదానికిగురైన ఆ అభాగ్యులను తలచుకుంటూ.

ఆ వెంటనే తాను క్షేమంగా వున్నట్లు యింటికి వైరిచ్చాడు కమలాకరం. కాని స్పృహతప్పిన పరిస్థితిలోవున్న కుముది నికి అదేమీతెలియదు. ఖంగారు పడి, టెలిగ్రాముద్వారా కుముదిని తల్లిదండ్రు లను రప్పించాడు వెంకటాచలం.

"నీ సౌభాగ్యం గొప్పది. అందుకే నాకొడుకు తిరిగి వచ్చాడు." అంటూ కుముదినిని ఆప్యాయంగా అక్కునజేర్చు కొంది సావిత్రి. ప్రతివారి నోటినుండీ అదేమాట!— "కుముదిని పసుపు కుంకు మలుగట్టివి:మాంగల్యం మహిమగలది'' ఆమాటలువింటూ కమలాకరం హృద యం వుప్పొంగిపోయింది.

కమలాకరం క్షేమంగా తిరిగి రావడంతో కలిగినసంతోషంలోఆ రాత్రి యింట్లో ఎవరికీనిద్రాహారాలప్రసక్తేలేదు.

''మరోవిధంగా జరిగితే యేంచేద్దువు కుముదా?'' ఏకాంతంలో మెల్లగా అడి గాడు కమలాకరం.

అతడినోరుమూసింది కుముదిని ''నా విషయమూ మరోవిధంగానే జరుగును. ఆ అపస్మారకస్థితి అలా శాశ్వతనిద్రగా మారును.'' ఇద్దరి నేత్రాలూ జలపాతా లయ్యాయి.

కొంత సేపటికి కమలాకరంచెప్పాడు. "ఎంత ఆశ్చర్యం కుముదా? మొదట ఒక సెకండ్‌క్లాస్ కంపార్టుమెంటులోఎక్కాను. కాని అందులో వాసుదేవరావని ఒక రైల్వే ఆఫీసర్ వున్నాడు. వాడు నాకు జన్మవిరోధి,నీకీవిషయాన్నెప్పుడూచెప్ప లేదు...కాలేజీలోవాడు నాసహాధ్యాయి...

''చెప్పనక్కర్లేదు.నాకు తెల్సులెండి'

"తెలుసా?" ఆశ్చర్యంగా, సందే హంగా అడిగాడు.

"వదిన చెప్పారు. కాని కలవరపడ కండి, నాకు మీపై అనుమానం కాని, అగౌరవంకాని లేవు. ఆ విషసర్పం కారణంగా మీరు బాధపడ్డారని తెల్సి ఎంత గానో విచారించాను''

"వూఁ!'' నిట్టూర్చాడు కమలాకరం. "అదంతా ఒక పీడకల కుముదినీ, వాడిని చూడగానే తిరిగి అంత బాధా అనుభ వించాను. కంపార్ట్‌మెంట్‌లోవున్న మరో యిద్దరు ప్రయాణీకులు నిద్ర పోతున్నారు. 'వాడిని చంపిపారేసి నా కక్ష తీర్చుకోవటానికి యిదేమంచిఅదను, ఎవరు చూడొస్తారు?' అన్పించింది. కాని ఆ ఆవేశాన్నంతనూ ఎలా అణచు కొన్నానో నాకే తెలియదు. వెంటనే దిగి పోయి మరో కంపార్టుమెంట్‌లో ఎక్కాను. 'కాని దొరికిన అవకాశం పోగొట్టుకుంటున్నానా?' అని బాధపడ్తూనే వున్నాను. వాడు మాత్రం నన్ను గుర్తు పట్టలేదు. పాడుగునా ఆ రైలులోనే ప్రయాణంచేశాడు."

"వూఁ, అయితే ?" కుతూహలంగా ప్రశ్నించింది కుముదిని.

"నేను శ్రమపడకుండానే నా కక్ష తీరిపోయింది. పడిపోయిన రెండు సెకండ్ క్లాస్ పెట్టెలలోను ఒకటి వాడున్నది! ఆకారంకూడ మిగలకుండా తుక్కు-తుక్కయ్యాడు."

కుముదిని నిర్విణ్ణురాలైంది. ఏమీ మాట్లాడలేకపోయింది.

"ఆ భీభత్సంచూశాక ఏమిటో మనసు చలించిపోయింది. మనస్సులో కోపం పోయి 'అయ్యో!' అన్పించింది. కాని వాడే గనుక ఆ కంపార్ట్‌మెంటులో లేకపోతే నేనందులోనే వుందును. మళ్ళీ తిరిగి రాకపోదును."

"వాడు చేసిన తప్పుకు ఒకప్పుడు మీరు శిక్ష అనుభవించారు. వడ్డీతోకలిసి పెరిగి పెద్దదైపోయిన ఆ బాకీ యిప్పుడు తీరినట్లుంది!" నిర్లిప్తంగా అంది.

"అంతేనంటావా? అవును. వాడి మూలంగానేగా మా తమ్ముడు చచ్చిపోయాడు? వాడిమూలంగానే శకుంతల వితంతువైంది? అయినా చనిపోయే ముందు ఒక్కసారి కల్సుకోవడం ఏమిటో ఆశ్చర్యంగా వుంది!" కుముదిని విని వూరుకుంది.

"నీకెంత ప్రేమ కుముదినీ నామీద! నా ప్రమాదం వినగానే తప్పిపోయిన స్పృహ నా పిలుపుకు మేల్కొంది. నేనెంత గర్విస్తున్నానో తెలుసా? నీ ప్రేమ బలమే నన్ను బ్రతికించింది.'' అన్నాడు ఆవేశంగా.

నిర్జీవంగా నవ్వింది కుముధిని. "భార్యల ప్రేమలకూ, పూజలకే భర్తల ఆయుః ప్రమాణాలు పెరుగుతాయా? మీతోపాటు యింకా చాలమంది బ్రతికి బాగున్నారు. మరి చాల మంది చచ్చిపోయారు.'' ఛెళ్ళున కొట్టినట్లయింది కమలాకరానికి. శ్రావణమాసం నోములనూ, పేరంటాళ్ళనూ తాను అపహేళన చెయ్యడం మనస్సులో వుంచుకునే కుముదిని ఆ మాట అన్నదని గ్రహించాడు. ఎందుకో అతడి మనస్సు చిన్నబోయింది. ఇంకేమీ మాట్లాడకుండా పడుకున్నాడు.

మర్నాడుదయం తాను వెళ్ళిన యింటర్వ్యూ గురించి కుముదినితో చెప్తున్నాడు కమలాకరం "నాకా ఉద్యోగం తప్పకుండా వస్తుందనే నమ్మిక వుంది కుముదా.''

"నాకూ అలానే అన్పిస్తోంది.''

"వదినా!" పద్మ ప్రవేశించింది. ''నేనూ, అమ్మా, నాన్నగారూ ఆలయానికి వెళ్తున్నాం, పూజలూ అభిషేకాలూ చేయించటానికి. నువ్వూ రా."

"మీరు వెళ్ళండి వదినా." కుముదిని చాల మెల్లగా అంది.

పద్మ అన్నకు దగ్గరగా నడిచింది. ''దేవుడే కాయకపోతే యింత ప్రమాదం గడచి బయటపడుదువా అన్నయ్యా?



"కొంచెం సిగ్గుపడండి"

ఇకనైనా నువ్వు ఆ అర్థంలేని పంతాలు ఒదులుకోవటం మంచిది.''

కమలాకరం మాట్లాడకుండా చెప్పులు వేసుకు బయటకు వెళ్ళిపోయాడు. మళ్లీ వదిన దగ్గరగా వెళ్ళింది పద్మ. "ఈ సంతోష సమయంలో నువ్వెలా ప్రవర్తించినా అన్నయ్యకు కోపంరాదు వదినా. అందుకే నిర్ణయాన్ని నీకే వది లేసి అన్నయ్య అలా వెళ్ళిపోయాడు; గ్రహించలేదూ నువ్వు?"

"గ్రహించాను వదినా. ఆయనలో మెల్లగా మార్పువస్తోంది. కాని అదింకా పటిష్టమై పూర్తిగా మారాలి. మొన్న తిరుపతి ఆలయంలో అలాగే మ్రొక్కు కున్నాను ఈ నాస్తిక భర్త తిరిగి ఆస్తి కుడుగా మారినప్పుడే జంటగా దర్శనం చేసుకొంటామని. దేవుడు నా మొర వింటాడు. నన్ను క్షమిస్తాడు. అంత వరకు మనస్సులోనే ప్రార్థిస్తుంటాను. మీరంతా వెళ్ళి పూజలు సక్రమంగా జరి పించిరండి." కళ్ళు ఒత్తుకుంటూ చెప్పింది కుముదిని. పద్మ వెళ్ళి పోయింది

ఒక గంట గడిచాక తిరిగివచ్చిన కమలాకరం కుముదిని వున్నచోటే వుండడం చూచి చకితుడయ్యాడు. ఆమె ఆలయానికి వెళ్ళి వుంటుందనే రూఢి నమ్మకంతో వచ్చిన అతడికి ఆశాభంగమే అయ్యింది.

"కుముదం, ఎందు కేడుస్తున్నావ్?"

"నేనా? లేదే!" కళ్లు తుడుచుకు నవ్వింది.

"ఓహో! లేదా? అయితే సరే."

మధ్యాహ్నం భోజనాలైన తర్వాత కుముదిని తల్లీతండ్రీ వెళ్ళిపోయారు. కుముదినిని రమ్మంటే రానన్నది. వెంకటచలం సావిత్రీ కూడ వెళ్ళ మన్నారు. కమలాకరం కూడా వస్తానన్నాడు. అయినా కుముదిని అంగీకరించ లేదు. ఆమె ఆలోచన లేమిటో ఎవ్వరికీ అర్థమవ్వవు. ఎంతో పరధ్యానంగా వుంటున్నది. ఎవ్వరికీ చెప్పదు.

"సాయంత్రం ఏదైనా సినిమా కెళ్దామన్నయ్యా?" అనడిగింది పద్మ.

"అలాగే. ఏం కుముదా, వెళ్దామా?" అన్నాడు కమలాకరం.

"మీ యిష్టం. వెళ్దాం లెండి" అని చటుక్కున నాలుక కఱచుకొంది. అతడు ఢిల్లీ వెళ్ళేముందు ఈ మాట గురించే కోపం తెచ్చుకున్నాడు. ఆ విషయం యిద్దరికీ గుర్తుకు వచ్చి యిద్దరూ చెరో విధంగానూ బాధపడ్డారు.

'అలా అని వుండకూడ' దనుకొంది కుముదిని.

"మాటల అర్థాలు మాట్లాడే మనుష్యుల మనస్సులను అర్థంచేసుకోవడం బట్టికూడా వుంటాయి కుముదా." అన్నాడు కమలాకరం నవ్వుతూ, ఆమె మాటలు తనకు కోపం తెప్పించలేదనే భావం ధ్వనింపజేస్తూ, నవ్వి వూరుకుంది కుముదిని. ఇదివరలో ఈ 'మీ యిష్టం' అనే మాటలో ఎంతో నిర్లక్ష్యం దాగి వున్నట్లు తోచి కోపం వచ్చింది కమలాకరానికి. ఆ కోపంతోనే ఢిల్లీనుంచి యేమీ తీసుకు రాలేదు. కాని యివ్వాళ 'మీ యిష్టం' అనే కుముదిని మాటలో అతడికెంతో గౌరవం, అభిమానం ద్యోతకమయ్యాయి.

సాయంత్రం "సినీమా టైమౌతోంది కుముదా." అంటూ లోపలికొచ్చిన కమలాకరం యింకా కుముదిని పడుకునే వుండడం చూచి ఆశ్చర్యపోయాడు.

"ఏం. సినీమా ప్రోగ్రాం లేదా?" అనడిగాడు.

"మీరూ, పద్మా వెళ్ళండి. నాకు కొంచం జ్వరం వచ్చినట్లుంది".

"అరె జ్వరమా?" ఆత్రంగా దగ్గర కెళ్ళి ముఖంపై చెయ్యివేసి చూచాడు, కొద్దిగా వేడిగావుంది. "ఫర్వాలేదు. రేపటికి తగ్గిపోతుంది. ఏం; అమ్మమీద బెంగపెట్టుకున్నావా పాపాయి, ఆమె వెళ్ళిపోయిందని?" అని హాస్యంచేశాడు. కుముదిని కూడ చిన్నగానవ్వి వూరుకుంది.

చాలా సేపు యేదో ఆలోచిస్తూ వుండిపోయాడు కమలాకరం, కడకు "కుముదా! ఒక్క టడగనా?" అన్నాడు.

"ఏమి టది?"

"ఏమిటో మనం దూరమై పోతున్నట్లు అన్పిస్తోంది. చాలా ముభావంగా వుంటు

న్నావ్. 'కారణం తెలియటంలేదు. ప్రొద్దున్న ఎందుకో ఏడుస్తున్నావ్. అడిగితే చెప్పలేదు."

''......''

''నేను ప్రమాదం దాటి సురక్షితంగా వచ్చినందుకు నువ్వు చాలా సంతోషిస్తావ్, ఇంకా దగ్గరౌతా వనుకున్నాను. కాని మన మధ్య అగాధం అలాగే వుండి పోయింది. ఇంకా పెద్దదైనట్టు కూడా అన్పిస్తూంది. బహుశః ప్రమాదవార్త వినగానే నువ్వుపడ్డ 'షాక్,' నుండి యింకా తేరుకోలే దనుకుంటాను."

అప్పటికీ మాట్లాడలేదు కుముదిని.

''మాట్లాడవేం కుముదా ? నీ ప్రేమ బలంవల్ల బ్రతికివచ్చిన నాకు నీ నోటి నుండి ప్రేమవాక్కులు వినరాకపోవటం చాలా బాధగావుంది. ఎందుకింత ముభావంగా మారిపోయావ్ ? అమ్మ యేమైనా అన్నదా ?''

నిశ్చలంగా జవాబిచ్చింది కుముదిని. ''ఎవ్వరూ ఏమీ అనలేదు. కాని మీరు మరీ యింతగా ధైర్యం కోల్పోయారేమిటీ ? నా ప్రేమబలమెంత ? నేనెంత ? ఎన్నో ప్రమాదాలు జరుగుతాయి. వాటిలో చాలామంది బ్రతికి బాగుంటారు. ఒక మనిషి బాగోగులకు మరొకరితో నిమిత్తమేముంది ? నా ప్రేమబలం వలన తిరిగి వచ్చారో – లేక ప్రయాణానికి నేను పెట్టిన ఆటంకం వల్లనే ప్రమాదం జరిగిందో ? ఏం చెప్పగలం ?"

కమలాకరం మనస్సు కొంచం కించపడ్డది. ఏమీ మాట్లాడలేక పోయాడు. ఇదివరలోవలె భార్య మాటలను నిర్మొహమాటంగా ఖండించడానికి అతడు సాహసించ లేదు. అతడికే తెలియని ఓ మృదులత అతడి హృదయా న్నావరించింది. ప్రతి చిన్న విషయానికీ చికాకుపడే కటుత్వం ఏమైందో మరి !

''చూడండీ," కుముదిని మెల్లగా ప్రారంభించింది. ''మీ కనుల ముందే ఘోర ప్రమాదం జరిగింది. మీతో ప్రయాణం చేస్తున్న కొందరు అలా చచ్చిపోవడం, మీరు క్షేమంగా వుండడం ఎలా జరిగిందంటారు ? అదృష్ట దురదృష్టాలను న్యాయాన్యాయాలను పరీక్షించి నిర్ణయించే అధికారి–మనకు అగోచరమైన సూత్రధారి ఒకడు పైన వున్నాడని ఎందుకనుకోరు ? 'నీవల్ల బ్రతికాను కుముదా, నీ ప్రేమవల్ల తిరిగొచ్చాను కుముదా' – ఎంతసేపూ యిదే మాట ! సాధారణ మానవ మాత్రురాల్ని నేనెంత? ఆ శ్రీనివాసుడిని మరచిపోయి ఆయన పాదాలముందు గడ్డిపోచమాత్రం కూడా చెయ్యని నన్ను పొగుడ్తూంటే నా హృదయమెంత క్షోభిస్తూందో మీకేం తెల్సు ?" ఇక ఆపుకోలేక భోరున యేడ్చేసింది.

నిశ్శబ్దంగా కుముదిని తల నిమరడం తప్ప కమలాకరం నోరు విప్పి ఒక్క మాటకూడ మాట్లాడలేదు. అయిదు నిము

షాల కాలం అలా కూర్చుని మెల్లగా లేచి వెళ్ళిపోయాడు. కుముదినికి ఆశ్చర్య మైంది: అనేక చిత్రవిచిత్ర కార్యా లొనర్చుతూన్న మానవ మేధస్సుపైనా, విపరీత పరిణతి నందుతున్న ఆధునిక విజ్ఞానంపైనా, మూఢ మానవుల వూహా లోకంలోనే కాని యదార్ధ అస్తిత్వం, ఆకృతీలేని భగవంతుడనబడే పదార్థం యొక్క అప్రయోజకత్వంపైనా అతడు అనర్గళంగా వుపన్యాసమిస్తాడనుకొని వూహించిన ఆమెకు ఆశాభంగమే అయింది.

మర్నాడుకూడా కుముదినికి జ్వరం తగ్గలేదు. కమలాకరం మనస్సేమీ బాగుండలేదు. ఆఫీసుకు వెళ్ళినా అతడి దృష్టి అంతా యింటిపైననే వున్నది. ముఖ్యంగా కుముదినీదేవి ముభావతకు కారణమేమిటో తెలియక మనస్సు కొట్టు మిట్లాడిపోతోంది. ప్రయాణం ముందు రోజు రాత్రి కుముదినికి వచ్చిన స్వప్న వృత్తాంతం, ప్రయాణంలో జరిగిన ప్రమాదం, ఇప్పుడు కుముదిని జ్వరం, తన చిత్త వైకల్యం - ఈ అన్నింటినీ అతడి మనస్సు సమన్వయ పరచ ప్రయత్నిస్తోంది ; కాని సాధ్యపడటం లేదు.

సాయంకాలం డాక్టర్ని వెంటబెట్టు కొచ్చాడు యింటికి. "ఆందోళన అనవ సరం. వట్టి టెంపరేచర్." అంటూ యింజక్షన్ చేసి మందుకు పంపించమని వెళ్ళిపోయాడు. ఆ వట్టి టెంపరేచరే వారంరోజులైనా తగ్గలేదు. డాక్టర్ మందు యిస్తూనేవున్నాడు; ఈ షణ్మాత్రమైనా తగ్గలేదు; గుణం కన్పించలేదు. పోనీ ఫలానీజబ్బని నిర్ణయించడానికి కింకే లక్ష ణాలూలేవు. కేవలం శారీరకోష్ణోగ్రత, ఆరోజుకారోజు నీరసించిపోవడంమినహా మరేరుగ్మతాలేదు. కమలాకరాని కించు మించు మతిపోయింది, కుముదిని వాదిం చినావినక ఆఫీసుకు సెలవుపెట్టేశాడు. ఇరవైనాల్గు గంటలూ ఆమె మంచం ప్రక్కనే గడుపుతున్నాడు.

డాక్టర్ని మార్చినా జబ్బేమిటో, అంతు పట్టలేదు. నెల రోజులు తిరిగినా రోగం తగ్గుముఖంపెట్టలేదు. అంతకంతకు కుముదినివదనం కళాహీనమైపోతోంది. ప్రక్కమీదినుంచిలేచి రెండడుగులైనా వెయ్యలేకపోతోంది. అయినా నోరువిప్పి ఫలానాబాధ అనిచెప్పదు. ముక్తసరిగాఏం లేదంటుంది. తల్లి దండ్రులకు కబురు వెళ్ళింది. వచ్చారు. తల్లితోకూడా కుము దిని ఎక్కువగా మాట్లాడలేదు. సావిత్రి మొక్కనిదైవం, చెయ్యని పూజా లేదు. రోజూ యేవో ముడుపులు కడుతూనే వుంది. కడకు భూత వైద్యాలు చేయించి రక్షరేకులుకూడా కట్టిస్తోంది. 'పెళ్ళే వద్దన్నకొడుకు కోరి చేసుకున్న పిల్ల లేక పోతే అతడేమైపోతాడు?' అని గడ గడ లాడిపోయింది. అన్నీ చూస్తూ వూరుకో

పదక్షేకాని కమలాకరం దేవికీ ఆటంకం పెట్టడంలేదు.

భాద్రపదంగడచి వానలు తగ్గుముఖం పట్టాయి. ఆశ్వయుజమాసపుచలి మెల్లగా అడుగెట్టింది. కమలాకరం గుండెలలో గుబులు ప్రవేశించింది. "నా కేమీ అంతు పట్టడంలేదు. విశాఖపట్నం తీసుకెళ్ళ''మని సలహాయిచ్చాడు డాక్టరు. అప్పటి నుంచి అతడికి పూర్తిగా ధైర్యంపోయింది. ఒక ప్రక్కన కుముదిని, "ఎక్కడికీ అక్కర్లేదు ఆయువులేనివాళ్లు ఎక్కడా బ్రతకరు." అంటూ మొండికేసింది. అతడికి ఏటూ తోచడంలేదు.

సాయంకాలం పదినగదిలో లైటు వెయ్యడానికి వచ్చింది పద్మ. వైజాగ్ వెళ్ళడానికి అన్నీ సిద్ధంచేసుకునే ప్రయత్నంలో వున్నారు మిగిలిన అందరూ. తూర్పువైపు కిటికీనుండి చలిగాలి వీస్తోంది. కిటికీమూసివచ్చివదినప్రక్కన కూర్చుంది పద్మ. అక్కడే కుర్చీలో కూర్చున్నాడు కమలాకరం యేదో ఆలోచిస్తూ. "వదినా అసలు ఎలావుందో ఏమిటో ఏమీచెప్పవేమిటి? నీ మనస్సులో యేదోవుంది. నాకైనా చెప్పవా?'' పద్మ కన్నీళ్ళు ఆపుకుంటూ అడిగింది. "ఏమీలేదు'' అంది కుముదిని ప్రశాంత వదనంతో.

"నువ్వు తిరుపతి వెళ్ళినప్పుడు మ్రొక్కుబడి చెల్లింపులో యేదో లోపం జరిగిందని నా అనుమానం'' అంది తిరిగి పద్మ.

కుముదిని మాట్లాడలేదు. పద్మ కొంచెంసేపు కూర్చుని వెళ్ళిపోయింది.

కమలాకరం లేచివచ్చి కుముదిని మంచంపై కూర్చున్నాడు. ఆమె చేతిని చేతిలోకి తీసుకుంటూ "నువ్వు దగ్గఱ దగ్గఱగా తిరిగి, అభిమానంగా చూచినప్పుడు మూర్ఖత్వంతో నీప్రేమను అందుకోలేక పోయాను. ఇప్పుడు నేను దగ్గరైన కొలదీ నీ హృదయ కవాటాలు మూసుకు పోతున్నాయి. ఏమిటీశిక్ష కుముదినీ?" డగ్గుత్తికతో అడిగాడు.

"అటువంటి దేమీలేదు. విచారించకండి. ఎక్కడ ఏలోకంలోవున్నా మీపైన నాకెప్పుడూ పరిపూర్ణ ప్రేమాభిమానా లుంటాయి."

పసిబిడ్డలా బావురుమన్నాడు కమలాకరం. ''వద్దు కుముదినీ, అటువంటి మాటలువద్దు. నీతోనే నాకు లోకం. నువ్వులేనిది నాకు బ్రతుకులేదు." కుముదినికి కూడ దుఃఖమాగలేదు, ''విచారించకండి. వైద్యం చేయిస్తున్నారు. ఫలితాని కెవరేం చేయగలరు?" అంది.

"అంతేనా? అంతేనా కుముదినీ? ఎవరూ ఏంచెయ్యలేరూ?" పసిబిడ్డ అమాయకంగా వేసినట్లుంది ఆ ప్రశ్న. జాలిగా నవ్వివూరుకుంది కుముదిని.

ఆ రాత్రి ఎవరు బ్రతిమాలినా కమలాకరం భోజనం చెయ్యలేదు. కుముదిని

దగ్గరే వుండిపోయాడు. కడకు ఆమె బలవంతంపై కొద్దిగా పాలు త్రాగాడు. "అలా ఎంతసేపు జాగారం చేస్తారు? వెళ్ళి పడుకోండి." అంది కుముదిని రాత్రి పదిగంటలకు. కమలాకరం మాట్లాడలేదు. ఓ అరగంట పోయాక మళ్ళీ హెచ్చరించింది.

"వైద్యం చేయించడం, సేవచెయ్యటం మినహా ఏమీ చెయ్యలేనా? కళ్ళప్పగించి చూడడమే కాని నిన్ను బ్రతికించుకోలేనా - అని ఆలోచిస్తున్నాను కుముదా."

ఇద్దరికీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

తెల్లవారితే వైజాగ్ ప్రయాణం. కాని తిరిగి తీసుకురాగలమా? తగ్గుతుందా? యేమైపోతుంది కుముదిని? ఎక్కడికెళ్తుంది? ఏమొచ్చింది కుముదినికి? ఎందుకిలాగైపోయింది. ఎక్కడికి పోతుంది? ఏమిటి చావంటే? మొన్న రైలు ప్రమాదంలో చాలామంది చచ్చిపోయారు. అంటే, ఎక్కడికి కెళ్ళారు? ఇక కనపడరూ మనకి? ఎందుచేత? ఎందుకింత భయం చావంటే? ఏమిటి చావుకి అర్థం? తిరిగి మొదటికే వచ్చాడు. ఏదోబాధ గుండెల్ని పీల్చి నుసి చేస్తోంది, ఎక్కడా మనస్సుకు కుదురులేదు.

"కుముదినికి ఎలాగైనా ఈ జ్వరం తగ్గిపోతే బాగుండును. మరెప్పుడూ ఆమెను తేలిక చెయ్యను. ఎలాగైనా తగ్గితే బాగుండును." అలా అనుకొంటూంటే అతడికి తాను ఢిల్లీ వెళ్ళేముందు దీనవదనంతో ప్రయాణం మానుకొమ్మని ప్రాధేయపడిన కుముదిని మూర్తి మన



డామె ఏంచేసి వుంటుంది? నాలాగే బాధ పడి వుంటుంది. భర్త ఎలాగైనా క్షేమంగా తిరిగి వస్తే బాగుండునను కొని వుంటుంది!" ని తలపోస్తూ ప్రక్కకు చూచాడు. నీరసంగావున్న కుముదిని పాలిపోయిన ముఖం, మూసివున్న కను రెప్పలు, చిక్కిపోయిన శరీరమూ అతడిని కలచివేశాయి

"కుముదా!" ఆమె చెక్కిళ్లు నిమురుతూ ఒక్కసారి ఘొల్లుమన్నాడు. కలతనిద్రలోవున్న కుముదిని ఖంగారుగా మేల్కొని "ఏమి" టని ఆత్రంగా అడిగింది. "నేను ఢిల్లీ వెళ్ళేముందు నువ్వు యిలాగే ఆరాటపడ్డావు కదూ నాకోసం?" చెప్పు కుముదినీ చెప్పు ఏంచేశావు? నన్ను బ్రతికించుకోవటాని కేంచేశావు?" అవి కన్నీళ్ళు కాదు-జలపాతాలు! కుముదినిని తడిపేస్తున్నాయి

"మిమ్మల్నెంత క్షోభపెడుతున్నాను నేను?" అంది నీరసంగా పైట చెంగుతో అతడి చెంపలు ఒత్తుతూ

"క్షోభకాదు కుముదా, అప్రయోజకత్వం. నేనేమీ చేతకానివాడిని, నువ్వు నీప్రాణం అడ్డువేసి నన్ను బ్రతికించుకున్నావు."

"............"

"మాట్లాడవేం? అందుకేగా నేను బ్రతికివచ్చాను?"

"అవును," నిశ్చలంగా, గంభీరంగా అంది కుముదిని

"నిజమా!" ఆశ్చర్యంగా అరిచాడు కమలాకరం.

"నిజమే! మీరు క్షేమంగా వస్తే తిరుపతి శ్రీనివాసుడికి కళ్యాణం చేయిస్తానని మ్రొక్కుకున్నాను ముందు. కాని మళ్ళీ, మీరూ మీకోపమూ గుర్తు వచ్చి అది అసాధ్యమని తేల్చుకున్నాను. ఇంకేదారీ కన్పించ లేదు" మాట్లాడ్తూంటే వస్తూన్న ఆయాసానికి కాస్సేపు వూరుకుని తిరిగి మొదలెట్టింది "మీరు లేని నేను అనవసరం, నేను లేకున్నా మీకు లోటులేదు అందుకే మిమ్మల్ని క్షేమంగావుంచి నన్ను తీసుకుపొమ్మని ఆ ఏడుకొండల వాడిని వేడుకున్నాను. దయతో ఆలించాడు నా మొర."

"కుముదా!" నిలువునా గజగజలాడిపోయాడు, కలవరపాటుతో వూగిపోయాడు "నిజమా? దేవుడున్నాడా? దేవుడు నీ మొర విన్నాడా? అయితే యిప్పుడు నిన్ను తీసుకుపోతాడా?"

"ఏమో, నే ననుకుంటున్నాను." నీరసంగా గోడవైపుకు ఒత్తిగిల్లింది

అల్లకల్లోలిత హృదయంతో మెల్లగా లేచి కిటికీవద్ద నిల్చున్నాడు కమలాకరం వెలుపల భయంకరమైన చీకటి అతడి హృదయావేదననూ, ఆత్మగ్లానినీ మరింత అధికం గావించి భయపెడ్తున్నది. అకారణంగా శరీరం జలదరించింది

"ఉన్నాదేమో దేవుడు· లేకుంటే కుముదిని కోరిక ఎవరు తీర్చుతారు? చనిపోవలసిన తాను ఎలా బ్రతికాడు? పడిపోవలసిన పెట్టెలో ఎక్కిన వాడిని ఏ కారణం అలా తరిమేసింది? ఆరోజు తిరుపతి కొండలపై కారు గ్రుద్దేసినప్పుడు తనకు మాత్రమే దెబ్బ తగలడమేం? కారూ, డ్రైవరూ, కుముదినీ అలా చెక్కు చెదరక వుండడమేం? భగవత్సాన్ని ధ్యానికొచ్చే కోట్లాది యాత్రికులంతా మూర్ఖులేనా? కాదు ఎంతమాత్రం కాదు నేనే మూర్ఖుడిని. ఎలాగైనా కుముదిని జబ్బు తగ్గా లనుకున్నాను 'ఎలాగైనా!' అంటే? నాకూ డాక్టర్లకూ ఎవరికీ లొంగని జబ్బు మమ్మల్ని మించిన యే అతీతశక్తి ప్రభావంవల్లనో తగ్గాలనే కదా! ఆ అదృశ్యశక్తి దేవుడా! అవును, దేవుడు వున్నాడు! వున్నాడు! ఆ దేవుడే నా కోరికతీరుస్తాడు నాకు కుముదినిని బ్రతికిస్తాడు!"

భారం భగవంతునిపై వెయ్యగానే హృదయభారం దిగిపోయి నట్లయింది కమలాకరానికి. ఒక అనిర్వచనీయ ప్రశాంతత ఆవరించింది మనస్సును "కుముదినికి తగ్గి, బలం చేకూరగానే నీ కొండకు వస్తాము. నా తల నీలాలు సమర్పించుకొంటాను కరుణించు తండ్రీ, వెంకటరమణమూర్తీ! ఇంత వరకు మూర్ఖంగా యేమేమో వాగేవాడిని అపరాధాలు మన్నించు. నీ ప్రభావం ప్రదర్శించి నాలోని నాస్తికత్వాన్ని పార ద్రోలు! నా అపరాధాలు మర్చిపో." అని ప్రార్థిస్తూ కుముదిని దెస చూచాడు. పాపం· నీరసంగా నిద్రపోతోంది ఆమెకు నిద్రాభంగం చెయ్యకుండా వెళ్ళి నేలపై కూర్చుని తల నిమరసాగాడు. "తగ్గిపోతుంది కుముదినీ, తగ్గిపోతుంది మనం హాయిగా వుందాం." అను కొంటూంటే అతడికే తెలియకుండానే నిద్ర ఆవరించేసింది ఆ నేలపైనే కూర్చుని, మంచంపై తలాన్చి గాఢ నిద్రపోయాడు

మర్నాడుదయమే గదిలోనికి వచ్చిన సావిత్రి, కొడుకు వాలకం చూచి దిగులు పడిపోయింది సుఖశాంతులులేక నలిగి పోతున్న కొడుకునుచూచి ఆమె మనస్సు కలగిపోయింది కుముదిని దెస చూచింది.

అప్పుడే మేల్కొన్న కుముదిని "అత్తయ్యా" అని పిలచింది

"ఏమమ్మా? ఎలావుంది?"

"రోజూలాగా బాధలేం లేవు చాలా తేలికగావుంది విశాఖపట్టణం వెళ్ళక్క ర్లేదేమో!"

"నిజమేనా?నిజమే? తగ్గిందటేతల్లీ!" సంభ్రమాశ్చర్యాలతో కోడలి దగ్గరగా వెళ్ళింది సావిత్రి

సందడి విని కమలాకరం లేచాడు. లేస్తూనే కుముదినిపైకి తిరిగాయి అతడి చూపులు నీరసంగానే వున్నా, ప్రశాం

తంగా తేలికగా కన్పించిం దతడి కామె ముఖం

"తగ్గిందా కుముదా ?" అన్నాడు నేత్రాలు ఆశ్చర్య మొలికించు తుండగా ఆమె నుదుటపై చెయ్యివేసి. రోజూ మాదిరిగా శరీరం వేడితో కాలిపోవడం లేదు సాధారణంగా వుంది

"తగ్గింది చాలా తేలికగా వుంది" అంది కుముదిని "కాని చాలా నీరసంగా వుంది."

"అమ్మా !" అమాంతం తల్లికాళ్ళు చుట్టేశాడు కమలాకరం "దేవుడు నన్ను దయదలిచాడమ్మా ఆ శ్రీనివాసుడు నా జీవితం నిలబెట్టాడమ్మా"

"బాబూ!" ఆశ్చర్యపోయింది సావిత్రి కుముదిని నోటినుండి అసలు మాటే రాలేదు, ఆమె ఆశ్చర్యం అవధులు దాటిపోయింది

"దైవమహిమ యింతకాలం తెల్సుకో లేకపోయాను మూర్ఖుడిలా ప్రవర్తించి నిన్నెంతో నొప్పించాను. క్షమించు కుముదా నీకు నయం కాగానే తిరుపతి వెళ్దాం" అన్నాడు ఎముకల పోగులా వున్న కుముదిని తల నిమురుతూ

"ఆ శ్రీనివాసుడే మనల్ని క్షమించాడు" అంది కుముదిని ఆనందభాష్పాలొలికిస్తూ

కోడలి జబ్బు తగ్గుముఖం పట్టడం, మూర్ఖ నాస్తిక వాదియైన కొడుకు పరిపూర్ణ భక్తుడుగా మారిపోవటంతో యింట్లో అందరికీ పండగలా వుంది కుటుంబమంతా నూతనానందోత్సాహాలలో మునిగి తేలారు.

## 7

హేమంతపు మంచుతెరల వస్త్రాలలో వింత సోయగా న్నొలక బోస్తున్నాయి తిరుపతి కొండలు స్పెషల్ టిక్కెట్టు కొని ఉదయం నాల్గుగంటలకే సుప్రభాత వేళకు హాజరయ్యారు వెంకటచలం కుటుంబ మందరూ శ్రీనివాసాలయంలో పూర్ణాలంకృతుడై అభయహస్తమిస్తూ నిల్చున్న ఆ కళ్యాణమూర్తిని దర్శించ గానే మనస్సులలోని మాలిన్యా లన్నీ కడుక్కు పోయినట్లై ముగ్ధప్రశాంతత ఆవరించింది

స్వామికి జరిగే సేవలన్నీ నేత్రానంద కరంగా, భక్తి ప్రపూరిత హృదయాలతో తిలకించి, ప్రసాదం అందుకుని బసకు తిరిగి చేరుకున్నారు

"నీకోరిక నెరవేరినది కుముదా! జంటగా దర్శనం చేసుకుంటా మన్న నీమ్రొక్కు నాల్గునెలలైనా తిరగకుండానే తీర్చేశావు" అన్నాడు మందహాసంతో కమలాకరం

ఆ మాటలువిన్న సావిత్రి, "ఎలాగైతేనేం, నీకిప్పటికి దేవుడు కన్పించాడు!" అంది కొడుకును.

"నిజమేనమ్మా, ఆ రాతివిగ్రహాలలో ఏముంటుందనుకున్నాను కాని యింత మహిమవుందని యేనాడూఅనుకొనలేదు

ఎలా మ్రొక్కుకున్నానో, నాలో ఈ మార్పు ఎలావచ్చిందో నాకే ఆశ్చర్యంగా వుంది'' అన్నాడు నున్నని గుండు సవరించుకుంటూ కమలాకరం అందరూ నవ్వేశారు

వెంకటచలంఅన్నాడు "తెలిసీ తెలియని మిడిమిడి జ్ఞానాలతో మిడిసి పడే వాళ్లందరకూ అనుభవమే గుణపాఠం. నిత్యం ఎన్నో ఆశలతో, కోర్కెలతో సతమతమౌతూ వుంటాం కాని అవి తీర్తాయో లేదో తెలియదు ఏదో అతీత శక్తి, మానవయత్నాన్ని మించిన అతీత శక్తి, ఆకోర్కెను తీర్చితే బాగుండునని ఆశపడ్తాము నీ మనసు లోని ఆ ఆశా కిరణోజ్వలమైన అతీతశక్తే భగవత్స్వరూపం''

"ఎంతనేర్చినా, ఎంతచూచినా,ఎంత సాధించినా మానవమాత్రులం ఆ చిద్విలాసుని పరిధినిదాటలేం దేవుడులేడంటూ అంతా నా గొప్పేనని అహం భావంతో విర్రవీగావు కాని ఆ రోజులలో నీకు నిజమైన, స్వచ్ఛమైన శాంతి లేనే లేదు మనకోరిక తీరినంతమాత్రాన ఆ విధాతను దూరడం అవివేకం మనస్సులోని కోరిక ఫలితం ఏదైనప్పటికీ భగవంతునిపై వేసి మనం నిశ్చింతగా తప్పుకోవడంలోనే ఆత్మశాంతి, తృప్తీవున్నాయి ఈ అస్తిత్వశబ్దమే మానవునికి జయకరమైనది, ఈ సత్యాన్ని ఎప్పుడో ఒకప్పుడు ప్రతివ్యక్తీ గుర్తించక పోడు ఎప్పుడు మనజీవితాని కేంకావాలో మనకేతెలియని అల్పజీవులం ఏనిముషాన ఈ జగన్నాటకంనుండి విరమిస్తామో తెలియదు, అయినా ఈ బుద్బుద ప్రాయ జీవితం నిమిత్తంవిరంతరం కొట్టు మిట్లాడుతూనే వుంటాం

"విజ్ఞానార్థం విదేశీవిద్య నెంత అభ్యసించినా స్వజాతి సంస్కృతిని మరువక పోవడమే ఔన్నత్య చిహ్నం విదేశ సాంప్రదాయ వ్యామోహంతో కృత్రిమ సంస్కృతి నలవరచుకో ప్రయత్నించినా దానికివుండే ఆయువు తక్కువ యుగయుగాలనుండీ, తరతరాలుగా నరనరాల్లోనూ జీర్ణించుకుపోయిన నీ జాతి సంస్కృతినీ, ఔనత్యభావాలనూ తుడిచి పారవేయడం అసాధ్యం. నిద్రాణమై వున్న జన్మ జన్మాంతర సంస్కృతి ఎప్పుడో ఒకప్పుడు మేల్కొని జ్ఞాన మార్గం చూపకమానదు ''

అవనత శిరస్కుడై తండ్రి బోధనంతనూ నమ్రతతో, గౌరవంగా విని ఎదలోపదిలపరచుకున్నాడు కమలాకరం.

ఇప్పుడు ప్రతి ఉదయం మెలుకువ వస్తూనే కమలాకరం చెవులకు కుముదినీదేవి మధుర కంఠస్వరంతో "కౌసల్యతనయ శ్రీరామ కౌస్తుభాంగా.." అంటూ తన ఆరాధ్య దైవానికి చేసే సుప్రభాత సంకీర్తన తేనె సోనలు కురిపించుతూ చెవుల సోకుతుంది

"సుప్రభాతం' నా జీవితానికే సుప్రభాతం'" భక్తి ప్రపుల్లమానసంతో శ్రీనివాసునికి అంజలి ఘటిస్తాడు ✱

Printed and Published by A Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road Hyderabad-1 Controlling Editor Sri "CHAKRAPANI"

## గతనెల చిత్ర పరిచయ పోటీ



*బహుమతి పొందిన వ్యాఖ్య :*

"జీవన నిదాఘ పథంబులో స్త్రీపురుషుల బేధమేల ?
భర్తనీడను సౌఖ్యమొందే స్త్రీకి హక్కుల గొడవదేల ?

పంపినవారు పి చినవెంకటరాజు, హైదరాబాద్

---

ప్రకటన:

ఈ నెలనుంచి ఈ పోటీ శీర్షికను ఆపుచేస్తున్నాము. త్వరలో పాఠకులకొరకు మరొకరకం పోటీలు ప్రారంభించగలము

—ఎడిటర్.



# నేను ఇప్పుడు చేయగలిగిన సహాయమేదైనా వుందా?

దేశ ఆంతరంగిక రక్షణకు ప్రతి భారతీయ మహిళ ఇప్పుడు చేయగలిగింది చాలా వుంది. మహిళా వ్యవస్థల ద్వారా రక్షణ కృషిలో పాల్గొనండి. చేయవలసింది ఎంతో వుంది. జాతీయ రక్షణ నిధికి విరాళాలివ్వండి, విరాళా లిచ్చేటట్లు ఇతరులను ప్రోత్సహించండి. రక్షణ సర్టిఫికేట్లు కొనండి ఇదేగాక మీరు క్రమశిక్షణ, ప్రవర్తన, దృక్పథం మొదలైన వాటిలో స్వయంగా చేయవలసిన కృషి ఇంకా వుంది

- *వ్యర్థ వ్యయం మానండి, అనాలోచితంగా కొనడం మానండి, అధిక ధరలను చెల్లించవద్దు*
- *బంగారం కొనవద్దు దేశావసరాలకు మీ బంగారం యివ్వండి*
- *మీరు ఏపని చేస్తున్నా దృఢతర దీక్షతో పనిచేయండి, సమర్థంగా చేసిన ప్రతి పని జాతీయ కృషిని, భారతదేశ స్థితిని శక్తివంతం చేస్తుంది*
- *అలసత్వం వదిలి ఆచరణకు పూనుకోండి*

# అప్రమత్తులై వుండండి

## —జాతీయ రక్షణ కృషిలో పాల్గొనండి

DA 62/F7

